పద్యములు) ఆతని రెండవ కొడుకు తిరుపతియే యేతత్కృతిప్రేరకుఁడు ఈతడు క్రీ. 1775 దాకనున్నవాఁడు (చూ 56 నుండి 72 దాఁక పద్యములు) వీరి వంశము కృష్ణా, గుంటూరు మండలములందు చిర కీర్తినార్జించినది దాతృత్వమునందును, శౌర్యమునందును నీవంశము వారు సుప్రఖ్యాతులు. ఈవంశమున నేడు వర్ధమానులుగా నున్న శ్రీ వెంకటహయగ్రీవరావుగారి తాతగారు వెంకటగోపాలరావుగారు, విలువిద్యలోను అశ్వారోహణకలలోను జితశ్రములని, చాల సౌందర్య వంతులని, సకలకలా రసికులని వారిని ప్రత్యక్షముగా నెఱిఁగినవారు మా నాయనగారు చెప్పఁగా వింటిని వారిని గూర్చి వింతకథలు, కృష్ణా గుంటూరుమండలవాసు లిప్పటికిని జెప్పుకొనుచుందురు వారి ప్రధాన గ్రామముగు రాచూరి దగ్గఱనే పల్లెకోనగ్రామమున భట్టురాజులు చదువ గా నీ క్రిందిచాటు పద్యముల నీ వంశమువారి యోగ్యతను వెల్లడించు వానిని నేను చాటుపద్యమణిమంజరిలోఁ బ్రకటించితిని

సీ సుమనశ్శాక్తి కానల్పసు ప్రతీకంబుతోఁ
కంబుతోఁ బుండరీకంబుతోడఁ
బల్లవకుసుమ సంపాదనై కాంతుతో
గంతుతో రోహిణీకాంతుతోడ
నధిగతపరమోగ్రుఁ డైన స్వర్భానుతో
ఖాను నలచిత్రభానుతోడతో
దండిగాండీవకోదండాభిరాముతో
రాముతో నందనారాముతోడ

గీ నీదుసత్కీర్తి నీమూర్తి నీప్రతాప
దీప్తి నీదోర్బలస్ఫూర్తి దీటు మిగిలి
యలరె మాణిక్యరాయవంశాబ్ధిసోమ
భాసురగుణాళి భావభూపాలమౌళి

సీ. ఒకతాత కతుబుశాప్రకటదక్షిణభుజా
దండుఁడై కోవెలకొండ యేలె

నెలమి రెండవతాత యిభరాముపాదుశా
పంపునఁ బెదకొండపల్లె యేలె
మహి మంచు ముమ్మడిమాణిక్యరాయఁడు
వినుతి కెక్కినకొండవీటి నేలె
రాణించు రఘుపతి మాణిక్యరాయండు
పరభయంకరవృత్తిఁ బరిఢవిల్లెఁ

గీ దండ్రికంటెను బెదతండ్రి తండ్రికంటె
తాతముత్తాతలకు నెల్ల ఖ్యాతి దనర
వన్నెగంటి కృష్ణానేని వంశమునను
నిర్మలోపాయ బళిరమాణిక్యరాయ

సీ. దురములోఁ గదిసినదొరలశిరంబులు
భేదింప బలుదిట్ట నీదుపట్ట
కదనరంగమునందుఁ గదిసినపరరాజ
నిచయంబులను దాఁకు నీదుబాకు
జన్యసంతోషులై చను దెంచువైరుల
నిముసంబులో గ్రుంగు నీదు బాంగు

గీ. సొరిది నీడాలు వైరులచుక్కవ్రాలు
బళిర నీపౌరుషం బెన్నఁ దరముగాదు
అవనిమాణిక్యరాజవంశాబ్ధిచంద్ర
రాజవేంకటగోపాలరాయభూప.

సీ. శ్రీకరవిజయలక్ష్మీ విరాజితవైభ
వేంద్రుండు సద్గుణసాంద్రమూర్తి
మాణిక్యరాడ్వంశమందార భూజంబు
పద్మనాయజ మనఃపద్మహేళి

మన్నకులోద్యాన మధుమాసపైకంబు
కామినీమన్మథాకారవేషు
నలిపుణ్యపతిగోత్ర వితతాబ్ధిచంద్రముం
డర్థిచాతక వార్షికాంబుదంబు

గీ. అని జనుల్ మెచ్చఁ గీర్తిచే నలరి తహాహా
చరితదేశాంత సత్కవీశ్వరనితాంత
వర్ణితస్వాంత రేపల్లెపూర్ణిశాంత
ధీపితాటోప! వేంకటగోపభూప

వీ రనేక దేవాలయములకు భూముల నిచ్చిరి. బ్రాహ్మణుల కనేకు లకు వసతులు గల్పించిరి

మాణిక్యారావువారు కల్పించిన దేవబ్రాహ్మణవృత్తులు,

1. పెద్దపూడి —

ఇదివకసంతు, కూచిపూడి సర్కారు. ముర్త్యజానగరు తాలూకా లోనిది. ఇదిప్రస్తుతము వాసిరెడ్డివారికిపోయినది

పూర్వము అరణ్యముగానున్న ఈ స్థలములో ఋషులు సోమేశ్వ రస్వామిని, వీరు గోపాలస్వామిని ప్రతిష్టించిరి, ౧౦౫౬ శకంలో గజప తాన్వయులు, గణపతి మహారాజులుగారు పరిపాలించిరి వీరికి ప్రధానులు గోపరాజురామన్న. గ్రామకరణీకపు మిరాశీలు వీరు ఏర్పరచుచు. తెల గాణ్యులు, కౌశికగోత్రులైన పుచ్చరాజువారికి సగభాగంగా యిచ్చినారు. ౧౨౪౦ శకం లగాయతురెడ్డి రాజులు ప్రభుత్వంచేసిరి వీరికాలములో కొండవీటిసీమ 44 అగ్రహారములు బ్రాహ్మణులకు దానంచేసిరి, వేగినాటి వారికి 3 అగ్రహారములు ద్రావిళ్లకు 5 వెలనాటివారికి 36. ఈగ్రామము వెల్నాటి వారిక్రిందకువచ్చెను ఈ గ్రామం యెల్లేపద్ది లక్ష్మణదీక్షుతు లుకు, మద్దర్మనాల వల్లభసోమయాజులుకు దానంచేసిరి. పైజీర్ణ దేవా యములను మరల ప్రతిష్టించి ఏర్పరచినవసతులు కుం ౦౽౦ శ్రీ సోమే శ్వరస్వామివారికి కుం ౦౽౦ గోపాలస్వామివారికి ౧౫౦౦ శకం వరకు చక్కగాజరిగెను. మహమ్మదీయుల పరిపాలనలో విచ్ఛిత్తుగలిగినది, కొండ వీటిసమతుబందలు చేసేటప్పుడు, ఈ గ్రామం కూచిపూడి సమ

తులో చేర్చిరి అప్పటికి షడ్దర్శనాలవారు ఖిలమైపోగా తిమ్మరాజువారి పరం చేయబడినది కొండవీటి సీమవంతుచేసి జమీందార్లకు పంచిపెట్టే టప్పుడు ఈ వంతు ఈగ్రామం రమణయ్య మాణిక్యరావు వంతులో వచ్చి రేపల్లెతాలూకాలో దాఖలు అయినది ౧౧౨౨ ఫసలీ మొదలు ౧౧౨౬ ఫసలీవరకు పరిపాలించిరి తరుతాత వీరితమ్ములు వల్లన్నగారు వచ్చి ఈ గ్రామానికి పశ్చిమభాగమందు వనంతోటవేయుంచి శ్రీ వేణు గోపాలస్వామి వారికి దానవ్యయం ఒకకుం ౦౽౦కుభూమియిచ్చినారు. ఈ వల్లన్నగారు. సీతన్నగారు గోపన్నగారు ౧౧౬౭ వ ఫసలీవరకు ప్రభుత్వం చేశేరు. ౧౧౬౮ ఫసలీలో సీతన్నగారి కుమారులు జంగన్న మాణిక్య రాయలంగారు చాల ధర్మవంతులై రాజ్యము పరిపాలించుచు శ్రీసోమే శ్వరస్వామివారి ఆలయం పునః నిర్మించి కుం౦౽౦కు భూమి దానంచేసిరి మరియువీరు చేయించిన దానముల వివరం. అయితం వేదావధానులు, రాయప్రోలు సూరంబొట్లు వట్టెం రామలింగ దీక్షితులు, పోతుకుచ్చి పాపంబొట్లు, నేతి తెలగావధానులు. బూరుగుల నిమ్మంబొట్లుగార్లకు ఒకొ క్కరికి కుం ౭౨ చొ॥ దానంచేసిరి. వీరు ౧౧౬౮ నుంచి ౧౨దే౧ ఫసలీ వరకు 33 సం॥ ప్రభుత్వంచేసిరి ౧౨౦౨ లో వీరికుమారులు భావన్న గారు రాజ్యమునకువచ్చిరి. వీరు కూడతండ్రివలె దానములుచేయుచూ రాజ్యంపరిపాలించి ౧౨౧౩ ఫసలీవరకు రాజ్యంచేసిరి ఆర్థకదుస్థితివల్ల ౨౨ గ్రామాదులు వాసిరెడ్డివారికి అమ్మటవల్ల పొన్నూరు వగైరాలతో కూడ ఈ గ్రామమువారికి పోయినది, కనుక సదరు ౧౨౧౩ నుంచివాసి రెడ్డి వెంకటాద్రినాయుడుగారు పరిపాలించిరి ఈ గ్రామమీకట్టు ౩౬కు చ్ఛళ్ళలోవనంతోటలు ౬టికు వల్లన్నగారుకు ౦౽౦ యెల్లేపెద్ది సుబ్బన్న ౧౽౦ ప్రబల పేరుభొట్లు ౦౽౦ జాస్తేభావన్న ౦౽౦ చదలవాడ పట్టాభి రాముడు యీ చదలవాడ రామన్నచేరిఒక ౦౽౦ గ్రామం కవార ౦౽౦ మాలపల్లి ౦౽౦ చెర్వులు 3 టికి యెల్లేపద్దిసుబ్బన్న చెర్వు ౦౽౦ చడలవారమణప్ప చెర్వు ౦౽౦ కర్ర తిరుపతి ౦౽౦ - ౦౽౦ జయనిపాడు డొంకలు ౦౽౦ చవుడుభూమి ౦౽౦ యీ యినాములు ౦౽౦ వెరశి ౭౫౦ పోను మిగతాది గుడికట్టు

(2) వల్లూరు గ్రామం గుడికట్టు కుచ్చళ్లు ౧౯౦

ఈ గ్రామం ౧౧౨౨లో రమణయ్య మాణిక్యరాయలంగారు పరిపాలించిరి. ౧౧౯౦ వరకు రమణయ్యగారు వల్లన్నగారు సీతన్నగారు పరిపాలించిన తరువాత నిజాముల్ ములుకు పెద్ద కుమారుడైన నాసర జంగు దీనిని పరాసువారికి యిచ్చినారు. వారు ౧౧౯౦ నుండి ౧౧౯౮ వరకు ప్రభుత్వం చేసి అపజయులు కాగా సీతన్నమాణిక్యారాయణంగారి అన్న కుమారుడు గోపాలరావు మాణిక్యరాయణింగారు ౧౧౯౮ లో ప్రభుత్వం చేసి సీతన్నగారి కుమారుడైన జంగన్నగారు ౧౧౯౬ ప్రభుత్వానికి వచ్చి ౧౧౬౮ ఫసలీలో మజుకూరి మిరాసదార్లు అయిన వల్లూరి వేంకటాచలం ప్రర్వతాలు శంకరప్ప, విస్సంరాజు, పునరుద్ధరించిన గణపేశ్వరస్వామి వీరభద్రస్వామివార్ల ఆలయములు శ్రీ పూర్వమున్న చెన్నకేశ్వరస్వామివారి ఆలయము మ్లేచ్ఛులచే విచ్ఛిత్తుచేయబడినది కనుక తత్స్థానే శ్రీ వేంకటగోపాలస్వామివారిని ప్రతిష్టించి శ్రీ ఆంజనేయ స్వామినికూడ ప్రతిష్టించిరి పై దేవాలయములు శ్రీవారు ఇచ్చినవసతులు

కు ౧ శ్రీ గణపేశ్వరస్వామి, వీరభద్రస్వామివార్లకు కు ౧ శ్రీ వేణుగోపాలస్వామివార్లకు

౧౧౬౬ ఫసలీతో కుంఫిణీవారు మృత్తుజానగరుకు ప్రభుత్వానికి వచ్చి 3 సం॥ పరిపాలించి తిరిగి జమీందార్ల పరం చేసినారు వీర్లకు మాళ్లు భావయ్య మాణిక్యరావు ౧౨౦౨ లో రాజ్యమునకువచ్చి వీరు పాలింపుచుండిరి.

8 కట్టెంపూడి —

గోపరాజురామన్నగారు ఈ గ్రామానికి తూములింగన్నగారికి యేకభోగముగా మిరాశీ వ్రాసియిచ్చినారు ఈ తూములింగన్నగారు గ్రామమునకు దక్షిణభాగమందు కేశవస్వామివారి ఆలయమున్నూ ఉత్తరం శ్రీ మల్లికార్జున ఆలయం కట్టించి విటికి ౦౪౦ మాన్యం ఇప్పించిరి ఇదే ప్రకారం ౧౭౦౦ శకంవరకు జరిగెను తరువాత తురకల పరిపాలనలో ఇది విచ్ఛిత్తు అయినది. అప్పుడు పొన్నూరు సమతులో

నిది అప్పుడు మాణిక్యరావువారు పాత్రునివారు అలవర్తివార్ల అధికారములోనికి వచ్చినది. తరువాత కొండవీటిసీమ 3 వంతులుగా చేయగా ఈ గ్రామం రమణయ్య మాణిక్యరావు వారికి అప్పచెప్పగా వారు ప్రభుత్వంచేసి ౧౧౨౭ లో సీతన్న మాణిక్యరాయలంగారు ప్రభుత్వానికివచ్చి అచ్చన్నగారికి కు ౦౪౦ మాన్యం ఇప్పించినారు. వీరి అన్నదమ్ములు ఆరుగురు క్రమేణ ప్రభుత్వం చేసి గోపాలమాణిక్యరాయలంగారు ౧౧౬౮ వరకు ప్రభుత్వం చేసిరి వీరి కుమారులు సీతన్నగారి కుమారులు జంగన్నగారు ప్రభుత్వానికి వచ్చి ౧౫౦ కుచ్చెళ్ల యీనాములు ఇప్పించిరి, ౧౨౦౧ వరకుప్రభుత్వం చేసిరి వీరి కుమారులు భావయ్యమాణిక్యరాయలంగారు ౧౨౦౨ లో రాజ్యలకు వచ్చి ౧౧౨౨ ఫసలీ వరకు ప్రభుత్వం చేస్తూవున్నారు గ్రామంగుడికట్టు కుచ్చళ్లు౧౭౫౮

(4) పూండ్ల — పొన్నూరుతాలూకాలోని రేపల్లెలోని రాజా భావయ్యమాణిక్యరావు సర్కారులోని ౧ ౨౨౨ ఫసలీ, ౧౨౦౧ నుంచి గ్రామం గుడికట్టు ౧౨౨ కుచ్చళ్లు

(5) ఇనగర్తిపాడు — పొన్నూరుసంతు రేపల్లె తాలూకా పైమాదిరిగా పరిపాలనలు జరిగెను ఈగ్రామం విష్ణువర్ధనుడు పరిపాలనలో చెఱుకూరు త్రివిక్రమస్వామివారికి అగ్రహారం యిచ్చినారు గ్రామం గుడికట్టు కుచ్చళ్లు ౧3

(6) నుదురుమాడు ఖండ్రిక — ఈఖండ్రికలో 5 గ్రామాదులున్నవి ఒకప్పుడు ఈ 5 గ్రామాదులలోని రుసుము మాణిక్యరావు వసూలు చేయుచుండిరి

(7) మండూరు — కూచిపూడి సర్కారు ముర్తున్నజాగరు రాచూరు తాలూకే

ఇక్కడ మాండవ్యమహాముని కొంతకాలం తపస్సుచేసిన చోటు ఇక్కడ శివలింగం ప్రతిష్టించిరి దీనికి మాండలేశ్వరస్వామి అని పేరు. దీనికి దక్షిణభాగమందు వేణుగోపాలస్వామివారిని ప్రతిష్టించిరి ఇది అరణ్యము గనుక మునిశ్వరులే ఈ దేవాలయములను పూజించుచుండిరి.

౧౧౨౨ లోకొండసీమ ౧౮ వంత్లు చేసిపంచిపెట్టుటలో ఈ గ్రామం బరభద్ర పాత్రుని అప్పన వంతు వచ్చెను ఈయన ౧౬౦ కుచ్చిళ్లు శ్రీస్వామివార్లకు యిచ్చి వుత్సవము యేర్పాటుచేసిరి ఈయన తదనంతరం ఈయన కుమార్డు పాపన్న రాజ్యపాలన చేయుచుండగా మాణిక్యారావు వారు బలవంతముగా ఆక్రమించి వొలివేరు మెడ్లపల్లి మండూరు చినగాదెలవఱ్ఱు అంగలకుదురు కొండపాడు వగైరా గ్రామాదులు పాత్రునివారి మనోవర్తిక్రింద వుంచిరి.

౧౨౧౧ లోరాచూరు తాలూక వేలం వేయబడుటవల్ల ఈ గ్రామం మల్రాజు వెంకటగుండారాయునింగారు కొనిరి గ్రామంగుడి కట్టుకు ౬౦

చినగాదెల వఱ్ఱు కూచిపూడి తాలూకా రాచూరు సర్కారు ఇదిమండూరుకు వాయవ్యమూల వున్న ఒకదిబ్బ, ఈప్రదేశ మందు మండూరు ప్రజలు చిన్న గాదెలు కట్టుకొని ధాన్యంనిలవ చేసుకొంటూ వచ్చి క్రమేణరయితులు నివసించుట వల్ల చినగాదెలవఱ్ఱు గ్రామమయినది. ఇది బలభద్రపాత్రునివారిది రాచూరుమాణిక్యరావువారు జయించి బలభద్రపాత్రుని వారికి మనోవర్తిక్రింద వుంచిన ౮౪. గ్రామాదులలో యిది ఒకటి. మాణిక్యారావుజంగన్నరావు తిరుపతి రాయనింగార్లు ఆయన అన్నదమ్ములు భాగం పంచుకొనుటలో ఇది తిరుపతీ రాయణింగారి వంతువచ్చినది తిరుపతి రాయణింగారికి సంతానం లేకపోవుటచేత జంగన్నగారి కుమారుడైన భావన్నారాయణంగారు ౧౨౦౮ ఫసల్లో ప్రభుత్వమునకువచ్చి ౧౨౧౧ లో రాచూరు తాలుకా కుంఫిణీవారిచేత వేలంవేయనా ఈ గ్రామం రాజామల్రాజు వెంకట గుండారాయణింగారి పరిపాలన లోనికి పోయినది. గ్రామంగుడికట్టు ౨౪ కుచ్చెళ్లు

జానంచుండూడు —ఇదిగుంటూరు వండురు తాలూకా ౧౧౨౨ ఫసలీలో మూడు వంతులుగా భాగించి నప్పుడు ఇది రేపల్లేతాలూకాలో చేర్చబడిరమణయ్య మాణిక్యరావు గారి పరంచేయబడగా క్రమముగా మల్లన్న సీతన్న గోపన్న జంగన్నగార్లు ౧౧౮౨ ఫసలీవరకు ప్రభుత్వం

చేసిన తరువాత అన్నదమ్ములైన జంగన్న తిరుపతిరాయనంగార్లు భాగం పంచుకొనుటలో | తిరుపతిరాయనంగారి వంతువచ్చుటవల్ల రాచూరు తాలూకాలోచేరినది వీరికుమారులైన అప్పారాయనంగారు సీతన్నగార్లు ౧౨౦౮ వరకుపాలించి నిస్సంతువల్ల జంగన్నగారి కుమారులైన భావన్న గారు 3 సం॥ పరిపాలించిన తరువాత ౧౨౧౧ వేలంలో మల్రాజు వారికి పోయెను గుడి కట్టుకుచ్చళ్ల ౮౦

(10) పొత్తూరు సంతుగుంటూరు సర్కారు రాచూరుతాలూకా – ఉత్తరం సోమేశ్వరస్వామి తూర్పు వేణుగోపాల స్వాములను ప్రతిష్ఠించిరి ౧౧౮౨ లో పంచుకొనుటలో తిరుపతి రాయన్నాగారివంతులో వచ్చి రాచూరులో చేరినది గుడి కట్టు ౭ ఎ మిగతా విషయములు పై దానిమాదరి —

(11) గారపాడుసంతు గుంటూరుసర్కారు రాచూరు తాలుకా – ఇది అగ్రహారంగాసాలు 1కి ౫వరహాలు ఇచ్చులాగున రమణయ్య మాణిక్యారావువారు ఏర్పాటుచేసి తిరుమల కృష్ణసోమయాజులం గారికి యిచ్చిరి ౧౧౮౨ లో కృష్ణసోమయాజులంగారు ఈ గ్రామం తూర్పున గంగాధర స్వామిని ప్రతిష్ఠించి కుం౧౦ మాన్యంను దక్షిణభాగమందు శ్రీఆంజనేయ స్వామిని ప్రతిష్ఠించి కుం౧౦ యిచ్చిరి మిగతది పై దానిమాదిరి. గ్రామం గుడికట్టి ర. 3 పగ్గానికి ౧ కి ౬౮ కుంటలు ప్రాప్తి అయిన కుచ్చళ్లు ౨ఎ

(12) సుద్దపల్లి — సంతుగుంటూరు సర్కార్ రాచూరుతాలూకా గ్రామాన ఐదు పశ్చిమమున కాశీ విశ్వేశ్వరస్వామిని మధ్యను వేణు గోపాలస్వామిని దంటు దేవరాయి దీక్షుతులు ప్రతిష్ఠించి కు౨దానంచేసి అగ్రహార మనుభవించుచుండిరి ఇదిపై వారికి కృష్ణదేవరాయలుచేత యివ్వబడిన అగ్రహారం మిగతా కథ పై దానిమాదిరి గుడికట్టు. కు॥ ౭ ఎ

కొండవీటికైఫీయతులో మాణిక్యారావు వారిక ప్రసక్తమయిన గ్రంథభాగమిది — ఉదయగిరి అద్దంకి, వినుకొండ, బెల్లకొండ, నాగార్జున కొండ, తంగేడు కేతవరం మొదలైన దుర్గములు జయించి కొండవీడు వచ్చి అప్పుడు పరిపాలించుచున్న ప్రతాపరుద్ర గజపతి కుమారుడు

వీరభద్రగజపతిని జయించి అతనికి అభయమిచ్చెను .సింహాచలము వరకు సాధించెను, కటకం పర్యంతం జయించి గజపతివారి కుమార్తెను బలాత్కారముగా వివాహము చేసుకొనెను సింహాచలం అవతలి దేశములు గజపతివారికి వదలి కొండవీటికి నాళ్వతిమ్మరుసు మేనల్లుడు నాదెళ్ల గోపమంత్రికి పట్టంగట్టెను నాదెళ్ల గో-మంత్రిగారు దేవాలయము కట్టించి పరిపాలించుచుండెను రాయల భార్య కంభంలో ఉండి పోయి తన స్వంతద్రవ్యముతో కంభం చెరువు త్రవ్వించెను దేవాలయముకట్టించినది ౧౫౨౯ వరకు కృష్ణరాయలు రాజ్యంచేసెను తరువాత అచ్యుతరాయలు ౧౫౩౦ నుంచి ౧౫౪౨ వరకు ౮ సంవత్సరములు పరిపాలించెను ఇతనికి ప్రధానియైన రామయభాస్కరునికి అధికారమిచ్చి కొండవీటికి పంపగా పూర్వము రెడ్డిరాజులు కట్టించిన సౌధములు గుల్లు పడిపోవుటవల్ల ఆ రాళ్లు తెప్పించి యీ దుర్గానికి పశ్చిమ భాగమందు మావులకోట గట్టించి పట్నంనిర్మించి గోపీనాధస్వామివారిని ప్రతిష్టించెను. ఇక్కడ ఒక బావిత్రవ్వించి తిరుగుబాటు చేసిన పాలెగాండ్లను నమ్మకముమీద పిలిపించి స్వామివారికి ప్రదక్షిణం చేయవలసినదని చెప్పి అదివరకు పూర్వమే తగిన ఏర్పాటు చేయబడిన ఆబావిలో వారిని కూలద్రోసి చంపెనని ప్రతీతి ఈ పట్టణమునకు కొండవీటి గోపీనాధపురమని నామాంకితము చేసిరి ఈ పురం దగ్గరగా వెన్నముద్ద కృష్ణుడు మూలస్థానేశ్వరుడు అంగడివీరభద్రుడు మొదలయిన దేవస్థానములు నిర్మించెను. ఈయన సహోదరి చిన్నమాంబ ఈ పట్టణానికి మూడుఘడియల దూరాన రామచంద్రపురమనే అగ్రహారము కట్టించి పర్వతేశ్వరుడను ప్రతిష్టించి, గోపీనాధ అనే చెరువు త్రవ్వించి సాంతలూరు అనే అగ్రహారమును ధారాగ్రహితముచేసేను ఇతను మొగలాయి ఫౌజును జయించి రాజ్యమునిర్వక్రముగా పరిపాలించెను విజయనగరమందు సదాశివదేవమహారాయలు పరిపాలనము చేయుచుండి అత్రేయగోత్రులైన విరలయ్య దేవమహారాజుగారిని ఈ దేశానికి పట్టం కట్టిరి. ఇతను కొండసింగయ్య అను దేవాలయమును ఈ దేవాలయమునకు ఉత్తరాన కొండపల్లి చెరువు పడమర వకతోట నిర్మించెను. ఇతను

౧౪౪౩ మొదలు ౧౪౭౦ వరకు ౨౭ సం॥లు పాలించెను. విజయ నగరంలో అప్పుడు పరిపాలించుచున్న రామరాజయ్యదేవమహారాయలను ౧౪౬౭లో తురకలు చంపి రాజ్యము స్వాధీనము చేసుకొని మల్కిరాయపాదుషావారు పరిపాలించుచూ ముర్తుజ అనే తురకను ఈ దేశానికి పరిపాలనకు పంపిరి అతను దేవాలయములు పడగొట్టి గోపీనాథ పురమునకు ముర్తుజానగరమని పేరిడి రాజ్యము చేయుచుండగా శ్రీ వీరప్రతాపతిరుమల దేవరాయలు కృష్ణయావలనున్న మొగలులను జయించి సామ్రాజ్యానికి వచ్చి ఆనెగొంది తిరుమల దేవరాయల పుత్రులయిన శ్రీరంగరాజయ్యకు ఈ దేశానికి ప్రభుత్వం కట్టిరి. ఆయనే కృష్ణాతీరమందున్న మూరంపూడి అనే గ్రామమును గంగాధర రామేశ్వర స్వామివారికి దానంచేసిరి. ఇది ౧౪౭౪లో జరిగెను. అజరత్ విభురా పాదుశాహావారు కృష్ణా ఆవలిభాగం ప్రభుత్వం చేస్తూయుండిరి కర్ణాటకపాదుషాహా శ్రీరంగరాయలను జయించి కృష్ణ దక్షిణదేశమందున్న వినుకొండ మొదలైన సాధించవలెనని రాయరావు అనే బ్రాహ్మడికి సేన ఇచ్చి పంపగా ఆయన వినుకొండ, బెల్లంకొండ, నాగార్జునకొండ, మాచెర్లసీమ జయించి వెలమవారు పరిపాలించుచున్న నేలకోట కొత్సెర్ల తోట జయించి అద్దంకి, అమ్మనబ్రోలు, కందుకూరు, పొదిల, దరశి కంభం, కాకర్ల, తూపాడు, తంగేడు, గురజాల, కేతవరం, కోడెపూడి మొదలైన నేలకోటలను జయించి కొండవీటిని ముట్టడించగా రాయలవారి ముతాలీమతులై ? మురాధిపతులైన ? వెలుగోటి తిమ్మన్నలోబడి రాయరావుకి అధీనుడైనాడు ౧౫౦౨లో స్వాధీనపరచుకొని ౧౫౦౪వరకు పరిపాలించి గోల్కొండకువెళ్లెను గోల్కొండలో ఉన్న అజరత్ గారు ఇక్కడ మన పూర్వీకుడు ముర్తుజచే గట్టపడిన పట్టణము బాగుగా కట్టించెను, వినుకొండ, బెల్లంకొండ మొదలయిన దుర్గముల వ్యవహారములుగూడ ఇక్కడ జరుగునట్లు యేర్పాటు చేసి దీనికి ముర్తుజానగరు సర్కారని పేరిడి కొండవిటి సీమనంతయు ౧౪ సమతులుచేసినారు పాలడ్లు, పులివఱ్ఱు, ప్రతిపాడు, సంతరావూరు, నూత్తక్కి, చీరాల, పొణం, మంగళగిరి, మునిగోరు నాదెళ్ల, రావిపూడి కూచిపూడి, గుంటూరు, తాడికొండ ఈ విధముగ ౪౪ గ్రామాదులను ౧౪ సమతులు చేసిరి.

కొండవీటి జిల్లాలో హుజూరు నాయకుడు ఖిల్లాదారు హోదాలో యున్న మాణిక్యరావు స్వదేశిముఖి అనిన్నీ, మానూరువారికి మజుందారనిన్నీ, పాత్రునివారికి దేశపాండ్యగిరిన్నీ సదరు సమతులను స్వాధీనపరచి నాదెళ్ల సమతుకు కమ్మవారిని నియమించి వారి పరంగా మామ్లియతు జరిగేటట్లుగా నిర్ణయించినారు. తరువాత మహమదుపాదుషాహి రాయలంగారు గోల్కొండను రాజ్యంచేయుచు బందిపోట్లను అడచుటకై అమీనుముల్కును కొండవీటికి బంపగా అతను బందిపోటును అణచి ౧౬౧౪లో ముల్లగూరి అగ్రహారమును పాడుచేసి తన పేర మల్కాచెర్వు, మల్కామాహాలు, మల్కాబావి కట్టించి ముల్లగూరిని యాబలూరి గ్రామంలో కల్పి అమీనుబాదా అను పేరుపెట్టి దుర్గం కట్టించిరి. ఒక బురుజు పేరు మల్కాబురుజని పేరుపెట్టి హిందువుల కట్టడముల పాడొనరించి ౧౬౧౨ నుంచి ౧౬౨౦ వరకు ౭ సం॥ పరిపాలించెను. కాలమందు సిగిలిన్‌ఖాను ఈ పురమువచ్చి మహమ్మదు కుదుబ్‌షావారి ఈ పురమునకు దక్షిణమున పేట, పురము కట్టించెను. తరువాత అబ్దుల్లా సుల్తాను, అబ్దుల్లాహుస్సేను, తానీషా అలంగీరు, పాదుషాలు రాజ్యము చేసిరి, వారి దినములలో అధికారము చేసిన హామీాళ్ళచితాపఖానుడు ౧౬౨౧ నుంచి ౧౬౨౪ వరకు ౧౬౨౪ నుంచి ఒక సం॥ అబినిసిద్ధిచిపులు ఖానుడు ౧౬౨౪ నుంచి ౧౬౨౭ వరకు అప్పరస ఖానుడు ప్రభుత్వం చేసిరి వీరి తర్వాత యఖ్లాఖానుడు గుంటుపల్లి ముత్తురాజయ్యలు పరిపాలించి తరువాత ౧౬౭౪లో యఖ్లాస్‌ఖానుడు అమీాలు అయి పూర్వము రెడ్లరాజులు చిన్నకొండమీాద కట్టించిన విఘ్నేశ్వరాలయమును పడగొట్టించి ఈ దేవాలయానికి దక్షిణంగా కొంచెం నైరృతి మూలగా యఖ్లాస్‌ఖాను పేట కట్టించి, ఆవూరు గణేశపేట అనికూడ పిలుస్తూ వచ్చిరి. పిమ్మట కుటిఖానుడు అమీాను పదవికి వచ్చి ౧౬౭౪ నుంచి ౧౬౭౭ వరకు మూడు సం॥ పరిపాలించెను. తరువాత జూపల్లె రంగారావుగారి కుమారుడు రంగపతిరావు రాజ్యమునకు వచ్చి ఈ పట్నానికి నైరృతిమూలగా నాదెండ్లకుపోయే మార్గంలో ఈ ఊరి పొలం కొంత తీసికొని అందులో దేవాలయం కట్టించి ఈ పట్టణం

లోనున్న శ్రీరంగనాయకస్వామి వారిని జయవిజయులతో కూడ తెచ్చి ప్రతిష్టించి అక్కడ రంగపతి పేట కట్టించి సోల్పెనమేతు శ్రీరంగనగర మని చుట్టు పొలిమేరి స్తంభములు వేయించి పై దుర్గానికి వాయవ్య మూలను మిరియాలచుట్టు ? మీదను బురుజుకట్టించి మిరియాలబురుజు అని పేరుపెట్టించి ౧౫౩౮ నుండి ౧౫౪౦ వరకు మూడు సం॥ ప్రభుత్వాం చేసెను తానీశా, అలంగీరు వారి పరియంతం దుర్గములలో కిల్లేదార్లను ఉంచి హవేలీ గ్రామాలు వారి క్రింద ఉంచడమున్నూ, మిగతా సమ తులు అమీాళ్ల పరంగా ఉంచుతూ ౧౧౨౧ ఫసలీవరకు జరగినది, ౧౧౨౨ ఫసలీలో నవాబు ముచరాజ ఖాను మృత్తుజానగరు మూడు విభాగించెను అప్పుడు ఈ జిల్లాక్రింద ౧౮ గ్రామాలు ఉంచి జమీాందార్లకు సావరాలు ముడుతూ ఉండేటట్లుగా ఏర్పాటు చేసెను. తర్వాత ఆషబ్ షా నవాబు నిజాముల్ముల్క బహద్దరుగారు సుభా అధ్యక్షులై జాజావాదుల్లా మొలతరము ఖానుడు బాలకృష్ణ మొదలయినవారికి అమీాలు యిచ్చిరి. వారు వచ్చి అల్లకల్లోలముగా రాజ్యమును సరిచేసి దేశముఖ దేశపాండ్యలవల్ల సుంకములు తీసి కొంటు వచ్చినారు. తరువాత సాహెబు జావాగారు పరిపాలంచిరి తరు వాత వీరి కుమారులు నజర్ జంగ్ ప్రభుత్వాం వహించి ౧౧౬౦ ఫసలీలో పరాసువారి పరంచేసెను తరువాత బసాలద్ జంగ్ దివాను అయిన రాజాబలవంతు ఇంద్రజత్తు బహద్దరుగారికి జిల్లాదారుపని ఇచ్చి పంపగా వారువచ్చి నల్లురు జమీాందార్ల వ్యవహారం తానే చేసికొంటూ ఉండగా ముశ్చఫీలు ముశ్నాభాముశే లాలి మొదలయిన పరాసువారు పెల్లూరి రామయ్యగారిని మంత్రిగా యేర్పరచి వ్యవహరించిరి ఆరవీటి నుండి తద్దిఖానుడు మేస్తరుది వీలువచ్చి జమిందార్ల పరంగా వ్యవహ రించిరి, ఇంతలో టిప్పుసుల్తాను తరపున గండికోటనుంచి మీారు సాహెబు గారు 6000 గుఱ్ఱాలతోవచ్చి దోపిడి జరిపెను తరువాత గోలకొండ నుంచి పంపబడ్డ సాహెబు వచ్చి జమిందార్ల నేర్పాటు చేసి గుంటూరు సుబాచేసి ఏడు సంవత్సరములు పరిపాలించిరి ౧౧౭౭ పసలీలో వారు వచ్చి ౧౧౭౭ వరకు 3 సం॥ పరిపాలించిరి. ౧౨౦౦ ఫసలీలో ఈ

తాలూక జమీందార్ల పరంచేసిరి అప్పుడు యీ ఓంటుకు మానూరి నరసన్నకు ఒప్పగింపబడెను ఆయన ౧౭౧౯ వరకు ౨౦ సం॥ పాలించి వీరి తమ్ముని కుమారులు వెంకటకృష్ణసింగారు ౧౭౨౧వరకు పాలించెను

(1) భీష్మకునినగరం కుండినవగరంపట్టున పోలయ వేమారెడ్డి మరల పట్టణంకట్టించెను (2) దీనికి ఉత్తరం పుట్టకోట కట్టించిరి (3) ఈగ్రామానికిఉత్తరదార్వాజాకు పశ్చిమంగా శివాలయంపడిపోయినది. (4) ఈ దేవాలయానికి తూర్పు లంకెల బావి ఉన్నది (5) ఈ బావికి తూర్పున కైలాసరాయని కొండఉన్నది ౧౦౮ దేవాలయాలను రెడ్లు పూజించేవి మ్లేచ్ఛులు పాడుచేసిరి (6) ఈ స్థలానికిఉత్తరం బార్లఆవీడు దేవాలయం దానికిక్రిందుగా బ్రహ్మగుండం కోనేరు ఉన్నది. (7) పట్నానికి ఆగ్నేయముగా వేంకటేశ్వరస్వామి - యీస్వామికి తూర్పు పుష్కరిణిఉన్నది (8) ఈ స్వామికి ఆగ్నేయంగా కన్యకలబావి (9) ఈ పట్నానికి దక్షిణంగా గోపినాధస్వామి దేవాలయం - ఈ ఆలయానికి పశ్చిమంగా రంగనాధస్వామి వారిని గజపతివారు ప్రతిష్టించిరి (11) నాగయ్య దక్షిణముగాకోనేరు ఉన్నది (12) ఈ కోనేరుకు దక్షిణంగా మాణిక్యారావు వారి కోనేరుకలదు, పూర్వం కర్ణాటక ప్రభుత్వంలో యీవెలుమవారు గోపీనాధపట్నం తురకలదని యిక్కడ రాజగృహములు కట్టించుకొని నివసించుతూ ఈ కోనేరు త్రవ్వించిరి. (13) ఈ కోనేటికి తూర్పుగా మాణిక్యారావు గుండాలని రెండుదద్దణాలున్నవి పూర్వము యుద్ధాలలో మగవారు చనిపోతే స్త్రీలు సహగమనం చేసినారు యీగుండాలలో అని ప్రసిద్ధి (14) ఈ గుండాలకు దక్షిణంగా రెడ్లు కట్టించిన పెద్దకోనేరు ఉన్నది. (15) ఈ కొనేటికి పశ్చిమమున గృహరాజు మేడదిబ్బ ఉన్నది. రెడ్లప్రభుత్వంలో కోమటి వేమారెడ్డిగారు శ్రీనాధుని ప్రభావంవల్ల నవులూరిపోతరాజు దేవాలయం వద్దనున్న యేడుతాళ్ల పొడుగు యేడుమోకులుతిరిగే లావును గల తుమ్మచెట్టును తెప్పించి ఒంటిస్తంభము మేడ కట్టించి ఆదిలక్ష్మి కామేశ్వరి అమ్మవారికి సింహాసనముగ ప్రతిష్టించిరి. ఈ మేడ శిఖరానను బొల్లిమోర వేంకటేశ్వరస్వామివారి దేవాలయమునకు మకర తోరణం కట్టించిరి, ఇక్కడకు వెంకటేశ్వరస్వామివారి కొండ

తూర్పుగా ఉండును. (16) ఈ కొండకుదగ్గిర జద్దిగాలబావి దీనికి దగ్గరగా రెడ్డివారి చెరువుగలదు. (17) పెదదాసరాయ, చినదాసరాయ తోట లున్నవి. (18) ఈ గ్రామానికి దక్షిణంగా స్వయంభువు అయిన కొండ శింగరయ్య అనే నృసింహస్వామి బిలంలో ఉన్నాడు. (19) ఈ స్థలానికి ఉత్తరం తిరుమల లక్ష్మీనృసింహ ఆలయమున్నది (20) గ్రామమున పశ్చిమం శ్రీరామేశ్వరస్వామివారి దేవలయముండున్నది, (21) దీనికి దగ్గర రుక్మిణీ సత్యభామా సమేత గోపాలస్వామి దేవాలయం (22) దీనికి పశ్చిమంగా సీతాపతి అనేచెరువున్నది. (23) ఈగ్రామానికి ఉత్తరం వీరభద్రస్వామివారు, (24) దీనికి ఉత్తరంగా రెడ్లుకట్టించిన దేవస్థానము లున్నవి పెద్ద దర్వాజా ఉన్నది (25) దీనికి ఉత్తరం పత్తేఖాను మశీదు ఉన్నది. (26) దినిక ఉత్తరం అనే అత్తారు మశీదు ఉన్నది (27) దీనికి ఉత్తరం పాడుబడ్డ మశీదు, (28) ఈ గ్రామాణికిపశ్చిమం పేట మహమ్మదాపురం. (29) దీనికి దక్షిణం నల్ల మశీదు (30) దీనికి పడమట గుమ్మల్ మశీదు (31) దక్షిణ జామత్ కానా మశీదు (32) చిన్నమశీదు (33) దక్షిణమున రెండుదర్వాజా లున్నవి (34) దీనికిదక్షిణం కొండవీటి గోపీనాధస్వామి పట్టణం అనే మర్త్యజానగరు దీనిక ఉత్తరపువైపు కొండపల్లి దర్వాజా ఉన్నది (35) దీనికి దక్షిణ గోపీనాధపట్నంలో నాదొడ్లదర్వాజాలు, (36) కుదుబ్ షాపేట శ్రీవెన్నముద్ద కృష్ణస్వామి దేవాలయముగలదు (37) కమాల్ దీన్ వారి మశీదు ఉన్నది

## — గ్రంధార్థము —

ఈ గ్రంధమునఁ బ్రధానముగా ధనుర్నిర్మాణము మొదలుకొని శరప్రయోగాంతముగాఁ గలధనుశ్శాస్త్ర విషయయములు, అనుభవ రూఢకములు సరిగా వివరింపఁబడినవి కాని యీగ్రంధమునకంటెఁ దునిరాజాగారు ప్రకటించిన ధనుశ్శాస్త్రము విపులమయినది. విషయ విశేషములు గలది సంస్కృతధను శ్శాస్త్రగ్రంధము లన్నింటను విషయ సామ్య మున్నది. వాని ననుసరించియే యీరెండు తెల్గుగ్రంథములు వెలసినవి కాని యీయిర్వురుగూడ సంస్కృతమూల గ్రంథముల

చేర్కొనరైరి ఈ యిర్వురు గురువులును సంస్కృతముననున్న యా యా శాస్త్రగ్రంథముల నెఱుంగక తత్తద్విషయ విశేషములనే గురుసాంప్రదాయానుసారమున నేర్చుకొని వానిని వారి వారి వ్యవహార భాషలలో వ్రాసికొనియుందురు ఈగ్రంథమున కృష్ణమాచార్యుఁడు "ఈలక్షణాలను కందాళ వెంకటాచార్యులుగారు చెప్పిన పద్యాలు"అని కొన్ని పద్యాలు చేర్చిరి అతడు కృష్ణమాచార్యునికంటెఁ దర్వాతివాడు.

నేను కృతి ప్రేరకుని వంశము వారగు రామూరి జమీందారుగారికి జాబులు వ్రాసి ముద్రణోపక్రమము తర్వాత నొకవ్రాఁత ప్రతిని వారివల్ల బడసితిని. కాళహస్తి వ్రాఁత గ్రంథములలో నొకప్రతి తిరుపతి దేవస్థాన పుస్తకశాలకు లభించినది ఈరెంటి సహాయములేకున్నచో నేతద్గ్రంథ ముద్రణ మీతీరున నేని నెఱవేఱక పోయెడి దే

రామూరు జమీందారు గారగు శ్రీ కృష్ణానేని హయగ్రీవరావు గారు వారివ్రాఁత ప్రతినొసగియు, తమవంశ చరిత్రాది సాధనములను తమయుద్యోగి శ్రీ కోపల్లె రామకృష్ణరావుగారి ద్వారమున పంపియు, శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు తమదగ్గరనున్న ధనుశ్శాస్త్ర గ్రంథ ముల సీసీరికా రచనకాలమున నొసగియు, ప్రతిదినము ఉదయము వచ్చిన ప్రూపులను నాఁడే వానిని మద్రాసు పంపుటలో నాకు చిరంజీవి పంగనామముల బాలకృష్ణమూర్తి బి ఓ యల్ (ఆనర్సు) నా సహోద్యోగి చాలనోడ్పడియు, విద్యాజన్మ వంశములందు సంతానమగు చిరంజీవులు శ్రీనివాస, సచ్చిదానందులు, సుందరమూర్త్యా నంద మూర్తులు నన్ననువర్తించి యుపకరించిరి.

విరోధి
మాఘపూర్ణిమ

వేటూరి ప్రభాకరశాస్త్రి.



# విషయానుక్రమణిక.

---

## ప్రథమాశ్వాసము


| | |
|---|---|
| ఇష్టదేవతాధ్యానము | 1 |
| సుకవిస్తుతి | 2 |
| కుకవినింద | 3 |
| కృతికథాకల్పక వంశావతార వర్ణనము | 3 |
| స్వప్న వృత్తాంతోపన్యాసము | 15 |
| కృతిపతి గుణకీర్తనము | 22 |
| కథారంభము | 24 |
| ద్రోణార్జున సమాగమము | 27 |
| ద్రోణుండర్జునునకుధనుర్విద్యా రహస్యంబుపదేశింపదొరకొనుట | 28 |
| విద్యా ప్రభావ సూచనము | 29 |
| గురు సంకీర్తనము | 31 |
| శిష్య వరణము | 32 |
| సఖండాఖండకోదండద్వయనామోద్దేశము | 36 |
| ధనుర్నిర్మాణ పరిమాణ ప్రముఖ విశేష వినిభాగము | 36 |
| మార్గణ పరిగణన ప్రణయనము | 39 |
| శరవిధాన మానప్రశంసనము | 43 |
| పక్షపరిమాణ ప్రశంసాదికము | 54 |
| పుంఖోప్య సంఖ్యానము | 56 |


## ద్వితీయాశ్వాసము


| | |
|---|---|
| తూణీరలక్షణాదికము | 60 |
| మేఖలాబంధ లక్షణము | 62 |

| | |
|---|---|
| మౌర్వీ నిర్మాణ కథనము | 63 |
| అంగుళి త్రాణప్రకీర్తనము | 65 |
| జ్యారోపణ ప్రకారము | 68 |
| ధనుషూర్ధ్వాధర భాగవిభాగము | 73 |
| ముష్టిప్రకరణము | 73 |
| స్థానోప సంఖ్యానము | 76 |
| శరగ్రహణోపాయ ప్రతిపాదనము | |
| సంధాన క్రమవివరణము | 89 |
| ఆకర్షణ హస్తప్రస్తావము | 90 |
| బాణహస్త క్షేత్రనిరూపణము | 91 |
| దృష్టి లక్షణాఖ్యాలక్షణము | |
| ధనురాకర్షణ కౌశలోపన్యాసము | 94 |
| పుంఖోద్వేజన విభజనము | 98 |
| చాపముష్టి ప్రేరణ వివరణము | 99 |
| శరమోచన ప్రకార ప్రవచనము | 99 |
| చాపోత్సరణ లక్షణవిభాగము | 99 |
| శరాభ్యాసోచిత మాసోపన్యాసము | 101 |
| శరవ్యాపారయోగ్యతిథి వారతారకాయోగకరణ విస్తరప్రస్తావము | 103 |
| ఖురళికా రంగప్రసంగము | 104 |
| రంగప్రవేశలక్షణ నిర్దేశము | 190 |
| ధనుశ్శరపూజాయోజనము | 112 |
| గురుప్రమాణాస్థేమము | 116 |
| శరశారాసనగ్రహణ పౌర్వాపర్యాలోచనము | 117 |

## తృతీయాశ్వాసము

| | |
|---|---|
| స్థానప్రతిష్ఠానములు | 120 |
| లక్ష్య శుద్ధిలాభము | 124 |

| | |
|---|---|
| లక్ష్యవేదికా విధానము | |
| నారాచమోచన ప్రకారము | 128 |
| చిత్రలక్ష్యభేద నోపాయము | 131 |
| శాబ్దలక్ష్యశరాభ్యాసము | 136 |
| దూరనికట స్థలలక్ష్యభేదన | 137 |
| దృష్టిముష్టినియమనలక్షణము | |
| రథారోహణ శరాభ్యాసవిశేషము | 138 |
| గజారోహణ శరప్రయోగా వినిభాగము | 143 |
| హయారోహణ శరమోక్షణము | 144 |
| చిత్రయుద్ధ ప్రకారము దండకము | 148 |
| దూరపాతి శరాభ్యాస విస్తారము | 150 |
| నభోవిభజనము | 151 |
| శరప్రయోగ సమయాసమయ నిరూపణము | 155 |
| శరగమనగుణదోష వినిభాగము | 157 |
| నలువది కౌశలములు | 159 |
| దివ్యాస్త్రమంత్ర తంత్ర ప్రయోగోపసంహారము | 169 |

శ్రీ.

# ధనుర్విద్యావిలాసము

## కృత్యవతరణిక.

---

శా. శ్రీవాణీగిరిజావిలాసనిధియై చెల్వొందు సీతామహా
దేవిం దక్షిణభాగమం దనుజు నర్థిన్ వామభాగంబునన్
రీవిం గైకొని చాపరోపధరుఁడై రేవన్ బిసాళించుల
క్ష్మీవంతు న్గుణవంతు నీవనిపుర శ్రీరాఘవుం గొల్చెదన్. 1

సీ. ఏబాలికామణి హేలావతారంబు
మిథిలాధిపతిమేలు మేలుకొల్పు
నేభామపరిణయ శ్రీభాగధేయంబు
శివధనుర్దళన ముంకువ ఘటించు
నేమహాదేవీలలామంబు కరుణతో
నింద్రాది దివిజుల యిడుము లుడుపు
నేవధూత్తంసంబు హితలీల రాముల
వామాంకపీఠంబు వదలకుండు

తే. నే పరమసాధ్వి గుణము లీరేడు జగము
లందుఁ గులపాలికలకు నానందకరము
లట్టి సీతావధూటి నెయ్యంబు మీఱ
ప్రధనజయ మిచ్చు తిరుపతిరాయమణికి 2

ఉ. కోసలరాజనందనునకుం బరిచారకుఁడై నివాసశ
య్యాసనపాదుకాంశుకసితాతపవారణ కల్పనావిధిన్
భాసిలి శేషభావ మనుబంధముగాఁ దగు లక్ష్మణుండు ధా
త్రీ సురపోషకుం దిరుపతిక్షితిపాలునిఁ బ్రోచుఁగావుతన్ 3

మ. వనధిం దాఁటి నిశాటఘాటకుటిల వ్యాపార ఘోరంబుగాఁ
జని సీతారమణిం గనుంగొనుచు నక్షప్రాణవిధ్వంసనం
బును లంకాదహనంబుఁ జేసి రఘురాముం దేర్చి విశ్రాంతుఁడౌ
దినరాట్తేజు మరుత్తనూజుఁ దలఁతున్ ధీయుక్తికిన్ భక్తితోన్ 4

శా. శ్రీరాజిల్ల నిరంతరాయమునకై సేవింతు భావంబునన్
వైరిక్ష్మాధరశంబులన్ భువన దీవ్యత్కీర్తికాదంబులన్
పారావార విడంబులన్ మునిమనః పంకేజ రోలంబులన్
సారాచార కళావలంబులను విష్వక్సేన హేరంబులన్ 5

సీ. నక్రంబు కరినొంచు వక్రంబు వారించు
చక్రంబు పాలించు సరణి నెంతు,
దామోదరుని డెంద మామోదమునఁ జెందఁ
గౌమోదకి నమందగతి భజింతు,
పరిచంచలాస్యమై పరికించ ధన్యమౌ
హరి పాంచజన్యంబు నభినుతింతు,
నానందభవభాసితా నందమునఁ జేసి
యానందకాఖ్యాసి నాశ్రయింతు,

తే సుగుణకలనంబు మార్గణ సుగమవృత్తి
నమ్రభావంబు దనకు విన్నాణ మొసగ
నవని నవఖండ మండితంబై తనర్చు
శౌరి శార్ఙ్గంబు మదిలోన సన్నుతింతు 6

ఉ వాణికి హస్తముల్ మొగిచి వారిజగర్భుమదిం దలంచి శ
ర్వాణికి నంజలించి వృషవాహు నుతించి మురారిపట్టపున్
రాణికి మ్రొక్కి చక్రధరు రాజితలీల భజించి సత్కవి
శ్రేణికి మోదముం బెనిచి చిత్తమునం బ్రమదం బెలర్పగన్ 7

క భాసుర సూరి గ్రామణి
భూసురముఖపంకరుహనభోమణి వినమ

ద్దాసనిచయచింతామణి
నే సింగర గురుశిఖామణిం గణుతింతుర్. 8

ఉ రాముని చెట్టఁబట్టి రహి రాజిలు కావ్యపురంధ్రి కర్గమై
వేమరు మించనాడుట వివేకము గాదని యేలతోఁచదో
పామరులార సత్కవుల పాలిశనైశ్చరులార దుష్కవి
గ్రామణులార యిట్లు కొఱగా దనఁగా వినరా నరాధిపుల్ 9

శా ఛందోలంకృతిభేద భావగుణదోష ప్రౌఢులం దెల్ల ని
స్సందేహ ప్రతిభావిభాసుర మనీషల్ గాంచు ధీరాత్మకుల్
నందింపం దగు నొక్కవేళ నెఱ సూనం గాఁ దగుర్ గాక యే
సందుల్ రాని బిగాది పండితుల కెంచంబోలునే కావ్యముల్ 10

తే కానిపని కాని గవగవఁ గవయఁ గవయఁ
గవులు కవులని కవులాడు కవులు కవులె
ఐన పనికైనఁ గలగలమనక వెనుకఁ
గవులు కవులని లాలించు కవులు కవులు. 11

వ అని యిష్టదేవతా ప్రార్థనంబును కుకవినికరావమాననంబును సుకవి
సంకీర్తనంబునుం గావించి యొద్దియేనియు నొక్క ప్రబంధంబు ఘటి
యించి రఘుపతిచరణారవిందంబులకు సమర్పణంబు గావింపం దలంచు
నవసరంబున 12

సీ. పెన్నురంబునఁ బాలమున్నీట నుదయించు
తరుణీలలామంబు దనరు వాఁడు,
అభినవజలధరశ్యామలంబగు మేన
రాణించు కనకాంబరంబు వాఁడు,
బొడ్డుదామరమీఁద భువనముల్ సృజియించు
నలుమొగంబుల ప్రోడ గలుగు వాఁడు,
ఆద్యంతశూన్యుఁడై యఖిలలోకంబుల
నిజదివ్యతేజంబు నెఱపు వాఁడు,

# కృత్యవతరణిక

తే. కలశపాథోధి నడుదీవి కమ్రకనక
మణిమయంబైన భవ్యధామమున శేష
ఫణిగణాంగణ శయ్యపైఁ బవ్వళించి
రహిగులుకుచుండు నాది నారాయణుండు 13

శా. శ్రీ నీలారమణీమణీ కరతల శ్రీగంధ లేపార్హమై
నానావాహిని మనస్సరోజ పరమానందాను సంధాన మా
నా నారాయణునంఘ్రిఁ బుట్టిరి పవిత్రాచారులై విక్రమ
శ్రీ నిండార్మఁగఁ బదనాయకముఖుల్ శ్రీగంగ సైదోడుగన్ 14

సీ. ధర్మానుకూల వర్తనమున సుగుణులై
వంశాను చరితంబు వదల రెందు,
సరసభాషారూఢిఁ జతురాననాఢ్యులై
సత్యానుగతి వీడఁజాల రెందు,
తలఁకని ఘనతచే ధారాళవృత్తులై
శరణ మందిన వారి సడల రెందు,
పద్మనాయకలీలఁ బద్మానుకూలురై
కువలయక్షోభంబు గూర్చ రెందు,

తే. నరయ గంగాసహోదరు లగుచు భూరి
జీవనమునకు నోడ్లను జెనక రెందు
శ్రీమహావిష్ణు చరణరాజీవ యుగళి
నవతరించిన పద్మనాయకులు ధరణి 15

శా. అందుం డెబ్బదియైదు గోత్రములుగా నన్యోన్యమున్ బంధులై
చందంబుల్ విభజించి యేకసమయాచారంబునన్ ధీరులై
డెందంబుల్ దళుకొత్త మోదములతో ఢిల్లీశుఁ డౌపాదుశా
హుం దోరున్నతి మెచ్చఁ గొల్చిరి రణోద్యోగంబులం దాప్తులై. 16

ఉ. డెబ్బది యైదు గోత్రముల రీవి నెసంగెడు పద్మనాయకుల్
ప్రబ్బిన కూర్మి నాద్యుఁడగుపాడుపహా హింత మాచరింపుచుం

నిబ్బరపుఁ బ్రభావ సరణిం బురణించి ధరాధినాథులై
జొబ్బిలి వేడుకం దనరుచుం గనుచుండు రభీప్సితార్థముల్. 17

ఉ. పౌరుషశాలియై తనరు పాదుషహా హితమాచరింపుచుఁ
భూరితర ప్రభావమునఁ బొంపెసలారెడు పద్మనాయకుల్
వారికి వారికిం దగిన వైభవముల్ గని పెంపు మీఱఁగాఁ
గూరిమితోడఁ [1]బుణ్యపలి గోత్రభవుల్ గని రీప్సితార్థముల్ 18

గీ. వారివంశంబు కృష్ణా[2]నివంశ మయ్యె
రఘుకులంబునఁ గోదండరాము లీల
నందుఁ బ్రభవించె నొక్క మహామహుండు
సాహసోత్సాహనిధి బంధుజనహితుండు 19

శా. ఆధీరాగ్రణి జాగ్రదాగ్రహ కృతాహంకార హుంకార దు
స్సాధాయోధన వీథికాధిక రిపుక్ష్మాభృన్మహాసుచ్ఛటల్
క్రోధోద్యత్కరవాలకాల ఫణిచేఁ గ్రోలింపుచుఁ దుర్జన
ప్రాధాన్యం బెడలించుఁ దాఁ గుతుపశాపాచ్ఛాహితాపాదియై. 20

సీ. తనయాజ్ఞ నొదలఁదాలిచి కోవెల
కొండ యేలిన యట్టి నిండుదనము,
పఱిలుఁడై తాఁ బంప [3]మెదుకు మ(వ?)లంగర
దుర్గంబు గాచిన దొడ్డతనము,
తనముద్రఁజెల్లించి ధనికుఁడై పెదకొండ
పలి దుర్గమునఁ జేయు ప్రాభవంబు
తనపంపు గని పెంపు దనరారఁగాఁ గొండ
వీటి దుర్గము నేలు విక్రమంబు

భావమున మెచ్చి కుతుపశా రీవి నొసగె
[4]తెలనిశానీ నగారా ప్రదీప్తధవళ

---

1. పుణ్యపరి. 2 కృష్ణాతి
3. మెదకువతో లింగ 4. తెల . .గారా.

చామరద్వంద్వమును జగజంపుగొడుగు
పంచఘంటాతలాటంబు భద్రగజము ॥ 21

వ వెండియు 22

శా ఆజానేయము రత్నకుండలయుగం బాందోళికారత్నముం
బ్రాజాపత్యము ముర్తజాన్నగర సామ్రాజ్యంపుమన్నెర్కముల్
రాజామానికశా వటంచునభిధానం బిచ్చినం బ్రీతుఁడై
భ్రాజిష్ణుం డగుచుండ్ దగుల్ గుతుపశాపాచ్ఛాసమతుంబుగన్ ॥ 23

వ ఇట్లుమహీమండలాఖండలుండు కుతుపశానుగ్రహంబున నేనూటయెనుబది నాల్గు [1](వక)వరగ్రామంబులం బ్రసిద్ధంబగు ముర్తుజాన్నగరంబునకుం దావలంబైన రాజ్యంబునకు మన్నెఱికంబును దక్కంగల సన్మానంబులుం బడసి యప్పాదుశాపనుపున ముర్తజాన్నగరంబు ప్రవేశించె నమ్మహారాజధాని వసుంధరాభరణంబై ప్రవర్ధిల్లుచుండు 24

సీ పసమించుభీష్మకప్రముఖావనీపాల
కులకు వజ్రపుజోడు కొండవీడు,
శత్రురాజాధిరాజవిరాజదైశ్వర్య
[2]కుదిరంబు ముకుద్రాడు కొండవీడు,
అఖిలయాచకరాజహంస యూధములకు
క్రొందామరలకాడు కొండవీడు
దేవతాయత[3]నమై దీపించు కల్యాణ
కుధరంబుసైదోడు కొండవీడు.

తే. హరిహరవిరించిముఖదేవతావతంస
సంపదభిరామహేమవిశాల సాల
జాగ్రదగ్రముహుర్ముహుశ్చటుల పటహ
ఘుమఘుమధ్వానములగూడు కొండవీడు ॥ 25

1. వక. 2. కుళకంబు. 3, యతన్నైక.

గీ. పుట్టకోటగాక పొలుచుపైకోటకు
దండి బురుజులుండు రెండుపదులు
కోమలు రెండు నొక్క కొత్తడం బనఁదగు
నట్టికొత్తడంబు లాఱువేలు 26

ఉ. ఎక్కడఁ [1]జూచిన న్మదపుటేనుగుగున్నలు చెన్నుమీఱు నే
దిక్కునఁజూచినన్ బసిఁడి తేరులబారులు సొరఁదేర నే
వక్కమునం గనుంగొనిన వాజులరాజులు రాజిలున్ సిరుల్
గ్రక్కెడు కొండవీటినగరంబున నద్భుతమావహిల్లఁగన్ ॥ 27

శా అందుం దీర్పరి పెద్దయై ముకురనీహారామరప్రోదినీ
కుందోరస్సరరాజరాజ కలశాకూపారహారావళీ
మందారద్రుమగంధసార లవలీమాద్యద్యశశ్శాలి మే
లందున్ మానికరాయభూవిభుఁడు బాహావిక్రమానక్రుఁడై ॥ 28

సీ తనకునై కుతుపశా దయనిచ్చు విజయాంక
బిరుదముల్ దనయింటఁ బెనుపుసూప
తనపేరు తనసంప్రదాయంబు వారల
కన్వయాంకంబుగా నతిశయిల్ల
తా భక్తిఁ గొలుచు కోదండరామస్వామి
తనవారి కులదైవతంబు గాఁగ,
తన భుజాబలసముత్థానంబుచేఁ గొండ
వీటి దుర్గంబు భావితము గాఁగ,

తే నమరె ముర్తుజాన్నగర సింహాసనమున
చామరచ్ఛత్ర వేఘునిస్సాణ పణవ
ముఖ నిఖిల రాజచిహ్నముల్ మ్రోలఁదనర
ప్రధనజయశాలి మానికరాయమౌళి 29

ఉ మండితమూర్తియై తనకు మానికరాయినికిం దనూజుఁడై
కొండలరాయభూవిభుఁడు కుండలిరాజశశాంక శంకరా

1. జూచిన్మరవు తేనువు

ఖండలదంతి పాండుర వికాస వికస్వరకీర్తి కీర్తితా
జాండకటాహుఁడై తనరు నాశ్రితకల్పమహీరుహం బనన్. 30

మ. బలిమిన్ గొండలరాయ భూరమణుఁడున్ బాహార్గళోదగ్రుఁడై
సులతానబ్దులపాదుశాహునకు మెచ్చుల్ గూర్చుచుం గాంచెఁ బ
చ్చలహాదాగజరాజుగొడ్గు తెలనిశ్శానీనగారాసము
చ్చలదశ్వంబును కాహళంబు సరిదేశాహితనంబున్ రహిన్. 31

చ. అతనికిఁ దిర్మల ప్రభుఁ డుదారయశుం డుదయించెఁ దిర్మల
క్షితిపతి గాంచె నప్ప నృపసింహుని నప్పవిభుండు గాంచె వ
ర్ధితబలుఁ దిర్మల ప్రభునిఁ దిర్మలరాయడు గాంచె నప్ప భూ
పతి నతఁడాఢ్యుఁడయ్యెఁ బరిపాటి మెయిన్ నిజరాజ్యలక్ష్మికిన్ 32

క. తానుం దేశాహిపర
మానా కౌరంగజేబు మహిమ బఘార
ఖ్ఖానునిచే రోహిల్లా
ఖానునిచే నప్పవిభుఁడు గనియెన్ ఘనుఁడై. 33

మ ప్రమదాపాదకమౌ ముహూర్తమున నప్పారాయ మాణిక్యరా
య మహారాయనికిన్ రహిం దిరుపతి క్ష్మాధీశ మాణిక్యరా
య మహారాజ కులావతంసుఁ డుదయంబై యేలె నజ్జానకీ
రమణుం గొల్చుచు ముత్తుజాన్నగరసామ్రాజ్యంబుపూజ్యంబుగన్

సీ ఏమన్నె మదహస్తి హేలా విహారంబు
పర వాహినీ సరోవరము గలఁచు,
నే పద్మనాయకుం డెదుర వీరానీక
ఘూకావలోకంబు గుడుసు పఱచు,
నే రాజసింహుఁడు వైరిరాజ మదేభ
విసరంబు పాలికి వేరు విత్తు,
నేరామ భక్తుండు ధీరుఁడై కొను నన్య
రజనీచరులు గొన్నరాజ్యలక్ష్మి,

తే. నతఁడు పాదుశహా లబ్ధ చతురతురగ
కరటి రథలు చామర చ్ఛత్ర కాహళధ్వ
జాది వరరాజ లక్షణ శ్రీదలిర్ప
ప్రబలుఁ దిరుపతి మాణిక్యరాయశౌరి. 35

ఉ. హుమ్మని సంగరమ్ముల సముద్ధతిఁజూపిన మెచ్చియిచ్చె రా
రమ్మని గోలకొండ నగరమ్ము నవాబు మెఱుంగు లీను వా
హమ్ములను నాల్గునేనుఁగులు నాప్తులపాలి సుధాంబుపూరవుం
దెమ్మగదా మహిం దిరుపతిక్షితిపాలుఁడు రాజమాత్రుఁడే. 36

వ. వెండియు నమ్మహీవల్లభుండు. 37

క. చెలఁగి ముబారజు ఖానుని
వలనం దొలుతటి నిజామవరఖాజాబా
దులఖానుల వలనం గొనె
నల దేశాహీ మిరాశి కనువిహితంబుల్ 38

వ మఱియును 39

గీ. భవ్యగుణపేటి చక్రమాంబావధూటి
ధర్మపత్నిఁగాఁబడసి య త్తన్వి వలన
కడిమి నార్వురఁ దనయులఁబడసె నవ్వి
భుండు సంపత్పరంపరాపూర్ణుఁడగుచు 40

సీ. అందగ్రజుండు సాహస విక్రమార్కుఁడై
రాణించు వెంకటరాయ విభుఁడు,
అతని తమ్ముఁడు సమూర్జిత కళాపరిభూత
మదనుండు కృష్ణక్షమావిభుండు,
అతని సోదరుఁడు బాహాబలాభీలుఁడై
భాసిల్లుచుండు నప్పప్రభుండు,
అమ్మహాభాగున కనుఁగుఁ దమ్ముఁడు మహా
బలశాలి రమణభూపాలకుండు,

తే. ఆయనయనుంగుఁ దమ్ముఁడై యలరుచుండు
రసికజనమాళి వల్లభరాయమౌళి
తలప నందఱకును ముద్దుఁదమ్ముఁ డగుచు
ప్రబల సీతన్న మాణిక్యరాయ శౌరి. 41

గీ. ఇందు వెంకటరాయ ధాత్రీశు నాత్మ
భవుఁడు గోపాలక క్షమాపాలకుండు
తండ్రి తాతల కైవడి ధరణి యేలె
నర్థిజన కల్పభూరుహం బనఁగఁ బరగి 42

శా. ఈగోపాలవిభుండు ముత్యపుతురాయీ మేలిసిర్పేషముల్
జాగీరుల్ మనసోజ[1] నాల్గునగలుల్ ఝండా నగారా కరిల్
ప్రాగల్భ్యంబున గోలకొండ దొరచేఁ బ్రాపించి దీపించె రా
జాగోపాలకరావటంచు సవిశేషంబౌ కితాబందుచున్ 43

క. సుతు లిరువు రప్ప ధాత్రీ
పతికిం బ్రభవించి రగ్రభవుఁడు రఘుపతి
క్షితిపతి రాజ్యము గైకొనె
నతని సహోదరుఁడు తిరుపతన్నయుఁ దనరెన్ 44

మహాస్రగ్ధర శూరుండప్పావనీభృత్సుతుఁడురఘుపతిక్షోణిపాలుండురాజ్య
శ్రీరూఢుండై నిజామక్షితిపతి హిత మార్జించుచుం గాంచెఁదా జా
గీరుల్ ఝండా నగారా కెలకుల సిరులగ్గించు వింజామరమ్ముల్
స్ఫారత్కుంభిల్ దురాయీ బలుగొడుగు దెసల్ ప్రాకురాజాకితాబుల్

గీ. శ్రీరమణభూమిపాలుండు నారసింహు
వల్లభేంద్రుండు శేషాఖ్యు వాసి మీఱఁ
గాంచి కొండొక కాలంబు కలిమి బలిమి
గలిగి చెలఁగిరి శత్రుభీకర నిరూఢి 46

క అల తిరుపతి రాయనికిం
గులసతియెడ గలుగు నాలుగురిలోపలఁ దాఁ

1 మనసోబు

గులవర్ధనుఁడై యిల విల
సిలు సీతారామ విభుఁడు జితశాత్రవుఁడై 47

సీ. పరవీర పరివార మదభేద నిరుదార
తరభైరవాకృతిఁ దనరుచుండు,
సుకుమారతకు మారునకు మారుదరక మీరు
పలుచు నొయ్యారంబు నెఱపుచుండు,
ఘనదానమున దీనజనమానస నిధాన
మన మానసీయుఁడై యలరుచుండు,
తనపంపు గని పెంపు గనుపింపు జను సొంపు
నెగయింపు సునయింపు పనులనుండు

గీ. నతఁ డనఘుఁ డాఢ్యుఁ డనవద్యుఁ డఖిల హృద్యు
డలఘుఁ డతిశూరుఁ డతిధీరు డత్యుదారుఁ
డనుపమస్వాంతుఁ డతికాంతుఁ డమితశాంత
రసుఁడు సీతన్నమాణిక్యరాయ శౌరి 48

గీ. అతని పట్టపుదేవి భాగ్యముల దీవి
దీనజనకల్పవల్లి సాధ్వీమతల్లి
నమదభయదాత్రి సహనభావమున ధాత్రి
భవ్యగుణపేటి లక్ష్మణాంబా వధూటి 49

సీ. ప్రాణేశుఁ గికురించి పరుల చాటునవీగి
జాణయై విహరించు చాన తెఱఁగు,
సీటుగాఁ గూర్చుండి నిజనాథు నాడించు
రాజేశ్వరీదేవి రాజసంబు,
పతి కొద్దిపడి యంత బలికినై చేసాఁచఁ
దనుకని సిరుల భామిని హొరంగు,
తలవాకిటను సిగ్గు తలఁగి యొయ్యారంబు
నెనయించు పలుకుమానినివిధంబు

తే. పరిహరించుచు సమధిక ప్రాభవమున
బ్రాతిమెయి నాత్మపతి భక్తి పాదు కొలిపి
యత్తవారింటఁ బూలచేరెత్తి నట్లు
భవ్యములఁగూర్చు నచ్చమాంబా వధూటి. 50

మ. స్తిమితారాతి విచేష్టితుండు ఘనుఁడా సీతన్న మాణిక్య రా
య మహారాజకులావతంసునకు నచ్చాంబా వధూటీ వతం
సమునందుం బ్రభవించి రిర్వురు సుతుల్ జంగన్నమాణిక్యరా
యమహారాజకులేంద్రుఁడుం దిరుపతి క్ష్మాధీశ్వరుండుర్ రహిన్. 51

సీ. శ్రీ పున్నెపలికుల క్షీరాబ్ధిచంద్రుండు
బాంధవానన పద్మ పద్మహితుఁడు,
కృష్ణాని వంశవర్ణిత రాజతిలకుండు
శాత్రవ ద్విరద పంచాననుండు,
హంవీర వీరసాహస విక్రమార్కుండు
కామిత ఫలదాన కల్పశాఖి,
పద్మనాయకవర ప్రాగల్భ్య మహితుండు
సంపత్పరంపరా సమహితుండు,

తే. లాలిత శ్రీవిలాసుండు లక్ష్మణాంబి
కాకలిత గర్భశుక్తి ముక్తాఫలంబు
మన్నెహంవీర బిరుద సీతన్నభూప
వరకుమారుండు జంగభూవల్లభుండు 52

ఉ. ఆయుగధర్మ మాయుగమునంద యథావిధి చోదితంబుగాఁ
జేయఁగ లేరు నాఁటినృపసింహులు మానికరావు జంగభూ
నాయక సార్వభౌముఁడు ఘనస్థితిఁ దా ఘటియించు దానదీ
క్షాయుతుఁడై కలిం గృతయుగంబున కర్హములైన ధర్మముల్. 53

శా. ఆజిన్ రాజిలి గుంటురీ పురవర ప్రాంతంబున న్నిద్ధపుం
దేజీనెక్కి గుబాబునన్ దఱుముచున్ ధేయంచు బిట్టార్చినన్

జేజే వెరెట్ట నీదుశత్రులు భళీ శ్రీమన్మహారాజ రా
జాజంగక్షితిపాల కోత్తమ బిడౌజా రాజతేజోనిధీ 54

సీ. అని పద్యముఖముగా నభినుతుల్ గావించు
వరకవీశ్వరుల దీవనలు గాంచి,
దేవతాయతన సత్కృతి తటాక వనాది
సప్త సంతాన ప్రశస్తి గాంచి,
యాసేతు శీతాచలాంతరాళంబుల
నిజయశః స్థేమంబు నెఱయఁగాంచి,
నలువురు సతుల విన్నాణంబు దులకించి
సీతావధూటితో సిరులఁగాంచి,

తే. ఆయురారోగ్య పుత్ర పౌత్రాభి వృద్ధి
గలిగి రేపల్లెనగర శృంగార సౌధ
రత్న సింహాసన స్థితి రాజ్యమేలు
భవ్యగుణశాలి జంగభూపాలమౌళి 55

శా. ఆజంగక్షితిపాలు తమ్ముఁడలరుఁ హస్తాగ్రభాస్వద్ధనూ
రాజద్వజ్రముఖాది ఘోరశరధారా దారితారాతి సే
నాజంఘాల గజాంగ భూషణ భరానమ్రావనీ ధాగణే
హోజాగ్రన్నిజ బాహుఁడై దిరుపతి క్ష్మాధీశ్వరుండిమ్ములన్ 56

సీ. శ్రీరామపదపద్మ సేవాధురీణుండు
వరదుఁడాశ్రిత జన వత్సలుండు,
కలనైనఁ బలికి బొంకని మహాసరసుండు
సదమలాచార విశారదుండు,
నీవార మనువారి నెఱవేర్చుధీరుండు
శూరుండు పరవధూసోదరుండు,
హరివాసర వ్రతాధ్యవసాయనిరతుండు
చేపట్టి వీడని సిరుల టెంకి,

తే. ఘనగగనగాంగ భంగ చక్రాంగపూర్ణ
శశిశిశిరశైల శారదా శంఖ వికచ
కాశనీకాశ విశద ప్రకాశ కీర్తి
రహిఁ జెలగుచుండు తిరుపతిరాయమౌళి. 57

క తా నన్నమాటతప్పక
నానాఁట హితంబు గలిగి నడచిన కరణిన్
దా నన్నమాట తప్పక
నానాట హితంబు గలిగి నడపుహితులకున్ 58

ఉ రామునియందు లక్ష్మణుఁడు రాజితభక్తికళాధురీణుఁడై
ప్రేమ ఘటించులీల దలపించుచు నన్నయదూంగుఁ దమ్ములన్
దామహనీయభక్తికలనావలనంబున దేరు మానసః
క్షేమము నందగున్ దిరుపతి క్షితిపాలుఁడలోలశీలుఁడై 59

సీ. శ్రీమన్మహాదేవ సేవానుభావంబు
గాని ధనుర్ధరుఁడైన గుహునిలీల,
గాధేయు బోధంబు గాంచి కోదండ దీ
క్షాగురుండైన దాశరథిలీల,
పరశురాము భజించి శరశరాసన కళా
ఘనుఁడైన జాహ్నవీతనయులీల,
ద్రోణునారాధించి బాణాసనాభ్యాస
పటిమంబు గాంచిన పార్థులీల,

తే. శ్రీ మహమ్మదజాఫర నామధేయుఁ
డగు శరాసనగురువరు నాశ్రయంబుఁ
బడసి విలుదాల్చి కలియుగ పార్థుఁడనగ
ప్రౌఢిఁ జెలువొందెఁ దిరుపతి రాయశౌరి. 60

సీ. అబ్ధిరాజన్య కన్యాలలామంబుతో
గ్రీడించు హరికి మ్రొక్కిన ఫలంబు,
ప్రాలేయగిరిరాజ బాలాసమేతుఁడై
చెలగెడు హరునిఁ గొల్చిన ఫలంబు,

భారతీలోలుఁడై పరిఢవిల్లెడు విరిం
చికిఁ బ్రియంబాచరించిన ఫలంబు,
జనకజా సహితుఁడై జగములఁ బ్రోచురా
ముని దయాభ్యుదయ మందిన ఫలంబు,

తే. మెఱయఁగా నప్పమాంబాస మేతుఁడగుచు
ధనకనకవస్తు వాహన ధాన్యపుత్ర
పౌత్రదీర్ఘాయురారోగ్యభాగ్యభోగ్య
మహిమ గనుచుండు తిరుపతిక్ష్మావిభుండు ॥ 61

వ. వెండియు నమ్మహీవల్లభుం డఖండితలక్ష్మీకటాక్షవీక్షణానుక్షణ ప్రచీయమాన సంపత్పరంపరాభ్యుదయుండును సంపత్పరంపరాభ్యుదయనిదానదై నందిన దానధారా ప్రవాహుండును, దై నందినదాన ధారా ప్రవాహపరివాహావగాహన వినిర్మలహరి దంత దంతావళ స్కంధబంధుర కీర్తిన ర్తకీ చరణవిన్యాసుండును, న ర్తకీచరణవిన్యాసోద్భాసిత మంగళమృదంగ నిస్వనసముద్ద్యోతిత కాలత్రయ లక్ష్మీ పూజామహోత్సవుండును, మహోత్సవ సమయ సముజ్జృంభిత కుతుపశాప్రముఖ పురాతన పాదుశానుగ్రహపితృపితామహలబ్ధ పటుతర పటహతమ్మట భేరీ డిండిమప్రముఖ వ్యాధ్యానవద్యవాద్య ఘుమఘుమ ధ్వాన పూరిత దిగంతరాళుండునునై, రాకాశశాంకోదయంబున విజృంభమాణంబగు పయఃపారావారంబు కరణి ప్రాజ్యంబగు రాజ్యంబు పాలింపుచు రాజరాజాభిరక్షితంబగు నలకానగరంబుకై వడి, ధన ధాన్య కరటిరథతురంగభటసముద్భటంబగు రాచూరి పట్టణంబున యథేష్టభోగంబులం బ్రవర్తిల్లుచు నొక్కనాఁడు హరివాసరవ్రతంబునడపుచుఁ గృష్ణకథాశ్రవణంబునఁ బొద్దు గడపునప్పుణ్యరాత్రి చతుర్థయామంబున, 62

సీ. తొగఱేని జిగిఁబూని తగుమోము సొగసాము
కొనుమోవినునుకావి గలుగువాఁడు
మునుకారునను కారు కొనుమించు గనుపించు
చెలువమై చెలువమ్మెఁ జెలఁగువాఁడు,

బలుసింగముల భంగపడ నూను నడుమాను
బంగారు రంగారు పటమువాఁడు,
జలజాతములభీతములఁ జేయఁగలచాయ
కనుదోయిఁ గనిహాయిఁ బెనఁచువాఁడు,

తే, పలుకు పలుకున నమృతంబుఁజిలుకువాఁడు
చాపరోపాభిరూప హస్తములవాఁడు
కనకభూషణభూషితాంగములవాఁడు
కలనొకమహామహుండు సాక్షాత్కరించె 63

సీ. శశిబింబమున సుధాసారమెచ్చిలుభాతిఁ
జిఱునవ్వు మొగమునఁ జెలఁగువాని,
జలజాతముల తేనె చిలుకులై కన్నుల
కరుణావలోకముల్ గలుగువాని,
నుదయాద్రినినులీల నుత్తమాంగమునందు
కనకకోటీరంబు దనరువాని,
జలధరంబునఁ దోచు శంపాలతికరేఖ
నొడలహేమాంబరం బొలయువాని,

తే శరశరాసన కలితహస్తములవాని
జతనొకలతాంగిరాఁగూర్మి నలుపువాని
భువనమోహను నమ్మహా పురుషుఁగాంచి
రాజతిలకుండు హృష్టాంతరగుఁడగుచు ॥ 64

ఉ కించిదుపజ్ఞ నాత్మఁబరికించి తదూర్జితచిహ్నముల్ విలో
కించి మదంబుమీఱఁదిలకించి రఘూద్వహుఁగా మదిన్వితʼ
ర్కించి భయంబుభక్తిగమకించి తదంఘ్రిసరోజయుగ్మమం
కించి భజింప మెచ్చి తులకించిన కూరిమి నవ్విభుండనున్ 65

మ. ధనురాచార ముదారతంబడసి నిత్యంబుగ్ దదభ్యాసముం
గని రేయుంపగలుం దదేకనిరతిం గల్యాణ లాభంబుగ్గా

కొని విన్నాణముగాంచి భావనలచేఁ గోదండదీక్షాగురుణ్
నను మెప్పించిన మేటివీవ ధరణీనాథావతంసాగ్రణీ ॥ 66

సీ. ఋగ్వేదమును యజుర్వేదంబు మఱిసామ
వేదం బథర్వణవేదమనఁగ,
నాల్గువేదంబులు నాల్గువిద్యలు తదీ
యాంగముల్ శిక్షాదు లాఱువిద్య,
లవల మీమాంసయు న్యాయవిస్తరము పు
రాణంబు ధర్మశాస్త్ర మివినాల్గు,
గాఁక నాయుర్వేదకార్ముకవేదగాం
ధర్వనీతిప్రబోధములు నాల్గు,

తే. వెరసి పదియునునెనిమిది విద్యలభవుఁ
డఖిలలోకైకహితముగా నాది నుద్ధ
రించె నీ విద్యలందు పార్థివుల కధిక
విభవముల నిచ్చు నిద్ధనుర్వేదమనని॥ 67

వ. అట్లగుటం జేసి, 68

క. అలయష్టాదశ విద్యలఁ
గల దిద్ధనురాగమంబు గణనీయంబై
బలువిడి నిది కావ్యముగా
వెలయింపుము నీదుకీర్తి వెలయుం దిరమై ॥ 69

ఉ. మానధనాగ్రణీ వినుము మాదృశహృద్యములైన సత్తసం
తానములందుఁగావ్యము సనాతనమై ఘనమై తనర్చుటన్
మానవుఁ డెవ్వఁడేని సుమనంబగు కావ్యమభీష్టదేవతా
ధీనముసేయ నాయతగతిం జగతిం బొలుపొందుఁ బొందుగన్ ॥ 70

మ. నరుఁడా కుంభజువేఁడినట్లు గురుఁడానందనంబునం గ్రీడితోఁ
బరిపాటిన్ వివిపించినట్లుగఁ గథాభాగంబుభాగించి క్రొ
వ్విరులం దేవియగూర్చుకైవడి ధనుర్విద్యావిలాసాహ్వయం
బొరయం గావ్యము మాకు నర్పణముగా యోజింపుముత్సాహివై 71

సీ. ఎంతగాలము భాను హిమభాను దీధితుల్
జత నహోరాత్రంబు నలుపుచుండు,
నెంతగాలము ధాత్రి హేలావిలాసంబు
గాంచి లోకులనుద్ధరించుచుండు,
నెంతగాలము దివ్యదంతావళాష్టకం
బష్టదిక్కూలంబు లానియుండు,
నెంతగాలము భుజగేంద్రుఁ డీభువనంబు
నిజఫణాశక్తిపై నిలుపుచుండు,

తే. నంతదడవు దిగంతవిశ్రాంతముత్త
జాన్నగరరాజ్యసింహాసనానుభావ
పృథులతరవంశపారంపరీనిరూఢిఁ
బ్రబలుఁడవుగమ్ము తిరుపతిరాయమహాళి ॥ 72

క. నాదు కృతిసేయు మీకృతి
నీదగురాజ్యమున నీవనీనగరమునం
గోదండరాముఁ డనగా
నేఁదనరుచునుండు నీకు నిలువేలుపనై ॥ 73

తే అసిశరశరాసనములు నెయ్యమున నొసగి
కరుణ దళుకొత్త దీవించి గారవించి
యమ్మహాత్ముండు విచ్చేసినట్లు గాఁగ
మేలుకలగాంచి యంతట మేలుకాంచి॥ 74

వ వెండియు నమ్మహీవల్లభుండు స్వప్నదృష్టంబులగు నమ్మహాపురుషుని సౌశీల్యవాత్సల్యతారుణ్య లావణ్య గాంభీర్యాదార్యాది మహారాజ లక్షణంబులకు భయవినయసంభ్రమంబులు రెట్టింప కొండొక తడవు తదేకాయత్తంబైన చిత్తంబత్తమిల్ల మెల్లన నెత్తమ్మిరేకు విచ్చిన కరణిం గనువిచ్చి నలుగడలుం గాంచుచు శయ్యామంది రోదరోపరి విచిత్రతర చిత్ర సంధానిత వితాన మతల్లికాంచలవిలంబిశ గ్లానకు

వలయప్రసూనంబులను వికసద్బిసప్రసూన ముకుళవకుళగర్భ నిర్భర ప్రసార[1]స్ఫారి తారుణపరాగ పరిమళ పరిమేళన ఘుమఘుమత్సమీర కిశోర మంథర విహారంబులను, ప్రతిప్రభాత కరణీయ దేశాక్షి ప్రముఖ రసవిలసద్గానతానకగోష్ఠీవిధాయక గాయక నఖరముఖరద్వీణా నిక్వణంబులను భవిష్యత్ప్రభావిరహాశంకాపిచండిల పాండురస్వరూపంబులగు దీపంబులను, గృహారామసీమాంతరమహాతరు కుటకోటర తట ప్రబుద్ధ శుకపికశారికానికర కాకలీకలకలంబులను, ప్రభాతంబుగా నెఱింగి దిగ్గన లేచి పావనంబగు శయ్యాభవనంబు వెలువడి కుఱంగటి కురంగశాబాక్షీలలామంబులనిలువంబట్టిన నిద్దంపుటద్దంపు టాఱుపులం బిసాళంబుగాంచుచు ప్రాతఃకరణీయంబులగు కార్యంబులుయథావిధిం గావించి మజ్జనభోజనంబులాచరించి స్రక్చంద నాంగరాగంబుల నుపభోగం బవధరించి కనత్కనకమణిఖచితగ్రైవేయహారకేయూర కటకకాంచీ ప్రముఖంబులగు నాభరణంబుల నలంకృతుండై, సకల జన సభాజన భాజనంబులగు వీజనంబులును, రాకాశశాంక ప్రభాపాత్రంబులగు నాతపత్రంబులను పరితఃస్థగితకాంచన పట్టంబులగు నాలవట్టంబులును, శ్రుతి మధుర గంభీరస్వర కళా తరంగంబులగు మృదంగంబులును, రిపుశ్రవణ భీషణ నిర్ఘోష చండిమంబులగు డిండిమంబులును నినాద మేదుర సహృదయహృదయ దోహళంబులగు కాహళంబులును, లోనుగా నానావిధమహారాజచిహ్నంబులు ధరించిన యథ్యై వినియోగంబులవారు, నలుగెలంకులం గొలిచి నడవ, పసిండిపాదుకలెక్కి మదకల కంఠీరవరాజంబు చాడ్పున శుద్ధాంతవిశాంతంబు వెలువడి మంజుల సాలభంజికాపుంజ రంజిత శాతకుంభ స్తంభ సంభృతంబును చల దుచ్చలాంచ లాముక్తముక్తాఫల శోభితోల్లభంబును, సురుచిరతర కార్తస్వర భాస్వరాస్తరణంబును, సుగంధిలగంధవహాస్తసంధయమంథరాగమసుగమ గవాక్ష లక్షితంబును చతుర్ద్వారస్ఫారితమరకత మణిగణకిరణప్రభాధగద్ధగితంబును నై ప్రదీప్తతప్తకార్తస్వరప్రభావిభాసిత సిత మణిరమణీ చకచక చ్చకిత

1 నాభివితారణ.

స్థూణాకోణవిరచిత రుచిరవిచికిలధానికానికాయంబుల ననపాయంబు
లగు మల్లికా వల్లికావితానంబుల ప్రతానంబుల ననూనంబులగు
సూనంబులఁ బాదుకొను నామోదంబుల మోదంబుల నాస్వాదిం
చుచు మేదురంబులై సయ్యాటల నలుఁగెలకులం దాఁటు తేఁటుల
పాటల సబాటంబులకు నివాటంబు గులుకుచు పటుతరకటకతటని
కటస్ఫుట ఘటితమహానీలజాలక రుచిరింఛోళికాభరంబులు జలధరం
బుల తెఱంగున నింపు సంపాదింప సొంపునఁ దుంపెసలాడు సంవర్ధితమ
యూరంబులవయారంబులు సంభావించు పంజరకీరంబుల ముగ్ధమధురా
లాపంబుల నాకర్ణించుమదకలకపోతంబులకు నాటపట్టులగు మణివిటం
కంబులను, ప్రతివాసరోద్భాసిత మృగమద ఘనసార కుంకుమాగరులే
పంబులను, నిరంతరపరిస్ఫురిత సాంబ్రాణి ధూపంబులను, పరితః
పరిణద్ధ మణికలాపంబులను, రామణీయకంబు దాల్చుచు జలధిరాజ
కన్యకాకటాక్ష వీక్షణసుందరంబగు నాస్థాన మందిరంబు ప్రవేశించి
భువనమోహనంబగు సభాలంకారపారమ్యంబు గనుంగొన సాంగ
సాయుధ సపరివారంబుగా నుపరిభాగంబునం దావిర్భవించిన దిక్పాలక
నికరంబుల కరణిఁ బురణించు తత్తదాకారస్ఫారిత పాంచాలికా సంచ
యంబులం జిత్రంబులగు ముత్తియంపు జగజంపు మేల్కట్టు క్రింద
మహార్హంబగు సింహాసనంబున సుఖాసీనుండై పంచశరసుకుమారు
లగు కుమారులును, సురుచిర ప్రతిభావిచిత్రులగు పౌత్రులును, నిజ
కరుణా కటాక్షలక్షిత సంప త్పరంపరా నుబంధులగు బంధులును
ధీమంతులగు సామంతులను, విన్నాణంబులఁ బలుకుపలుకుల సంగ
డంపు గమికాండ్రగు నల్లుండ్రను, సంధివిగ్రహాది షడ్గుణ యథాను
గుణ ప్రయోగపరిపాలిత సురరాజమంత్రులగు మంత్రులును, కాల
త్రయకుశల [illegible] జ్యోతిష మనీషా సమాహితులగు పురోహితు
లును, సుధీనికరావతంసులగు విద్వాంసులును, ప్రాచేతసవ్యాస
కాళిదాస ప్రముఖ పురాతన కవి కవితా ప్రశంసాను భవులగు
మహాకవులును, పురాణేతిహాస కథా ప్రవచ నానుగుణ వాణీ శ్రేణి
కలుగు పౌరాణికులను, నిజాన్వయ బిరుదావళీ సంకీర్తన కళానందు
లగు వందులను, శ్రుతి మధుర సంగీత గోష్ఠీ విధాయకులగు గాయకు

లును, సకల వర్ణవర్ణన కథా యాథార్థ్యసూచకులగు పరియాచకు లును, నిజవాహినీ ఘోష విడంబిత వాహినీపతులగు వాహినీపతు లును, మహోదారులగు సరదారులును, భుజబలోదాత్తులగు రాహుత్తులును, ధనకనక వస్తువాహన ప్రముఖ భవ్యద్రవ్య ప్రవర్త కులగు వర్తకులును, దక్కనుం గల వినియోగంబుల వారలు యథార్హంబులగు నాస్తరణంబులం జేరి భయవినయంబులం గొలువ దక్షిణభాగంబునం గూర్చుండి నిండుఁదనంబున నొండొరు లుపన్య సించు పండితుల శాస్త్రోపన్యాసంబులకు వికాసంబు నొందుచు వామభాగంబున నవరసాలంకార ధోరణీ పరిణత గద్య పద్యంబుల తాత్పర్యంబులు వక్కాణించు మహాకవుల వక్కాణంబులకు విన్నా ణంబులు గులుకుచు, కుఱుంగట రాజకార్యపర్యాలోచనంబుల నా మంత్రణంబు సలుపు మంత్రుల మంత్రంబులకుం దగిన తంత్రంబు లాకలింపుచు పిఱిందిదెస మెఱుఁగు దీవియల తెఱఁగున బెణంగులు కులుకు గణికానికరంబుల సాభిప్రాయ వచనంబు లాకర్ణింపుచు నిరుగెలంకులం గులుకుఁ గుబ్బెతలబ్బురంబుగా నొలయం జేయు పావడచెఱంగులం దళతళమను నెత్తళుకులం బెళుకుచూపుమ వెను కొని వినయంబున నూడిగంపుఁజేడియ లందించు మావడంపుం గడాని పసిండితేకులంబోని తెలనాకుమడుపులకుం గటకాంగుళీయక స్థగితమణికిరణప్రసారంబులం బ్రశస్తంబగు దక్షిణహస్తంబు సాచుచు, పురోభాగంబునం గడింది వేలుపునాగవాసమ్ముల మెచ్చని విలాసం బుల నెఱసీటుగులుకు కలికినెలయాండ్ర మొత్తమ్ములు నృత్తమ్ముల చిత్తమ్ము లివురు లొత్తం జేయు జోహారు లవధరించుచు, మహేంద్ర విభవమ్మునం బేరోలగింబుండి స్వప్నవృత్తాంతంబు పన్యసించిన వేద విదులగు సభాసదు లిట్లనిరి ॥ 75

చ శివుఁ డలఘుండు వింట శశిశేఖరుమించు నరుండు పార్వతీ
ధవసురరాజనందనుల ధాటికి మేలగు జామదగ్న్యుఁడా
భవకపి కేతు భార్గవులపాటికి మేటి కుమారుఁ డీశవా
సవిజమదగ్నిరామశరజన్ముల మీఱు రఘూద్వహుం డిలన్ ॥ 76

వ. మహారాజకులశిఖామణీ! చిత్తగింపుమా! యట్టి జగదేకధనుర్ధరుండగు రఘుకులతిలకుఁడు స్వప్నంబున సాక్షాత్కరించుట నరిష్ట పరిహారంబును, నితోధికసామ్రాజ్యలక్ష్మీవిభవాతిశయంబునుం గలుగు వెండియు నమ్మహాత్ముండు పనిచిన కైవడి - పద్యకావ్యంబుగా "ధనుర్విద్యా విలాసంబు" సంఘటించి యద్దేవునకు సమర్పణంబు గావింపుము యుష్మద్ధనుర్విద్యాపరిశ్రమంబునకు నిది ఫలంబుగా మా మనంబునఁ దోచుచున్నయది యనినం బ్రహృష్టాంతరంగుం డగుచు సజ్జనపాలతిలకుండు 77

మ. ననురామానుజపాదపద్మయుగళీనవ్యావ్యయధ్యాన పా
వనహృద్భాగవతావతంసపదసేవాసక్తచిత్తున్ మరు
త్తనయారాధనలబ్ధచారుకవితాధారున్ సదారూఢ భా
వను నాస్థానకవిన్ నిజాశ్రితునిఁ బిల్వంబంచి పల్కెన్ దయన్॥ 78

క. శ్రీరామభద్రు పనుపున
ధారాళంబై తనర్చు ధనురాగమ మి
ద్ధారుణిఁ గావ్య మొనర్పఁగ
నారంభించితి భవత్సహాయము కలిమిన్॥ 79

వ. వెండియుఁ గోదండదీక్షాగురుండగు రఘుపతి కటాక్షంబునం జేసి సద్గురులాభంబున నిద్ధనుశ్శాస్త్రంబు మాకు నధీతంబయ్యె, తల్లక్షణంబులు శాస్త్రసమ్మతంబులుగా నుపన్యసించెద, నీవును దత్తత్ప్రకారంబు లధికరించి గద్యపద్యాత్మకంబుగాఁ గావ్యంబు రచియింపు, మక్కావ్యంబు మత్కులదైవతంబగు నీవని కోదండరామునకు నంకితంబు గావించి యద్దేవునికరుణాకటాక్ష వీక్షణంబుల నాయురారోగ్య పుత్ర పౌత్రాతిశయ సంపత్పరంపరాభ్యుదయంబులం గృతార్థుండ వయ్యెద వని పలిక మఱియును 80

క. పాత్రుఁడవై మైత్రేయస
గోత్రుఁడవై నారసింహ గురువర్యునకున్

బుత్రుఁడవై వెలయుదువి
ద్ధాత్రిన్ మా పనువు సేయఁదగుఁ గృష్ణకవీ॥ 81

క. అని యాన తియ్య నేఁ జ
య్యన జనితామోదరసమయాంతఃకరణం
బున నట్లకాక యని ప
ల్కిన విభుఁ డానంద కందళిత హృదయుండై॥ 82

వ తాంబూలజాంబూనదాంబరాభరణంబుల నన్ను బహుమానితుం
గావించినం గృతార్థుండనై యిద్ధనుర్విద్యావిలాసంబునకుం గృతి
పతియగు రఘుపతి గుణకీర్తనంబు గావించెద 83

సీ ఏదయాపరమూర్తి యింద్రాదు లర్థింప
నర్కాన్వయంబున నవతరించె,
నేదేవదేవుండు వైదేహిఁ బెండ్లియై
పరశురాముని గోర భంగపరచె,
నేవీరవర్యుండు రావణాదులఁ ద్రుంచి
రహి నయోధ్యా నగరంబు సేరె,
నేమహాభాగుండు భామినీ సహితుఁడై
పట్టాభిషేక వైభవము గాంచె,

తే నాఘనుఁ డెసంగు మందారహార హీర
గాంగడిండీర కర్పూర గంధ సార
రాజధర రాజతాచల రాజభుజగ
రాజసితకీర్తి కోదండరామమూర్తి॥ 84

శా ఆరామప్రభుఁ డీవనీపురమునం దర్చాస్వరూపంబునన్
శ్రీరాజిల్లగ జానకీ సహితుఁడై కృష్ణానదీ తీరమం
దారూఢిన్ విలసిల్లుచుం దిరుపతి క్ష్మాధీశ్వరుంతున్ మదిన్
గోరం గోరికలిచ్చుచుం గనఁదగున్ గోదండరామాకృతిన్॥ 85

సీ. సర్వసర్వంసహా సహాతాహాతారాతి
రాతి నాతిగఁ జేయు నీతిశాలి,
హారినీలనీలదేహాకలాకలాపుఁ డా
పదఖర్వశార్వర భానుమాలి,
హారనీహారడిండీరపాండుర కీర్తి
కీర్తిత స్ఫూర్తి పొంగిన ఘనుండు,
హంవీర వీర సాహసహాసద్వదనుండు
మదన కోటివిలాస మననశాలి,
తే. శయకుశేశయశయశరాసన విరావ
కృశదకూపారపారంపరీపరీత
తిమితిమింగిలగిల కులోద్వీక్ష్యవిలస
దసమసమరామరారంభుఁ డవ్విభుండు॥ 86

---

షష్ఠ్యంతములు

క ఏవంవిధచరితునకును -
శ్రీ వైదేహీరతునకు జితదురితునకున్
సేవాశ్రితభరతునకుం
బావనగుణనిరతునకును భయవిరతునకున్॥ 87

క. మంజులగుణసంగతికిన్
గంజాతభవాదిపుణ్యగతికిన్ గరుణా
రంజిత మతికిన్ రక్షో
భంజనరతికిన్ ధరాధిపతికిన్ గృతికిన్ ॥ 88

క. ఇందుధరానందకరా
మందభరాజగవహరణ మహితాంగునకున్
సుందరమాకందరమా
మందిర [1]మానిత వనాభిమత ఖేలునకున్ ॥ 89

---

1 మానితరసాభి,

క. కుండల మణి మండల ఘృణి
గండలసనశాలి కమలకమలాక్షునకున్
చండభుజాదండజితా
ఖండల వేదండ చండకరధోరణికిన్॥ 90

క జృంభిత మదగుంభిత బల
గంభీర నిశాట ఝాట ఘనతరబాహా
రంభాకుచకుంభపరీ
రంభకళారంభకోద్ధురశరోద్ధతికిన్॥ 91

క. అక్షాదిక రక్షోనిక
రక్షోభకరక్షమాభిరక్షితసుమనో
రక్షకునకు భిక్షుకమద
శిక్షకునకు మాలికాలసితవక్షునకున్॥ 92

క. లోలాలస లీలాలస
దేలాడోలాచలాంగ హృదయాంగమభూ
బాలాలిక బాలాలక
జాలబుజాకరణకేళిచణనఖరునకున్॥ 93

వ. అంకితంబుగా నాయొనర్పంబూనిన "ధనుర్విద్యావిలాసం"బను లక్షణ
గ్రంధంబునకుఁ గధా ప్రారంభం బెట్టిదనిన. 94

---

క థా రం భ ము.

సీ. శైలూషవృత్తికి శాండిల్యభావంబు
ఘటియించు నేదిక్యకాననంబు
ఘనశాబరాళికిఁ గాలవోద్యానంబు
రహిఁ నిచ్చు నేశుభారామ వాటి,
సారది జాతులకెల్ల సుమనోవిలాసంబు
భావితంబుగఁ జేయు నేవనంబు,
భూమి జంబుకమాత్రములకు నైరావతో
ద్ధతి గూర్చె నే మహోద్యాన వాళి,

తే వేయు నేటికి తనుఁజేరు విషములకును
అమృతభావం బొసంగు నే యాశ్రమంబు
అవని నది శౌనకాదుల కనుదినంబు
నవనవాగమ ఫలదంబు నైమిశంబు 95

క ఆవన మతిపావనయుతి
పావనమై రుచిర విచర దమర మరాళీ
తేవన వరజీవన భర
భావనమై పరగు ధర నభంగుర భంగిన్ 96

వ అయ్యాశ్రమంబునందు. 97

క. సూత [1]ముఖోద్భూతకథా
స్వాత సుధామధురధోరణీలాలసులై
శీతలగుణపూతలస
ద్భూతలులై శౌనకాది మునికులతిలకుల్ 98

వ నిఖిలపురాణవ్యాఖ్యాన గోష్ఠీ గరిష్ఠుఁడైన రోమహర్షణివలన భారత కథాక్రమంబు వినుచుండి పాండవధార్తరాష్ట్ర సంభవంబును, కుంభ సంభవువలన నక్కుమారుల శస్త్రవిద్యాలాభంబును, నట్లు సతీర్థ్యులును, సవయస్కులును, నైయభ్యసించు వారలలోనఁ బార్థుం డు సమర్థుండగుటయు నాకర్ణించి యిట్లనిరి 99

మ. అనఘా పార్థునకట్లు దివ్యమగు విద్యాకౌశలం బేమి నే ర్పునఁ బ్రాపించెను తక్కునుం గల కుమారుల్ జోడునం జూడఁగా వినఁగానీ గురుండు పార్థునకు నివిన్నాణ మేయిక్కువన్ వినుపించెన్ వివరింపు మీకథ కృపావిర్భావ భావోన్నతిన్. 100

వ అనినం బ్రమోదంబునం బొదలుచు సూతుండు శౌనకాదులం జూచి యిట్లనియె 101

సీ. కుంభసంభవుఁ డొనరించు కూపపతిత
కందు కాకర్ణణమునకు గారవించి

---

1 సూతయథాజాత.

కృపుఁడు భీష్ముఁ డాచార్యు నగ్గించి విద్య
గఱప నునిచిరి పాండవ కౌరవులకు 102

ఉ. పాండవ కౌరవుల్ పరమ పావనుఁడౌ గురు నాశ్రయించి కో
దండ కళానుభూతి సకలంబు పరిశ్రమ మాచరింపఁగాఁ
బాండవమధ్యముండు గురుభావము రంజిల భక్తియుక్తుఁడై
నిండుఁదనంబునం గొలిచి నేర్చుచునుండు ధనుః ప్రయాసముల్. 103

వ. అంత నొక్కనాఁ డాచార్యుండు విలువిద్యగఱచు రాజకుమారలోకంబు నాలోకించి నామనోరథంబు సఫలంబు గావించు వాఁడెవ్వండనవుడు, తక్కంగలరాజకుమారు లొండొరుల మొగంబులు సూచుచు నెద్దియుం బలుక కుండినం బార్థుండు యుష్మన్మనోరథంబు సఫలంబు గావించెదనని పలుకుటయు, నతనిధైర్య స్థైర్యంబులకు మెచ్చి యొక్కనాఁ డేకాంతంబున నతనికి ధనుశ్శాస్త్రంబు సవిమర్శకంబుగా నుపదేశించు వాఁడై తనకుఁ బ్రణామం బాచరించి సావధాన మనస్కుండై విన నుద్యోగించు పార్థునితో వివరించినట్లు రౌమహర్షణిశౌనకాదులకుం జెప్పె నని వైశంపాయనుండు జనమేజయునకిట్లనియె. 104

సీ. ఈ మహావిద్యాలలామంబుగల యిల్లు
పాలేటిరాచూలి పట్టుఁగొమ్మ,
యీ శరాభ్యాస సంహితగాంచుమేటికి
శాకినీఢాకినీ లోక మొదుఁగు,
నీ ధనుష్పాండితీ బోధంబుగలధీరుఁ
డతుల సామ్రాజ్యంబులనుభవించు,
నీ కళాపరిణతి కిరవైన ధారుణీ
భాగంబు లోకైక పావనంబు,
ఇది మహానటనానటమిది గభీర
మిది కుమార [1](సమీరి) తమిది యుదార
మిది పరశురామ కామిత మిది యపార
మిది సకలధారుణీశ్వరాభీష్టదంబు 105

1 తమిది,

మ. ఖగవిఖ్యాతి శిలీముఖమ్ము దళముల్ గాంచె న్మధుశ్రేణికా
దిగుణోద్యత్సుమనస్కమై ఫలదమై దివ్యాగమోత్తంసమై
జగతిన్ మంజులతాశ్రయంబగు ధనుశ్శాస్త్రంబు రాణించు ని
మ్ముగమందారమహీరుహమ్మనఁగ నామోదమ్ము పుట్టించుచున్ ॥ 106

పంచ. హరిం గుఱించి యంచితోపహారమిచ్చి తెచ్చిరా
పురాణపూరుషుల్ ఋషుల్ తపోబలంబుడంబునం
ధరామరామరాభయప్రదంబు లస్త్ర శస్త్రముల్
ధరాధరుల్ ధరించి సంచిత ప్రతాపులై రిలన్ 107

వ. అనిన విని యర్జునుండు కుంభసంభవుం గనుంగొని మహాత్మా! యేమి కతంబున హరిం బ్రార్థించి మహర్షులు ధనుశ్శాస్త్రంబు వడసిరి అట్లు పెద్దగాలంబు తపం బాచరించినం బ్రాప్తంబగు నిమ్మహాగమంబు భూపాలకులశ్రేష్ఠులకు నొసంగుటకుఁగారణంబేమి వినవలతు సవిస్తరంబుగా నానతీవలయునని పలుకు పాండవమధ్యముం గనుంగొని కలశభవుం డిట్లనియె 108

శా. వేదాచారవిదూరగుల్ దనుజు లుర్విం దుర్విధిం బర్వఁగా
వేదాచార విశారదుల్ మునులు నిర్వేదింప సర్వేశ్వరుం
డాదిన్ మంత్రములున్ బ్రయోగ ముపసంహారంబునుం గా ధను
ర్వేదం బిచ్చిన నమ్మహాత్ములు దయావిర్భూత చేతస్కులై 109

క. అపకారికి నుపకారికి
నపకారము ద్విజుల కహిత మగు నుపకారం
బుపకారికి నపకార
మ్మపకారికిఁ జేయుట ల్వర్మ మగు నృపతులకున్, 110

వ. అని తలంచి ధనురాగమంబు సాంగోపాంగంబుగా రూపలక్షణంబుల నుపలక్షితులగు నృపకుమారులకు నుపదేశించినం గృతార్థులై జగదుపద్రవంబు వారింపుచు లోకప్రవర్ధనకరులనం బ్రవర్థిల్లుచుండుదు రట్లగుట రాజులకు ధనుర్విద్యాకౌశలం బావశ్యకంబు 111

క. తేజమున ధనము వడయం
గా జవమున నేఁగి మున్ను గాంచితి నంచ
ద్రాజధర భూరి కరుణా
భ్రాజితవిద్యాభిరాము భార్గవరాముౝ. 112

వ. అమ్మహాత్ముండును మద్వాంఛితం బెఱింగినవాఁడై లోకరక్షణ విచక్షణంబులగు కటాక్ష వీక్షణంబుల నుపలక్షింపుచు నిట్లనియె. 113

క. ధాత్రిం గశ్యపమునికిని
బాత్రంబగు ధనము నెల్ల బ్రాహ్మణులకు లో
కత్రయి మెఱుంగ నిచ్చితి
గాత్రంబు మహాస్త్రశస్త్ర గణముం దక్కౝ. 114

క. ధనమునకును వరవిద్యా
ధనమునకును ధైర్యమాన ధనమున కాయో
ధనమునకును బట్టగు సా
ధన మస్త్రము దీనిబోలు ధనముంగలదే 115

వ. అనుచు సమంత్రకంబుగా నస్త్రశస్త్రంబులిచ్చినం బడసి కృతార్థుండనై తి విను మశ్వత్థామ కంబె భక్తిస్నేహంబులం బెద్దయుం గూర్తువు గావున నిద్ధనుశ్శాస్త్రంబు నీకు నుపదేశించెద భక్తియుక్తుండవై యాకర్ణింపుము. 116

మ. సరసాచారకలాకలాపకలనాసంయుక్తిలక్ష్మి మనో
హరునైన౯ హరునైన మానసమునం దశ్రాంతముం గొల్చి స
ద్గురు శుశ్రూషల నాచరింపుచు ధనుర్గోష్ఠీ గరిష్ఠుండ వై
గురుభావంబు వహింతు వీవు నిఖిల క్షోణీపతుల్ మెచ్చగన్ 117

సీ. తండ్రి కొడుకునకన్నయుఁ దమ్మునకును
దెల్లముగ నస్త్రవిద్య బోధింపవలయు
నట్లుగా దేని సువిధేయుఁడైన యట్టి
శిష్యునకు నైన నఱలేక చెప్పవలయు. 118

సీ. అఖిలవస్తు సమృద్ధి ననితరాసంగమై
యుల్లాసమున భావ మొలయవలయు,
నుల్లాసమున భావ మొలయుచుండెడి వేళ
కార్ముకాగమవేది గలుగ వలయు,
ఘనుఁడైన కార్ముకాగమవేది సన్నిధి
సంతతాభ్యాసంబు సలుప వలయు,
సంతతాభ్యాసంబు సలుపుచుండెడి మేటి
కధిక బాహాబలం బమరవలయు,

తే. భాసురంబగు మానసోల్లాస మొకటి
లక్ష్యలక్షణ విద్గురు లాభ మొకటి
సంతతాభ్యాస మొక్కటి సత్త్వ మొకటి
శస్త్ర విద్యకు నాలుగు సాధనములు. 119

వ. మఱియు నొక్క విశేషంబు గలదు. 120

క. వారికి వారికిఁ దగు భుజ
సారము గలదనుచు దలఁచి సత్త్వము కొఱగా
ధీరులు తెక్కన మూటని
గోరుదు రివి దక్క నేర్పు గానకొనకునికిన్ 121

క. బంగారు పరిమళించిన
భంగిన్ బాహాబలాను భావోజ్జ్వలుఁడై
పొంగి విలువిద్యఁ బడసిన
సింగము వలె సభల నుల్లసిల్లు నధికుఁడై 122

క. భావింపఁగ నుల్లాసము
జీవుండగు యత్న ముల్లసిలు దేహంబై
యీ వసుమతి గురుబోధము
లావల నంగీకరించు టాహార్యమగున్. 123

క. ప్రాభవనిష్ఠయు సద్గురు
లాభం బభ్యాస మను కళాత్రితయమునన్

శోభిల వొక్కటి దక్కినఁ
దా భిత్తిక యిడక నిలుపు ధామము కరణిన్. 124

సీ. గురుబోధమునఁ గాక కూలంకషంబుగా
నిల విద్య లరయువాఁ డీశ్వరుండు,
కావున విద్యాధికారంబు గోరిన
వసుధ సద్గురుఁడు కావలసియుండు,
సద్గురు బోధంబు సంధిల్ల ధీరుఁడై
బలు పరీక్షల భంగ పడకయుండు,
నసమసదభ్యాస మమరిన వానికి
నారయుచో నుత్సాహ మొలయుచుండు,

తే. భావసంవేది శాస్త్రార్థపారగుండు
శాంతుఁడును దాంతుఁడును దయాసాగరుండు
సులభుఁడును సుస్థిరుండును సుముఖుఁడైన
శస్త్రధరుఁ డగు ధాత్రిపై సద్గురుండు. 125

క. తెలిసియుఁ దెలియని వాఁడును
తెలిసియు శిష్యునకుఁ గలఁతఁదీర్పని వాఁడున్
దెలియక తెలియుదుననుచుం
బలు దెఱఁగులు చూపు గురువు బాలిశుఁడనఘా 126

క. అటువంటి వేషధారుల
తటవిటముల నాలకింప దలఁపక విద్యా
పటిమంబు గాంచు సద్గురుఁ
డటుకున నంగీకరింపఁదగు నేర్పునకున్ 127

ఉ. ఆదట సద్గురుండు కరుణాతిశయమ్మున నిచ్చు విద్య యి
మ్మేదిని నెట్టివారలకు మిక్కిలి మేలు ఘటించుచుండు నెం
పాదు ఘటించి నీరు పరిపాటిగ నించినఁ బట్టుగొమ్మలై
ప్రోది వహించుచుం జెలఁగి పూచి ఫలించు లతావితానముల్. 128

వ. ఉపదేశార్హుండగు శిష్యు నిరూపించెద నాకర్ణింపుము. 129

సీ వినయమ్ము గురువరానునయమ్ము గలవాని
పలుకు విన్నాణంబు గులుకు వాని,
చెలువముల్ వెదచల్లు సింహమధ్యమువాని
వలమురి నోడించు గళము వాని,
స్వచ్ఛంబులగు కాయ కచ్ఛముల్ గలవాని
సమములౌ పీవరాంసముల వాని,
దృఢ నిస్తులంబులౌ దీర్ఘ బాహుల వాని
సమ విభక్తాంగమ్ము లమరువాని,

తే గాంచి తోషించి శిష్యునిఁగా వరించి
విల్లు పట్టించి నేర్పులు విస్తరించి
యలయికలు మాన్చి యభ్యాస మలవరించి
కూర్మి వాటించుఁ గీర్తిచే గురువరుండు. 130

సీ ఉర్వి ద్వాత్రింశదాయుధములలోపల
నరయ బాణాసనం బధిక మండ్రు,
తాదృశంబగు విల్లుదాల్చిన చతురుండు
విభవాభిరాముఁడై వెలయు నండ్రు
గావున విలువిద్య గఱపువానికి శిష్య
వరుఁ డూర్జితుండు గావలయు నండ్రు,
జగతి నూర్జిస్వలుఁడగు వాఁడు షణ్ణవ
త్యంగుళోత్సేధుఁడై యలయు నండ్రు,

తే. సంగడంబున షణ్ణవత్యంగుళములు
మాన ముత్తమ పురుష ప్రమాణమంత
ఖర్వుఁడును దీర్ఘుఁడును గాని ఘనుఁడు (చూవె)
మహిసముఁడు సార్వభౌముఁడై మలయునండ్రు. 131

వ. ఇట్లు సమపురుష ప్రమాణంబు నిరూపింపం దగు, నింక సమవిభక్తాం
గుఁ డగుటకు ఫలంబు వివరించెద నాకర్ణింపుము. 132

ఉ. ఘ్రాణపుటమ్ములుం బొమలు కర్ణయుగంబులు చూచుకంబులున్
బాహులు కన్నుదోయి మణిబంధయుగ్మము కూర్పరంబులున్
శ్రోణులు జానులున్ బదసరోరుహముల్ వృషణావటు స్థలుల్
క్షోణి సమానవైఖరులఁ జొప్పడువాఁడు మహీశ్వరుండగున్. 133

ఉ. ఈ దృశరాజచిహ్నముల హెచ్చులు గల్గెడు రాకుమారకుం
బోదన చేసి రాఁదిగిచి భూరి దయాభ్యుదయంబునన్ ధను
ర్వేదకళానిరూఢి వివరించిన నంచిత శౌర్య ధుర్యుఁడై
యాదట నక్కుమారుఁ డుదయార్కుని కైవడిఁ బ్రోచు లోకమున్.

వ అనిన విని యుధిష్ఠిరానుజుం డాచార్యుని కిట్లను, మహాత్మా! పురా
తన రాజకుమారులయందు శాస్త్రోక్తంబులగు మహాపురుష లక్షణం
బుల నుపలక్షితుండై ధనుర్విద్యా లాభంబునం గోదండదీక్షాగురుం
డును, సార్వభౌముండును నై ప్రజాపరిపాలనంబునం దేజరిల్లువాఁ
డెవ్వండతని గుణలక్షణ ప్రకారంబులు వినవలతుం జెప్పుమనిన కుంభ
సంభవుం డిట్లనియె. 135

క. సోమద్యోమణి కులముల
క్షేమంబున నుదయమందు క్షితిపతి సుతులం
దీమహి శుభలక్షణముల
రాముఁడు పరిపూర్ణుఁడగుచు రాజిలుచుండెన్. 136

మ విలసద్బుద్ధి విశేషశాలి శుభవాగ్విస్తారుఁ డాలోడితా
ఖలనీతి ప్రకరుం డుదారుఁడు దరగ్రీవుండు సుస్నిగ్ధుఁడున్
సులలాటుండు సువిక్రముండు సుశిరస్కుండున్ సుగాత్రుండువ
త్సలుఁ డాజానువిలంబిబాహుఁడు ఘనస్కంధోజ్జ్వలుండాదటన్.

శా. యోధాగ్రణ్యుఁడు గూఢజత్రుఁడు విశాలోరస్థలుండున్ సము
త్సేధుండున్ మృగరాజ మధ్యుఁడు సమాశ్లిష్టాంగుఁడుం దీర్ఘబా
హాధుర్యుండు మహాహనుండు నవపద్మాక్షుండు భాస్వత్కటి
ప్రోథుండుం శుభలక్షణుండు గుణ సంపూర్ణుండుదీర్ణుండిలన్, 138

సీ. ధర్మస్వరూపుఁడై తనరు సత్యమునందు
ధనదు సాక్షేపించు దానగరిమ,
కాలాగ్నితేజంబు గాంచుఁ గ్రోధమునందు
విష్ణుసంకాశుండు వీర్యకలన,
కలశాబ్ధిసదృశుండు గాంభీర్యగుణమున
మేరుశైలనిభుండు ధీరవృత్తి
క్షమాసమాతిశయుండు సహనభావంబునం
దమృతాంశుతుల్యుఁ డాహ్లాదనమున,

తే. సర్వదాభిగతుండు సత్సముదయమున
సర్వశాస్త్రార్థతత్వ నిస్సంశయుండు
సర్వలోక ప్రియుండును సర్వసముఁడు
వేద వేదాంగనిధి ధనుర్వేద విదుఁడు. 139

క జ్ఞానానంద మయుండును
ధీనిధి వశ్యుఁడు యశః ప్రదీప్తుఁడు విజయ
శ్రీనిరతుఁడు సద్యః ప్రతి
భానుఁడు భానుకులజలజ భానుఁడు తలఁపన్. 140

వ. వినుమిట్లు మహాపురుషలక్షణంబులం బ్రసిద్ధుండు గావున దశరథరాజ నందనుండు వజ్రంబునకుం జోడు దొడిగినకరణి నిద్ధనుర్విద్యాలాభంబునఁ గోదండ దీక్షాగురుండను నామంబువడసి త్రిలోకశ్రీధరుండై వర్ధిల్లిచుండె వెండియు నిట్లు శరాభ్యాసంబునకుం గమకించు రాజకుమారుల యందు దుక్తంబులగు మహాపురుషలక్షణంబులం గొండొక శుభలక్షణంబు లేమియు నిరూపించి యక్కుమారునకు సమర్మకంబుగా నిద్ధనుశ్శాస్త్రంబునం గల విశేషంబు లుపదేశింపందగు 141

శా నీయందున్ శుభలక్షణంబులు కడుం నిండారుటం జూప శి
క్షాయత్తంబయి చిత్తమిత్తఱి మహోత్సాహంబు నొందెం బరీ
క్షాయోగ్యుండవు గమ్ము కొమ్మిఁక ధనుశ్శాస్త్రంబు చిత్రంబు నే
వేయుం జెప్పగనేల నిన్నిఁక ధనుర్విద్యానిధిం జేసెదన్. 142

వ. వెండియు నిట్టి ధనుశ్శాస్త్రంబునం గురుసంకీర్తనంబును, శిష్యవరణంబును, విద్యాప్రభావ సూచనంబును, సఖండాఖండకోదండద్వయ నామోద్దేశంబును, ధనుర్నిర్మాణప్రమాణప్రముఖ విశేషవినివిభాగంబును, మార్గణ పరిగణన ప్రణయనంబును, తద్విధాన మాన ప్రశంసనంబును, పుంఖోప సంఖ్యానంబును, పక్షపరిమాణప్రశంసయు, నిషంగరచనాప్రవచనంబును, మౌర్వీవిధానకథనంబును, నంగుళిత్రాణ ప్రకీర్తనంబును, జ్యారోపణప్రకరణంబును, ధనురూర్ధ్వాధరభాగవినిభాగంబును, ముష్టిప్రకరణంబును, స్థానోపసంఖ్యానంబును, శరగ్రహణహస్తప్రతిపాదనంబును, సంధానక్రమ వివరణంబును, నాకర్షణహస్తప్రస్తావంబును, శాణహస్త క్షేత్రనిరూపణంబును, దృష్టిలక్షణాన్వీక్షణంబును, ధనురాకర్షణ కౌశలోపన్యాసంబును, పుంఖోద్వేజన విభజనంబును, చాపముష్టి ప్రేరణ వివరణంబును, శరమోచన ప్రకార ప్రవచనంబును, చాపోత్సరణ లక్షణ వినిభాగంబును, శరాభ్యాసోచిత మాసోపన్యాసంబును, శరవ్యాపారయోగ్య తిథివారతారకాయోగ కరణవిస్తర ప్రస్తావంబును, ఖురళికారంగ ప్రసంగంబును, రంగప్రవేశలక్షణ నిర్దేశంబును, ధనుశ్శరపూజాయోజనంబును, గురుప్రణామస్థేమంబును, శరశరాసనగ్రహణ పౌర్వాపర్య పర్యాలోచన సూచనంబును, లక్ష్య శుద్ధిలాభంబును, లక్ష్యవేదికారచనా వివేచనంబును, నారాచమోచన ప్రకారసూచనంబును, చిత్రలక్ష్యభేదనోపాయ ప్రతిపాదనంబును, శబ్దలక్ష్యశరాభ్యాస విలాసంబును, దూరనికటస్థల లక్షిత లక్ష్యభేదన దృష్టి ముష్ట్యంగుళనియమన లక్షణాన్వీక్షణంబును, రథారోహణ శరాభ్యాస విశేషభాషణంబును, గజారోహణ శరప్రయోగ విభాగంబును, హయారోహణ శరమోక్షణ లక్షణ వివరణంబును, దూరాపాతి శరాభ్యాస విస్తర ప్రకీర్తనంబును, శరప్రయోగసమ సమయాసమయ నిరూపణంబును, శరగమనగుణ దోషవినిభాగంబును, దివ్యాస్త్ర మరిత్ర తంత్రప్రయోగ విస్తర ప్రస్తావంబును, లోనుగా పంచచత్వారింశ ల్లక్షణంబులు ఘటితంబులై యుండు క్రమక్రమంబున వివరించెద నాకర్ణింపుము.

మ. ధను విష్వాసము ధన్వ కార్ముకము కోదండంబు బాణాసనం
బును చాపంబును నా సుధీప్రణిహితంబుల్ నామముల్ గాంచి స
య్యన శార్ఙ్గంబన వంశజంబయి సఖండాఖండ భావంబులన్
దనరున్ విల్లు గిరీశవిష్ణుపురుహూతప్రోతమై ధారుణిన్, 144

గీ. స్థవిరమహిషశృంగ శకలయుగ్మంబును
బదరదారుఖండ పంచకంబు
శైలసంఖ్య గూర్చి శార్ఙ్గంబు సేతురు
ధీరమతులు కొన్ని దేశములను. 145

ఉ. రెంతు విషాణఖండములు రెండును రెండును రెండు మీఁద నొ
క్కండును గాఁగ దారుమయఖండములుం జతగూడి తొమ్మిదై
యుండఁగఁ గొన్ని దేశముల నొయ్యన గూర్తురు శార్ఙ్గచాపమున్
ఖండము లేక వంశభవ కార్ముకముం దగు సుప్రసిద్ధమై. 146

సీ. అటని కార్ముకశృంగ మాదండ గొనయమ్ము
సరవి నెక్కెడు చోట్ల సవరణములు,
సవరణంబుల దండ రవణించు గోటిమలు
గోటిమల కందముం గూర్చు కొమలు,
కొమలకు వెలిదండె కొమరారు పృష్ఠంబు
లోదండె వక్షమ్ము నాఁదనర్చు,
సన్నంపు గొను ల స్తకము సంధించు చో
సాయకం బిడుచోట శరధియంద్రు,

తే యిన్నియును వి స్తరించితి నేరికై న
యిది శిరోభాగ మిది పుచ్ఛ మివ్వి విధంబు
చిరతరాభ్యాసవశమున చి త్తమెఱుఁగు
గాని యిదమిత్థ మని పల్కఁగాదు సుమ్ము. 147

వ. శార్ఙ్గవిధానంబు వివరించెద నాకర్ణింపుము. 148

సీ. గొఱియ కొమ్ములు చీరి కుదురుగా సవరించి
పలకపాళములుగా నిలవరించి,
అగ్రభాగముల కైదాఱంగుళమ్ముల
కొలఁది తక్కువలుగా గుఱుతుఁజూచి,
అదుకు మాఱట దాని యదుకు పట్టునఁగాక
మెలకువ నటునిటు మించనదికి,
అదికిన ఖండమ్ము లవి రెండు నొకటిగా
బొత్తి మోపున సరిహత్తఁ గూర్చి,
తే. యదుకుపై నొక్కటీవల నవలమూఁట
మూఁటదారు ఖండమ్ముల మొసలి వాన
మచ్చిలోపల గెఱలూని మసృణరస వి
శేషముల రెండు నొక్కటి సేయవలయు. 149

వ ఇట్లు కోదండ శార్ఙ్గఖండంబును, వెలిదండ దారుఖండంబునుంగా
నమర్చి మఱియును 150

గీ. ఓదెగొంగనరము లురము పృష్ఠమ్మును
గ్రమ్మనటుల చటుల గతి నమర్చి
జేవురలఁది కొలదిచే నార్చి గెఱదీర్చి
యొరవు నెరపురంగు లునుపవలయు. 151

గీ. అదకనపుడు తిన్ననై శిలాకీలీల
చక్కఁదనము గులుకు శార్ఙ్గధనువు
ఎండ నెండెనేని కుండల స్ఫురణంబు
నందు వెలికి వలయితాగ్రమగుచు. 152

సీ. పదియాఱు పిడియలఁ బరగు దీర్ఘంబైన
విల్లు యుద్ధార్హమై వెలయుచుండు,
పదియేను పడియల బలు కార్ముకంబు దూ
రాపాతనంబున కలరు చుండు,

పదునాల్గు పిడియల బాణాసనము లక్ష్య
వేదికారూఢమై వెలయుచుండు,
పదుమూఁడు పిడియల పటుశరాసము చలా
చేల శరవ్యములందుఁ జెలగుచుండు

గీ. నెఱి సొబగులారు బంగారు నీరుపూఁత
మెరుగు లిరుగడఁ దమతమ మెలపుఁదెలుప
పరగ కోసలదేశాదిభావములను
వాసికెక్కువ శార్ఙ్గశరాసనములు. 153

మ. రమణీయంబయి దూరపాతి విశిఖావ్యాప్తంబై పిసాళించు శార్
ఙ్గము రెండుంగొమ లంగుళద్వితయ దీర్ఘంబుల్ సమంబుల్ సున
మ్రములుంగా దగునైన దూరమడలింపన్ మేలు వాలమ్ములన్
క్షమనివ్వింటికి నీవిశేష మెసగున్ శార్ఙ్గమ్ములన్ నాల్గిటన్ 154

గీ. ద్రోణయొకటి గూర్చుదురు వింటికనువుగా
నళికయంత్రము దానినామకంబు
నళికనేయు శరము నాళీక మందు వి
శేషవిధము లుండు జేసకొలఁది. 155

ఉ. ఈనళికన్ రచింపఁదగు నిత్తడిచే నయినంబసిండిచే
నైనను తామ్రఖండముల నైనను కంచుననైన వెండిచే
నైనను వంశనాళముననైన కొలం బదిముష్టులుండ గాఁ
జేనిది రజ్జులంబితము చేసి ధరింపఁదగున్ ధనుర్ధరుల్ 156

మ. ఖగముల్ మార్గణముల్ కదంబము పృషత్కంబుల్ క్షురప్రం బజి
హ్మగముల్ రోపము సాయకంబు శరముం బాణంబునుం గాండమా
శుగముల్ బత్రియు నంబకంబు విశిఖేషుల్ కంకపత్రంబు నాఁ
దగు ధాత్రిం బ్రదరాభిధానము లుదాత్తమ్ముల్ హితమ్ముల్ గృతిన్.

సీ. కలికాముఖమ్ము చక్రముఖమ్ము దంష్ట్రాముఖంబు వజ్రముఖంబు క్రకచ ముఖము,
గజపాదముఖమును కలశముఖం బర్ధచంద్రముఖంబును సర్పముఖము,-
కుర్కుర ముఖమును ఘూకముఖంబును సూచీముఖంబును శుకముఖంబు,
భేకీముఖంబును గాకముఖంబును మకరీముఖంబు జంబుకముఖంబు,

తే. నారసము ఫల్లమును కూర్మ నఖము శూర్ప
ముఖ మిలీముఖ మంజలి ముఖము కర్త
రీముఖ శిలీముఖ వరాటికాముఖములు
గలవు పెక్కువిశేషముల్ గల శరములు. 158

సీ. ముక్తాఫలంబు డంబున మోము చెలువమ్ము గలయమ్ము ముక్తాముఖమ్ము సుమ్ము,
కోరకా కారకంబై రకంబగు మోము గలయమ్ము కలికాముఖమ్ము సుమ్ము
ప్రోదిమై సూదిమై బొలుపారు మొన సొరు గలయమ్ము సూచీముఖమ్ము సుమ్ము,
కోరకై వడి నతిక్రూరమౌ వదనమ్ము గలయమ్ము దంష్ట్రాముఖమ్ము సుమ్ము,

తే. ఆడ యుట్టల మొగము సోయగము గులుకు
మొనగలుగు సాయకము శిలీముఖము సుమ్ము
నళిన నాళాభరంధ్రితాననవిభాసు
రమ్మగు శరమ్ము నాళీముఖమ్ము సుమ్ము 159

సీ. కలికిరాచిలుక చొక్కపు మోమువలె మోము సొబగైన వాలమ్ము శుకముఖమ్ము,
మండూకవదనమ్ము మాడ్కి మోము రహించు బెడిదంపు వాలమ్ము భేకముఖము,

వాయసాననము కై వడి భీకరంబైన
కఱుకుమోము శరమ్ము కాకముఖము,
ఘోరంపు గూబముక్కు బెణంగు గలమోము
కొమరారు విశిఖమ్ము ఘూకముఖము
తే. కూర్మనఖగోపమానమై పేర్మిగాంచు
క్రూరపు టలుంగు విశిఖమ్ము కూర్మనఖము
గవ్వవలె మవ్వములు గాంచు కలుకు ములికి
గలిగిన కదంబము వరాటికాముఖమ్ము. 160

క. సాయకములలో నలఘు
ప్రాయంబులు నాల్గు గరుల భాసిల్లు రహిం
జేయలఁతి సైనికుల పై
నేయందగు మార్గణమ్ము లివి పదిరెండున్. 161

సీ. అర్ధేందు సన్నిభంబగు మోము గలయది
తెగువ కిమ్మగు నజిహ్మగము సుమ్ము,
చేఱంపమనఁ జాలు చిత్రంపు మోముది
తెగువ కిమ్మగు నజిహ్మగము సుమ్ము,
కరినంపుటనుసుటుగ్రపుఁబాఱవాతిది
తెగువ కిమ్మగు నజహ్మగము సుమ్ము,
అంజలించిన మాడ్కి నాస్యంబు గలయది
తెగువ కిమ్మగు నజిహ్మగము సుమ్ము,
తే కత్తెర తెఱంగు వదనంబు గాంచునదియు
తెగువ కనురూపమగు నజహ్మగము సుమ్ము
గాఢతర మండలాగ్రజాగ్రన్ముఖంబు
తెగువ కనురూపమగు నజిహ్మగము సుమ్ము. 162

క ధారావదయోవలయ
స్ఫారంబగు మార్గణంబు చక్రముఖ మనిం

దేరులపై వారణముల
బారులపై తెగువ కేరుపఱచిరి ధీరుల్. 163

క. జంబుకవదనంబునకా
శంబగు వక్త్రంబు గలది జంబుకముఖ మా
స్యం బాభమకంబానన
ముంబోలిన శరము శునకముఖమగు ధాత్రిన్. 164

గీ. మకరికాముఖంబు మఱిజంబుకముఖంబు
కుక్కురాననంబు ఘోరలీల
మొసలి నక్కయేపి మొనసిన కైవడి
భండనమున రిపుల భంగ పఱుచు 165

చ. యుగములు కార్ముకంబులును యుగ్యములుం బడగల్ గొడుంగులుం
నొగలును గంకటంబులును నుగ్గులుగా ధరణీతలంబునం
దెగి పడనేయఁబూనఁగ విధించిరి ఫల్లములం ధనుర్ధరుల్
తగు కరవీరపిప్పల పలాశనికాశములౌ నలుంగులన్. 166

సీ. గజపదాననమైన గజపాదముఖమది
బలితంపు టినుపతాపల నగల్చు
చిలువవా చెలువంబు గలది సర్పముఖంబు
మకుటాదిదళనోద్యమంబు దాల్చు
చారు పిప్పిల పలాశ ముఖంబు ఫల్లంబు
దూది జోడులు విండ్లు దున్నిపాఱు
నళిన నాళోపమాననము నాళముఖంబు
కనదయఃఫలకభేదన మొనర్చు

తే. ప్రాకటంబుగ నడుమ శలాక గూర్చి
రంగుగా జేవు రలఁది నరంబు సుట్టి
గరులు నాల్గిడి కఠినంబుగా నమర్చ
నిట్టి విన్నాణములు సూపు నీశరములు. 167

చ. పలకలు మూడునాలుగును భాసిలుబెత్తెడలుం గమర్చియ
ప్పలక నుసుల్ గురిగరులు పార్శ్వములందును రెండు పింజకుం
సెలవులు రెండుగా నదికి జేవు రలంది నరంబుఁ జుట్టినం
దలమగు సాయకంబినుపతాపలలోపల గాఁడిపారెడిన్. 168

వ. వెండియు దూరాపాతి శరవిధానం బుపన్యసించెద నాకర్ణింపుము. 169

క. ఈ మహీ వరకార్ముకవి
ద్యా మహిమలు దూరపాత నార్థములనుచున్
నేమించిరి శరముల ము
క్తాముఖము శిలీముఖమ్ము కలికాముఖమున్. 170

వ. తద్విధానంబునకుం దగిన సాధనంబు లెవ్వియనినం బ్రశంసించెద నాకర్ణింపుము. 171

క. కాండేక్షుకాండ మొకటి యు
ఖండిత గిరికర్ణికారకాండ మొకటియున్
దండిగ దూరాపాతన
కాండ విధానంబునకును గరిమ వహించున్. 172

క. ఓలి గిరికర్ణికారము
మేలై యీరెంటిలోన మెచ్చుల్ గులుకున్
వాలాయంబుగ సింగపు
వాలము వలె మీఁద మీఁద వలమై యునికిన్. 173

సీ. పైపయివలముగాఁ బ్రబలి పర్వము లేక
కోమలంబగు కొండగోరు కఱ్ఱ,
అచ్చునఁ దిగిచి తోయంబులలో నుంచి
మానక నచ్చున మరలఁ దిగిచి,
యీ టార్చి మొదలు బెత్తెఁడు దక్క రెండుగాఁ
జీలిచి లోపల బూలవాపి,
యవల జేవురలంది యదికి దారముఁ జుట్టి
రెండు మూఁడు దినంబు లుండనిచ్చి,

తే. అపుడు సడలించి గరిదీర్చి హంసపాదిఁ
జేసి పుంఖంబులలుఁగులు చేసి గరులు
నేరుపున గూర్తు రిట్టిది దూరపాత
నంబుగల బాణముల విధానంబు సుమ్ము. 174

వ. మఱియు నొక్క విశేషంబు కలదు. 175

క. బెడఁగైన పులుఁగు చర్మము
గుడు సెడలిచి జేవురలఁది కురువిందపురా
వాడిసల్లి యార్చి దాతురు
కడిది శరాసనముల గఱి దీర్చుటకున్. 176

వ. ఇట్టి సంస్కారంబు హంసపాది యనందగు, మఱియును. 177

సీ. అలతులాదండాభ మగు శరంబు రచించు
విధము తన్మానంబు విస్తరింతు,
జిగిగల కట్టె దీర్చిన యోగ్యమైయుండు
చేవఁ జెక్కిన నతిశ్రేష్ఠతరము,
పుంఖ మగ్రము సన్నములు సేయగాఁ దగు
మధ్యంబు వలముగా మనుపవలయు,
మొదట పుంఖము దీర్చి ముఖము పుంఖముకన్న
సన్నంబు గావింప జను ధరిత్రి,

తే. గలుగు శరముల మానంబుకంటెఁ గొఱఁతఁ
గాంచు సార్ధాంగుళము వాని నెంచి చూడ
కొద్ది మెకముల ఖగములఁ గూలనేయఁ
దగు తులాదండ సన్నిభంబగు శరంబు 178

వ. ఇంక నాళీకంబులను శరంబుల మానంబును, తదనుబంధంబులగు
లక్షణంబులు వివరించెద నాకర్ణింపుము. 179

ఉ. తూకొను నన్ని బాణములు తూఁచినకైవడిఁ దూఁచ మానమున్
దీకొనుచుండు జేన కొలదిం బయి నంగుళ మాత్ర మేనియున్

బైకొను నంగుళద్వితయ మాత్రపు తెక్కలు నాల్గు నుర్విణా
ళీకములంచు పేరులు లలింగని దోసలఁ దూఁగు బాణముల్. 180

చ. పలకలు నాఱు నెన్మిదియు భాసిలు మించుటలుంగు మోముసం
గలిగి శలాక గూర్పఁబడి గాఢపు లోహమయంపు కట్టులం
బలిమి వహించి పుంఖమున భాసిలి తెక్కలు మూఁడుదాల్చి ని
శ్చల దృఢలక్ష్య నిర్మథనసాధనమై తగు నారసంబిలన్. 181

వ. అట్టి నారాచంబునకుం బర్యాయ నామంబులును దద్భేదంబులును, నేయందగిన కొలందులును, దద్వినియోగంబులును, దదనుబంధము లగు విశేషంబులును, సవిస్తరంబుగా వివరించెద నాకర్ణింపుము. 182

సీ. ప్రక్షేపణంబు నారాచంబు నాఁజను
నారసంబునకును నామధేయ,
మందు శుద్ధము మిశ్రమన రెండు విధములై
ధీర సమ్మతముగాఁ దివురుచుండు,
నాయసంబగు శుద్ధమంతశ్శలాకంబు
మిశ్రభావంబున మెలపుగాంచు,
సారిది నేకవిధంబు శుద్ధనారాచంబు
మిశ్రకం బష్టధా విశ్రుతమగు,
తే. నలుఁగు లష్టాంగుళంబుల కొలఁదినుండి
కొలుచుటకు నంగుళము వాసి కొఱఁత గాఁగ
లాఁతి నేకాంగుళంబు కొలంది దనుక
ప్రబలు నెనిమిది మిశ్రనారాచములకు. 183

వ. అందు ప్రథమోద్దిష్టం బగు శుద్ధనారాచంబునకు ననుబంధంబు లగు విశేషంబు లుపన్యసించెద నాకర్ణింపుము. 184

ఆ. పలక లెనిమిదాఱు ప్రాపించుక్రొవ్వాఁడి
యలుఁగు గలిగి పుంఖ మూఁది గాఁగ

గనదయోమయంబుగాఁ దగునారాచ
మొక్కవింటికోలఁది నునుపవలయు 185

వ అట్టి శుద్ధనారాచంబునకు వజ్రపు టలుం గమర్చిన వజ్రముఖంబు నాఁ బరగుఁ దత్ప్రభావం బుపన్యసించెద నాకర్ణింపుము. 186

మ. ఆహిత హేమదీప్తవలయావలితంబయి పుంఖ మాదిగా
లోహమయంబు వజ్రపు టలుంగును నై తగు నారసంబుచే
నోహరిసాహరిన్ గుధరమెయ్యన దూయఁగ నేయఁగాఁదగున్
వాహనములున్ రథంబులును వారణముల్ భరమే పగల్పగన్ 187

క. కాంచనగిరి నెంచని హరి
నొంచెను రాఘవుఁడు పూర్వ ముగ్రస్ఫూర్తిన్
గ్రౌంచము భేదించెను ని
ర్వంచనుఁడై షణ్ముఖుఁడును వజ్రముఖమునన్. 188

వ. వెండియు నిట్టి శుద్ధనారాచంబునకు నొక్కవింటికోలందిఁ గరినంబులగు నయశ్శిలాఫలకంబు లేనియు భేద్యంబులై యుండు ద్విత్రిచతుర్ధనుః ప్రమాణంబులఁ గరిసలక్ష్య భేదంబునకు సంధానంబుల నలవిగాకుండు నని పలుకుదు రిట్లు శుద్ధనారాచప్రకారంబు వివరింపంబడు దక్కటి యష్టాంగుళ సప్తాంగుళషడంగుళ పంచాంగుళ చతురంగుళ త్ర్యంగు ళాంగుళద్వితయైకాంగుళంబుల కొలందుల నలుంగులు గలుగు నెనిమిది మిశ్ర నారాచంబులం గల విశేషంబులు క్రమక్రమంబున నుపన్యసించెద నాకర్ణింపుము. 189

సీ. అంగుళాష్టకోన్నతి మగు నలుఁగుగలుగు
నారసము రెండుతెఱఁగుల గూరుపఁదగు
నలుఁగున శలాకపుంఖంబు నాన నొకటి
మధ్యమున రెండవ శలాక మలయు నొకటి. 190

వ. అందు ప్రథమోద్దిష్టప్రకారం బుపన్యసించెద నాకర్ణింపుము. 191

చ అలుఁగు శలాక పుంఖమున నంటఁగ మధ్యమ మేకఖండమై
యలుఁగును పుంఖ మగ్రమును నాదిమమై పొసగన్ ద్రిఖండమై
యలుఁగున పింజె నందదుకులై చెలువొంది పసిండి కట్టునం
దలమగు నారసంబు ద్విరదం బరదంబు నగల్చు నుగ్రతన్. 192

క. అలుఁ గష్టాంగుళమానము
గలనారాచంబునకును గరులిడ నదియున్
బలువిడి శార్ఙ్గము కొలఁదిన్
జులుకన కఠినంపు గుఱిని జొరనేయుటకున్. 193

వ వెండియు నొక్కవిశేషంబు గలదు. 194

ఉ. ప్రోడతనంబునం గనకపుంఖము దాఁక శలాక నేకమై
కూడ నమర్చుచున్ గరులు గూర్చక తీర్చిన నారసంబునన్
పీడని పన్నిదంబునను విశ్రుతి మీఱ నిషంగిరంగమం
దీడుగ మూఁడువిండ్ల కొలఁదిన్ నినుపన్ దగు లక్ష్యవేదికన్ 195

వ. మఱియు నీయష్టాంగుళనారాచంబు సార్ధశార్ఙ్గత్రయంబు కొలదిని సార్ధశార్ఙ్గపంచకంబున కొలందినిం గరినలక్ష్యంబున సబాటంబుగా నడిపిన ధనుర్ధరుండు ధనురాగమసాంప్రదాయజ్ఞుండని నిర్దేశింపంబడు, నిట్లు ప్రథమోద్దిష్టంబగు నీయష్టాంగుళాయోముఖనారాచంబునంగల విశేషం బుపన్యసించితి, ద్వితీయోద్దిష్టంబగు నయ్యష్టాంగుళాయోముఖనారాచంబునంగలవిశేషంబు లుపన్యసించెద నాకర్ణింపుము. 196

చ. అలుఁగుశలాకకున్ నడుము నానఁగ మూఁటుశలాకఁ గూర్చుచో
నలుఁగును మూఁడుఖండములు నాదటఁ బుంఖముగా నమర్చినన్
నలువుగ నైదుఖండములు నొల్లదుకుల్ గనుపట్టుచుండు ని
మ్ముల నలుఁగంగుళాష్టకసమూర్జితమై తగు నారసంబునన్. 197

వ. వెండియు నిన్నారాచం బేకశార్ఙ్గంబు కొలందిం గరినలక్ష్యభేద నంబగు నదియునుంగాక. 198

గీ. అనిశ మష్టాంగుళోత్సేధ మలుఁగు గలుగు
వెడఁదనారాచ మది లక్ష్యవేధి యందు,
సార్ధ శారంగత్రయాయతి సార్ధశార్ఙ్గ
పంచకాయతి నేయుట పౌరుషంబు 199

వ. మఱియును. 200

గీ. ఆయసంబు నిశిత మష్టాంగుళాయతా
ననము గలుగునట్టి నారసంబు
లయిదు విండ్లకోలఁది నవల లక్ష్యంబున
గాఁడిపాఱ నేయఁగా భరంబు. 201

వ. మఱియు నొక్కవిశేషంబు గలదు, పూర్వోక్త ప్రకారద్వయలక్షి
తంబు లగు నిట్టి మిశ్రనారాచంబుల కుభయపక్షంబులు నుప
వలయు నంగుళాష్టకపరిమాణంబున నలుంగు లునుపుటయు, లక్ష్య
భేదనంబునం గోలందియు నొక్కటియగుట నేకవిధంబుగా వక్కాణిం
పంబడియె, నిదియును శుద్ధనారాచంబు కరణి నత్యంతకఠినలక్ష్యం
బేనియు శార్ఙ్గంబు కోలంది నడపిన నిరర్గళంబై భేదింపం జాలి
యుండు, వెండియు బహుప్రయోగకుశలుం డగు ధనుర్ధరునిచేతం
గాని సార్ధశార్ఙ్గత్రయ సార్ధశార్ఙ్గపంచకదూరస్థం బగు లక్ష్యం
బున నిర్వక్రంబుగా నడవకుండు ని ట్లష్టాంగుళనారాచ ప్రకారంబు
నిర్ణీతంబగు, నింక సప్తాంగుళంబును, షడంగుళంబును, పంచాంగుళం
బును, గోలందులుగా నలుంగు లమర్చిన నారాచత్రితయంబునుం
గల విశేషంబు లుపన్యసించెద నాకర్ణింపుము 202

చ. ప్రదరరసాచలాంగుళ పరస్పరదీర్ఘములౌ నలుంగులన్
బదపడి మూఁడుచందముల భాసిలుచుండెడు నారసంబులం
దదుకులు నాలుగుం దునుకలై దును మధ్యగమై శలాకయున్
గుదురుగ మూఁడుపక్షములు గూర్తురు కొద్దులు గొప్ప లేనియున్

వ. మఱియు నిన్నారాచంబులందు. 204

గీ. అరయ సప్తాంగుళోత్సేధ మలుఁగు గలది
యనువుగ షడంగుళోత్సేధ మలుఁగుగలది
యవలఁ బంచాంగుళోత్సేధ మలుఁగుగలది
నికట దూరలక్ష్యంబుల నిసుపవచ్చు. 205

వ. వెండియు నొక్కవిశేషంబుగలదు. 206

గీ. దూరమున నుండి లక్ష్యంబు దూయనేయు
నాణెమగు గొప్పటెక్కల నారసంబు
కదిసి లక్ష్యంబు కరకరి గాఁడనేయ
నలువ మగుఁ గొద్ది టెక్కలనారసంబు. 207

వ. ఇట్టి నారాచత్రితయంబునకుం గరినలక్ష్యభేదం బునం గొలంది యెట్టి దనిన 208

గీ. వినుము పదునొకండు విండ్లకొలందికి
నడుపరాదు మిగుల నారసంబు
మిగుల నడుపునేని మిక్కిలి నాటదు
నాటదేని జారు నైపుణంబు 209

వ మఱియు షడంగుళనారాచంబు సూచీసదృశంబుగా నలుం గమర్చిన సూచీముఖంబునాఁ బరగుఁ, దత్ప్రకారంబును, దద్వినియోగంబును నిరూపించెద నాకర్ణింపుము 210

చ. అడుగులు నాలుగుం దునుక లైదును మధ్యమునన్ శలాకయున్
గదియఁగ సూచికాకృతి ముఖంబు షడంగుళదీర్ఘమై తగున్
బదపడి మూఁడుటెక్కలును భాసిలుచుండెడు నారసంబునం
గదనమునందు శత్రువుల గాత్రముఁ గూర్తుసు సూచికాకృతిన్. 211

వ ఇట్లు సప్తాంగుళ షడంగుళపంచాంగుళంబుల కొలంది నలుంగులుగల నారాచత్రితయంబులంగల విశేషంబులు వక్కాణింపంబడె, నింక చతురంగుళ త్ర్యంగుళాంగుళ ద్వితయైకాంగుళంబుల కొలంది నలుంగులు గల నారాచచతుష్టయంబునంగల విశేషంబు లాకర్ణింపుము 212

ఉ. ఆగమవహ్ని దృక్ఛశధరాంగుళదీర్ఘములై నలుంగుల౯
బాగయి మూఁడుపక్షముల భాసిలు నాల్గును నారసంబు లౌ
లాగున లోనమాఱట శలాకికఁ గూర్పమి నాల్గు ఖండముల్
లోగడలందు మూఁడదు౯లుండగి దూరము దూఁగునాజిలో౯. 213

వ. వెండియు నిన్నారాచాష్టకంబునం దష్టాంగుళ సప్తాంగుళ షడంగుళ పంచాంగుళంబుల కొలందినలుంగులు గల నాలుగు నారాచంబు లతిక్రూరంబులు, తక్కంగల చతురంగుళ త్ర్యంగుళాంగుళ ద్వితయైకాంగుళంబులకొలంది నలుంగులుగల నాల్గునారాచంబులు లఘుప్రాయంబులును, దూరగంబులునై విభజింపంబడు, నిందు యుద్ధంబుల నియ్యెనిమిది నారాచంబులకు వినియోగంబు లుపన్యసించెద నాకర్ణింపుము. 214

సీ. అష్టాంగుళం బలుం గమరు నారాచంబు
భార మంభారీల బారిసమరు,
నలుఁగు సప్తాంగుళం బమరు నారాచంబు
వడి నయోమయరథావళి నగల్చు,
నాఱంగుళములయు ల్గమరు నారాచంబు
స్ఫుటతరోరశ్ఛదంబులఁ బగల్చు
నలుఁగు పంచాంగుళం బమరు నారాచంబు
హయఫాలఫలకంబు లాడిపారు,
న ట్లొకటి రెండు మూఁడు నాల్గంగుళముల
కొలఁదియలుఁగుల నారాచములను నాల్గు
భటతనూఛేదకంబులై పరగు నిట్లు
వెలయు నెనిమిది నారాచముల తెఱంగు. 215

మ. ముంగల నారసంబులకు ముష్టులు తొమ్మిది దూరపాతికే
కాంగుళ మంగుళ ద్వితయమైన కొదం బది ముష్టులుండుఁ ద
క్కంగల సాయకావళులకుం బదిముష్టుల మానముండు నీ
యింగిత మాకలింపఁదగు నెక్కవతక్కవ నిక్కవంబునన్. 216

వ. వెండియు నిట్టి సకలవిధంబులగు శరంబులకుం బ్రమాణంబులు నిరూపింప నుపాయంబుగల వాకర్ణింపుము. 217

మ. జ్యాలతమానముఁ మఱియు శార్జ్గపు మానము రెండు నొండుగాఁ
దెలిచి మూఁడుభాగములఁ దీర్చుచు నందుల నొక్కభాగముఁ
బోలి శరప్రమాణమగునం చలభార్గవరాముతోడ గా
రీలలనావిభుండు వివరించె జగద్ధితకార్యధుర్యుఁడై. 218

వ. అట్లగుటం జేసి మౌర్వీశరాసనమానంబు లొక్కటిగాఁ గలయం గూడి యాది మూఁడుభాగములుగా విభజించి యందొక్కభాగంబు కొలంది శరంబుల మానంబు నిరూపందగు ననిన విని పాకశాసనతనయుం డాచార్యున కిట్లనియె. 219

క. నాలుగు కొలఁదుల శరములు
నాలుగు కొలఁదుల శరాసనంబులు గా మఱి
బోలించితి వేధనువున
నేలాగునఁ గూర్పవచ్చు నిషువుల కొలఁదుల్. 220

వ. అనిన నాచార్యుం డిట్లనియె. 221

సీ. పదియాఱుముష్టుల బాణాసనమునందు
తెగువ బాణంబులు దివియవలయు,
పదియేను ముష్టుల బాణాసనమునందు
దూరపాతిశరంబుఁ దొడగవలయు,
పదునాల్గుముష్టుల బాణాసనమునందు
నారాచనికరంబు నడుపవలయు,
పదుమూఁడు ముష్టుల బాణాసనమ్మునం
దిలఁ దులాదండేషు వేయవలయు,

గీ నే కొలఁది బాణ మేవింట నేయవలయు
నా కొలఁది బాణ మావింట నాకలించి
కొలఁది వివరించినట్లుగాఁ గూర్తు రేని
తొడిగిన శరంబు చక్కఁగా నడుచుచుండు. 222

వ. వెండియు బాణాసనంబు కొలందికి ముష్టిమాత్రంబు కొలంది కొఱఁతగా మౌర్విం గొలందిఁ గూర్పవలయుఁ, దత్ప్రకారంబు మౌర్వీప్రకరణంబున వివరింపంబడు నట్లగుట పదునాల్గుముష్టుల శరాసనంబులును పదుమూఁడుముష్టుల మౌర్వియున్ను, నీరెండు కొలందులు కలయంగూడిన నిరువదియేడు ముష్టులగు నందు మూఁడవపాలు తొమ్మిది ముష్టులగుటం జేసి నారాచంబుల కొలంది తొమ్మిదిముష్టు లనం బరగు, నివ్విధంబున తక్కు‌నుం గల బాణంబులకుం దగిన బాణాసన జ్యాయుగళంబుల మానంబులు కలియంగూడి పూర్వోక్త ప్రకారంబున కొలంది గూర్పవలయు, నట్లు కొలందు లేర్పరచిన నర్ధాంగుళమాత్రం బేనియు నంగుళమాత్రం బేనియు నెచ్చుతగ్గులుండిన నక్కొ‌దువయలుంగుల తారతమ్యంబునం బ్రాపించునని నిర్ణయింపందగు, నిట్లు సాయకంబులకుం గొలందు లేర్పఱించందగు మఱియును. 223

క. తులకుం దూఁగిన విశిఖము
తలఁచిన లక్ష్యంబు నడుమ దవులుఁదిరంబై
తులకుం దూఁగని విశిఖము
తలఁచిన లక్ష్యంబు నడుమఁ దవులదు చలమై. 224

వ. అట్టి శరతులనాకలనంబు వివరించెద నాకర్ణింపుము. 225

క. వాలాయమ్ముగ శరములు
పోలింపగ రెండు పాళ్ళు పుంఖము వైపుర్
బా లలుఁగు వైపు దూఁచిన
హాలిం దుల దూఁగవలయు నటునిటు సమమై 226

వ మఱియును. 227

క. అలుఁ గుండెడు భాగమ్మున
బల మునిచిన సాయకంబు పరగుం దిరమై
అలుఁ గుండెడు భాగమ్మున
బల మునుపమి సాయకంబు పరగదు జడమై. 228

గీ. అగుట వలుఁగు గలుగు నగ్రభాగమ్మున
పాలు పింజవైపు పాళ్ళు రెండు
గాఁగఁ గొలిచి తూఁచఁగాఁదగు బాణముల్
గురువు లఘువుఁ జూచి కూర్చ్చ నపుడు 229

సీ. కాండేక్షు విష్వాసికయు వాయసేక్షువు
కాకేక్షు వనగను గనప తెల్లు,
కాండ ప్రకాండముల్ గలుగు నాతెల్లున
నానత పర్వంబు లాయతములు,
కాండేక్షుకాండ ప్రకాండ ఖండంబులు
ప్రధనసాధనములై పరిఢవిల్లు,
నట్టి ఖండములు సోయగముగా నచ్చున
వడివంక దీర్పఁగా వలయు నంద్రు,
తే. ధృతి పసిఁడి తీవ లచ్చునఁ దిగిచినట్లు
తిన్నఁగా మూఁడు మారులు దిగిచి చూచు
నపుడు నొగులకే కఠినంబు లగుచు నిలుచు
ఖండములు గూర్పఁగాఁదగు ఖగములందు. 230

వ. అని మఱియు నిట్లనియె. 231

క. అచ్చున దివియందగు శర
మచ్చున దివిచిన నవాటమై గుఱికుఱుకున్
గ్రచ్చర నచ్చున దివియుట
విచ్చలవిడి నీకు నిపుడు వినిపింతుఁ గృపన్. 232

చ. అమరగ నైదు వ్రేళ్ళ చతురశ్ర మయఃఫలకంబు నాల్గురం
ధ్రములదిగాగ దారు వివరంబునఁ దార్చి యనిం దదీయరో
కముల శరంబు సేయఁదగుఁగజ్జగమిన్ మెలిదీరఁ దీసినన్
గ్రమమున నంబకంబులు నరాళములై కనుపట్టు ధారుణీశా. 233

వ. ఇట్లుచ్చునం దివిచిన కాండేశుఖండంబుల నారాచంబులుం దక్కటి బాణంబులుం గావింప వలయు, నట్లు దీర్చిన బాణంబుల నడుకులును ఖండంబులును విభజించెద నాకర్ణింపుము 234

సీ. మొగి శుద్ధనారాచమును తులాదండాభ
మును నఖండాకృతిఁ దనరుచుండు,
నడుమ మూఁడు శలాక యిడని నారసముల
కాద్యంతములను రెం డతుకు లుండు,
నడుమ మూఁడు శలాక యిడిన వానికి నెల్ల
నైదుఖండములు నా ల్గదుకులుండు
తేఱఁగార దూరపాతి శిలీముఖములకు
నాద్యంతములను రెం డదుకులుండు

గీ. తక్కునుంగల విశిఖ వితానమునకు
ఖండములు నాలు గదుకులు గలుగు మూఁడు
వజ్రముఖ మగు నారాచవరమునందు
ఖండములు రెండు నదుకు నొక్కటియు గలుగు. 235

వ. మఱియు నలుంగుల తెఱంగు వివరించెద నాకర్ణింపుము. 236

గీ. అతి సునిశితాగ్రభాగమై యొఱు పలక
లష్టఫలకంబు లేనియు నధిగమించి
కట్టలోనుండి మొలచిన కరణి నలుఁగు
రహిఁ గులుకుచుండవలయు నారాచములకు. 237

వ. వెండియుఁ దక్కునుంగల బాణంబుల యలుంగుల ప్రకారంబు తత్త్రత్ప్రకరణంబుల వక్కాణించితి నింక నీ యలుంగులకుం బద నిడందగిన శుద్ధద్రవ్యకూటంబు గలదు, వివరించెద నాకర్ణింపుము 238

సీ. పటిగ ముప్పదియాఱు భాగంబు లందుల
సాఁబాలుగా నవాసాగరంబు,
సైంధవలవణంబు జత గుల్లనున్నంబు
పది పది బాణముల్ పొదివి నూఱి,

జలముల తెప్పఁగాఁ గలపి తజ్జలములఁ
గాండంపు టలుఁగులు గ్రాఁచి ముంచి,
వెడలఁగఁ దివియుచో విశిఖంపుటలుఁగుల
నెఱి మూఁడు వర్ణముల్ నిలుపవలయు,

గీ. అరసి తెలిచాయ కొన్నిటి యలుఁగులందు
నసిత వర్ణంబు కొన్నిటి యలుఁగులందు
నిటు లుభయమిశ్రమగు పాల యీఁకవర్ణ
మనఁ బదంబుగాఁ గొన్నిటి యలుగుఁలందు. 239

వ. వెండియు నిట్లు పద నునిచి వేర్వేఱ ధవళవర్ణంబులును, కృష్ణవర్ణంబులును, తదుభయ మిశ్రవర్ణంబులునుంగా విశిఖంపుటలుంగు లేర్పఱచుటకు ఫలం బాకర్ణింపుము. 240

చ. అలుఁగవదాతమైనఁ బద నందెడు బాణము ప్రాణభేదకం
బలుఁగు వినీలమైనఁ బద నందెడు కాండము దారుభేదకం
బలుఁగుల పాలయీఁక విధమౌ పద నందెడు సాయకం బయః
ఫలక విభేదనంబనుచుఁ బల్కుదు రాదిమచాపశిక్షకుల్. 241

వ. ఇంక పక్షప్రకారం బుపన్యసించెద నాకర్ణింపుము. 242

క. పత్రమ్మును వాజమ్ము ప
తత్రమ్ము గరుత్తనంగఁ బక్షాహ్వయముల్
ధాత్రిం గనఁదగు శుభచా
రిత్రా గరి తక్క యనఁగఁ బృథివిం దెనుఁగుల్. 243

గీ. పృథివి నారాచములలోన రెండిటికిని
విను తులాదండ నిభశరంబునకుఁ దక్క
బాణముల కెల్ల గరు లేదు పర తు రవియుఁ
గంకగృధ్ర మయూర పక్షములు సుమ్ము 244

వ. మఱియు నొక్క విశేషంబు గల దాకర్ణింపుము 245

క. గరిగల బాణము కరణిన్
గరిలేనిది నిశ్చలంబుగాఁ జన దగుటన్
గరు లంబకంబులకు నే
ర్పరతురు విజ్ఞాన ఘనులు ప్రాక్తనులు మునుల్. 246

వ. శరంబుల గరు లునుపందగిన విన్నాణంబులు పన్యసించెద నా
కర్ణింపుము. 147

గీ. రెండుగాఁ బక్షములఁ దీర్చి రేఖవారు
పింజపై కట్టయును జివ్వి పెనుపు మీఱ
గరు లదికి కత్తిరింతురు కౌశలమున
నాశుగంబుల తారతమ్యంబు లరసి. 248

ఉ. ఆచితపుంఖభాగమున కంగుళమాత్ర మెడంబు గాఁగ నా
రాచములందు పక్షముల రాజిల దీర్చుట సాణెమంత్రము నా
రాచము దక్క తక్కిన శరంబులనన్నిట పుంఖ మానగా
సూచిత వైఖరిం గరులు చొప్పడఁ దీర్పఁదగున్ యథావిధిన్. 249

గీ. అధరముల రెండు సెలవులయందు రెండు
పక్షముల నాలు గిడఁ దగు బాణములకు
నధరముల రెండు సెలవిపై నమర నొకటి
గరులు మూఁడిడఁగాఁదగుఁ గాండములకు 250

వ. వెండియుఁ జక్రముఖార్ధచంద్రప్రముఖంబులగు నీరంచుటలుంగుల
బాణంబులకుం గరు లునుప నుపాయంబు గలదు. 251

శా. పర్వగ్రంధి కదంబకంబు నడుమన్ భాసిల్లుఁ దద్గ్రంథికిన్
బూర్వల్ నాభికయంచుఁ బేరిడిరి మెప్పల్ గూర్చు తన్నాభికిన్
నిర్వక్రంబుటలుంగు టీ రనుసుటీనెల్ నూలునం బట్టినం
బర్వంగాఁదగునయ్య పుంఖ ముఖపుం బై తెక్కకుం జక్కనై 252

క ఈరీతి పుంఖముఖమున
పై రాజిలు తెక్కగల్గు పై యనుసునకున్

దీఱిక నాభికి సరిగా
గూడుచు పఱఁదస్త్రశాస్త్రకుశలుం డనఘా. 253

క. ఇల నారాచంబులకును
విలసితగతి దూరపాతివిశిఖంబులకున్
గొలఁదిని దరతమములుగా
కలితనమున మూఁడు మూఁడు గరు లిడవలయున్. 254

క. దూరా పాతంబులకును
నారాచంబులకుఁ దక్క నాలుగు టెక్కల్
ధారుణి నిఖిలాంబకముల
కారూఢిన్ గూర్చవలయు నార్యానుమతిన్. 255

క. పక్షములు కలుగు బాణము
పక్షిగతి న్నభమునందుఁ బ్రాఁకు నచలమై
పక్షములు లేని బాణము
పక్షంబులు లేనిఖగము పగదిన్ బొదలున్ 256

వ. పుంఖోప సంఖ్యానంబు. 257

మ. నినుపం జూతురు పుంఖముల్ శరములన్ నీలంబు గోమేధికం
బును గారుత్మతమున్ బ్రవాళమును గెంపున్ వజ్రమున్ మౌక్తికం
బును వైదూర్యము పుష్యరాగశకలంబున్ లోనుగా వన్నెకె
క్కిన రత్నంబుల దారు శృంగముల మాడ్కిన్ వాజవక్త్రాకృతిన్.

క. కనకము వెండియు రాగియు
నినుమును దగరంబు సీస మిత్తడి కాంస్యం
బును సత్తు లోనుగా వసు
ధను గలలోహములఁ జేయఁదగు పుంఖంబుల్ 259

గీ. మల్లెమొగ్గ కరణి మఱి వాజివక్త్రంబు
కరణి సోయగంబు గల్గునట్లు
అలుఁగుకన్న సన్నమై తేజరిల్లఁగాఁ
దీర్చి పుంఖ మెలమిఁ గూర్చవలయు. 260

క. నారాచములకుఁ బుంఖము
లారయ మణిలోహమయము లతిభాసురముల్
దూరాపాతములకు సుకు
మారంబులు దారుశృంగమయపుంఖంబుల్. 261

గీ. శార్ఙ్గ వేయూనేల బాణంబు బలిమికిఁ
గొలఁదిఁజూచి పింజ గూర్చవలయు
కఠినములకు పింజ కఠినంబు గాఁదగు
లఘుశరముల పింజ లఘుతరంబు. 262

గీ. అలుఁగు గలుగు భాగ మగ్రభాగము దాని
కన్న సన్నమైన నదరు పుంఖ
మగ్రమునకు పుంఖ మధికమై యుండిన
గాఁడిపాఱ దంబకంబు గుఱిని 263

వ. వెండియు నొక్కవిశేషంబు గల దాకర్ణింపుము. 264

గీ. ఆర్ద్రమహిషచర్మంబుచే నైనఁ జేప
పొట్టచే నైన జేవుఱ వుట్ట నవని
చాపములు సాయకంబులు సంఘటించి
సరవి నదుకుట కివి సుమ్ము సాధనమ్ము. 265

గీ, అనుచు నర్జునునకు నస్త్రగురుండు భా
వించి పలుకులీల విస్తరింప
నద్భుతముగ రోమహర్షణిఁ బ్రార్థించి
రవలి తెఱఁగు శౌనకాదు లెలమి. 266

మ. కరుణాసాగర సాగరాన్వయజనుః కల్యాణ కల్యాణ సుం
దరసద్ధామక ధామకక్రమకలనా ధారాళ ధారాలస
చ్చరలీలాభర లాభరంజిత సుధీసంతాన సంతానవ
త్సురశోభావన భావనాతిగ మహా స్సూర్యాద సూర్యాదరా. 267

మాలిని. త్రిజగదవనదక్షా ధీరకోదండదీక్షా
విజయవిహితధాటీ విద్ధదోషాటకోటీ
సజలజలదవర్ణా సంతతానందపూర్ణా
సుజనభరణశాలీ సూర్యవంశాబ్జహేళీ! 268

గద్య. ఇది శ్రీమత్కౌసల్యానందన కటాక్షవీక్షణ పరంపరాసాదిత కవితావిచిత్ర, సుకవిజనానుగ్రహపాత్ర, మైత్రేయసగోత్ర, నృసింహాగురుపుత్ర, కృష్ణమాచార్యప్రణీతంబైన ధనుర్విద్యావిలాసం బను లక్షణగ్రంథంబునందుఁ గ్రమంబున నిష్టదేవతాధ్యానంబును, సుకవిభూషణంబును, కుకవి నిరాకరణంబును, కృతికథా కల్పక వంశావతార వర్ణనంబును, స్వప్నవృత్తాంతోపన్యాసంబును, కృతిపతి గుణకీర్తనంబును, కథావతరణంబును, ద్రోణార్జున సమాగమంబును, ద్రోణుండర్జునునకు ధనుర్విద్యారహస్యంబు లుపదేశింప దొరకొనుటయు, విద్యాప్రభావసూచనంబును, గురుసంకీర్తనంబును, శిష్యవరణంబును, సఖండాఖండ కోదండద్వయనామోద్దేశంబును, ధనుర్నిర్మాణపరిమాణ ప్రముఖ విశేషవిభాగంబును, మార్గణ పరిగణనాప్రీణనంబును శరవిధాన మాన ప్రశంసనంబును పుంఖోప సంఖ్యానంబును, పక్షపరిమాణాది విశేష విభజనంబునుఁ లోనుగా నేకోన వింశతిలక్షణంబులం దనరు ప్రథమాశ్వాసము సంపూర్ణము.

---

శ్రీ.

# ధనుర్విద్యావిలాసము

## ద్వితీయాశ్వాసము.

---

క, శ్రీరఘుకులాబ్ధిసోమా
సూరిస్తుతదివ్యనామ శూరలలామా
మారీచమదవిరామా
నీరధరశ్యామ యీవనీరఘురామా. 1

వ. అవధరింపుము, అట్లు సావధానమనస్కు లగు శౌనకాదులకుం బ్రమోదంబున రోమహర్షణి చెప్పినట్లు వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు తొమ్మిది లక్షణంబులు సవిస్తరంబుగా విని తక్కంగల లక్షణంబులు వినుటకుం గుతూహలంబునం బొదలు పార్థునకుం గుంభసంభవుం డిట్లనియె. 2

క. ఆయోధన సమయంబునం
జాయక ధనురాశుగముల బలువిడి నూనం
దోయము లగు సాధనముల
నాయతగతి విస్తరింతు నాలింపు మింకన్ 3

ఉ సాదికినిం బదాతికిని సంగరవేళల నొందు కార్ముకం
బూదగ దంతి దంతముల నొక్కటి లేడియదుంగు వాడ్పునన్
మేదురమైన చర్మమున మీనములీల పొడల్ దలిర్పగా
బోదనమీఱ నొక్కటియ ప్రోది ఘటింపుదు రద్భుతంబుగన్. 4

గీ. అట్టిసాధన యుగళంబునందు ధరణి
హరిణచరణాభ మేకచాపాశ్రయంబు

మీనముల మానములఁ గాంచి మెలపు గొలుపు
నది పదంపడి ద్విత్రి చాపాశ్రయంబు. 5

వ. మఱియును. 6

క. కంబళములనైనను జి
త్రాంబరముల నైన ధర శరాసన రక్షా
ర్థంబుగ విరచింతురు సద
నంబుల డాఁచుటకు గవుసెనల నలువముగన్. 7

వ. పెండియు శరగోపనార్థంబులగు తూణీరంబుల భేదంబులును, మానం
బులును తద్విధానంబులునుం బ్రశంసించెద నాకర్ణింపుము. 8

క. క్షోణి నుపాసంగంబును
తూణంబు నిషంగ మిషుధి తూణీరంబున్
తూణియు నను నామము లగుఁ
దూణీరంబునకుఁ బొదియు దొన యనఁ దెనుఁగున్. 9

వ. పెండియు 10

మ. తనరుం దూణము లాఱుచందముల నందంబందు నందుం గవా
జిన బంధంబులు నాల్గు నాళఫలక స్నిగ్ధంబులై రెండు క్ర
న్నన నీయాఱిటిలో గవాజినజముల్ నారాచభిన్నేషుల
న్మనుచుం నాళమయంబు దారుభవమున్ నారాచ రక్షార్థముల్.

గీ అగ్రవాజన తూణంబులందు నాల్గు
శిఖరములు గల్గుదొన చతుశ్శిఖరమండ్రు
కణఁక నేకైకశిఖరంబు గలుగు నవియు
నేకశిఖరాభిధానంబు లీద్ధరిత్రి. 12

గీ. ఏకశిఖర మొకటి యాచతుశ్శిఖరంబు
నంగుళములు ముప్పదాఱు కొలఁది
అవల దొనల నొకటి యష్టాంగుళోత్సేధ
మొకటి ద్వాదశాంగుళోచ్ఛ్రయంబు. 13

ఉ. సద్రసవద్గవాజిన నిషంగచతుష్టయ మాజితేజిపై
భద్ర గజంబుపై రథముపై ధరపైఁ గొనవచ్చు నాళికా
ముద్రితతూణముల్ ఫలకముద్రితతూణము యుద్ధరంగరం
గద్రథసామజాశ్వములు గ్రాహ్యు పదాతికి సాది కశ్వముల్. 14

సీ. షట్త్రింశదంగుళోచ్ఛ్రయముపై విప్పుగా
విలసద్గవాజినా వృతి నమర్చి,
అరవిప్పు సిరిగప్పు నరవిందముల చంద
మాకలింపుచు నాల్గురేక లునిచి,
అతిమనోహరముగా నాశ్చర్యకరముగా
బంగారు జలపూఁత పాదుకొలిపి,
భర్మనిర్మిత చర్మ పట్టికా వలయంబు
తతమధ్య మేఖలాకృతి నమర్చి,

తే. చెలు వమరఁ దీర్చునది చతుశ్శిఖరతూణ
మేకశిఖరంబులవిధాన మీదృశంబు
గాని శిఖరమానంబులఁ గలదు భేద
మమర నిన్నాల్గు కరికరాభములు సుమ్ము. 15

క. మూఁతలతోఁ బదిముష్టులు
బ్రాఁతిందగు నాళఫలక భవతూణంబుల్
మూఁతలగు రెండు ముష్టులు
మూఁతలుగా కెనిమిదేపి ముష్టులగు పొదుల్. 16

చ. ఎలమికొలందికై యిడిన యెన్మిదిముష్టులమధ్యనాళముల్
వలగొని చుట్టునుం దిదుగువాఱఁగ మొగ్గల బంతికై వడిన్
జెలువుగ వంశనాళముల జేవులు లందుచుఁ గూర్చి తీర్చి యి
మ్ములఁ గదియింతు రా భరణిమూఁతవిధంబున మూఁత దానిపై॥ 17

క. ఒకనారాచమునకు వే
ఱొకనారాచంబు సోకకుండఁగ నినుపన్

సుకరంబై నాళీకౌఘ
ప్రకట నిషంగంబు దనరు భవ్యంబగుచున్॥ 18

ఉ. రంజితలీల మేడమొగరంబు తెఱంగు తుఱంగలించు రే
ఖంజిగి గుల్కు దారు ఫలకంబులు శ్రేవు అలంది కూర్చి పై
సంజలి కప్పు విప్పుల క్రియ న్నొగపుందెర పొప్పు మీఱు మూఁ
తంజెలు వాఱఁదీర్చునది దారుమయంబగు తూణ మిద్ధరన్. 19

వ, ఈ యాఱు తూణంబులం గవాజిన తూణంబులు చతుర్విధయుద్ధార్హం
బులగునందు హయారోహణంబులం ద్విశ్రమంబులు పదక్రమంబులం
దూణంబులు గట్టాయితంబులుగా ధరియించుటకుం దగిన సాధనంబై
మేఖలాబంధంబుగలదు. అట్టి మేఖలాబంధంబునకు లక్షణంబును,
తద్ధారణంబును బ్రశంసించెద నాకర్ణింపుము. 20

ఉ. కొండి ధ్రువంబుగా మొదటఁ గూర్చిన బొత్తెడు చర్మపట్టికా
ఖండము మధ్య రంధ్రితసుకాంచన పద్మచతుష్క ముగ్రమం
దుండగ నంగుళద్వితయ మోలి వెడల్పు ఘటిల్ల నొప్పు నా
ఖండము జోడుగాఁ గురుచఖండ మిడం దగు మూఁడు జేనలన్॥ 21

గీ. అట్లు సార్ధాంగుళము వెడ ల్పమరుచున్న
మూఁడు జేనలఖండంబు జోడుచేసి
తీర్చి తూణాసనము క్రిందఁ దిరిగిరా స
మర్తు రది మేఖలాలలామంబు ధరణి. 22

వ. మఱియును. 23

క శిరమున సింహాలలాట
స్ఫురణం బిడి జేనకొలఁది సురియవిధమునం
గరిదంతంబున ఖండము
మురువుగ రచియింతు రవల మొన వక్రముగాన్॥ 24

గీ. దాని సింహాలలాటంబు దరియ మూఁడు
వ్రేళ్ళకొలఁదిని నిడుపుగా వీడఁదొలఁచి

వివరమున పట్టికలు గూర్చి వెడలఁది గిచి
దక్షిణశ్రోణి దోన వ్రేలఁ దాల్చ వలయు. 25

వ. వినుమట్లు ఛురికాకారంబునం దీర్చిన దంతశలాక శీర్షంబునం దనరెడు వివరంబునం గురుచపట్టికాఖండంబు మొన మరలం దిగిచి, కూర్చిన తూణీరంబు శ్రోణిస్థలంబున నిట్టట్టుం జలింపక దృఢసంహాతంబగున ట్లవలగ్నంబున లగ్నంబగు కనకఘట్టికాపట్టిక నట్టిదంతశలాకికం గీలించి దీర్ఘబగుచుం బసిండి జలపూఁతలం దళతళమను నెత్తళుకులు కులుకు వాటింపం దనరారు చర్మపట్టికాలలామంబు మధ్యంబునం దిరుగువారం ద్రిప్పి, యగ్రంబునం గల కమలచతుష్టయంబు నందొక్క కమలగర్భరంధ్ర గర్భరంధ్రంబున నయోమయంబగు కొండిం దవులించిన, దక్షిణ శ్రోణితలంబునఁ దూణీరంబును వలపి ఉంద దంతశలాకయుం దనరు నిద్ధారణం బాశ్వికుల కనుగుణంబగుఁ బాదచారులకుం దగిన కొలంది ధరియింపందగు నింక మార్వీలక్షణ విధానంబు లేర్పరించెద నాకర్ణింపుము. 26

క. మార్వీజ్యాగుణశింజిను
లుర్విన్ నామములు నారి కొనరించుటకున్
మూర్వాత్వర్సూత్రంబు ల
ఖర్వంబగు పట్టుధమనికలు సాధనముల్. 27

వ. అట్టి గుణంబునకు యథాను గుణంబుగా విధానంబుగల దాకర్ణింపుము.

సీ. నరములచేఁ జాగ నారచే నైనను
గళుకుగా సూత్ర మొక్కటి ఘటించి,
వలముగాఁ జుట్టు దావలముగాఁబట్టుకే
వలముగాఁ దిరిగి రావలను పఱచి,
మెలిదీఱ సారించ మేలు వక్కాణించ
నలఁతి సంజ్ఞాసూత్ర మాకలించి,
వలకన్నువలెఁ జెన్ను గలకన్ను లలరార
నట్టిట్టుగా సూత్ర మలవరించి,

నవరణమ్ములఁ గూర్చగాఁ దివురు రెండు
గొనయముల రెండు కొలఁదులకొనల నాగ
బంధ మొనరించి మధ్యంబు పట్టుత్రాటఁ
గట్టఁదగు నంగుళీచతుష్కంబు కొలఁది. 29

క. ధనురాగమోదితంబులు
ధనువుల నవరణములందుఁ దార్చ హితంబుల్
గొనయము లనఁగా నవియును
ఘనతరధమనీలలామకములు కుమారా. 30

గీ. నరముచాగనార నాణెంబు గల పట్టు
వెదురు పేడు లోక విశ్రుతముగ
వంశభవశరాస వరశింజినీ విధా
నంబులకును సాధనంబు లండ్రు. 31

వ. మఱియు దూరాపాతార్థంబులైన శరాసనంబులకుం గూర్పందగిన మార్వీలలామంబులకు విధానంబు గల దాకర్ణింపుము. 32

గీ. పరువమై డాలు మేలగు పట్టునూలు
కొలఁది కగునట్లుగాఁ బోసి కుదురుచేసి
మైనమున దీసి కూర్చిన మఱియు వాసి
గులుకు దూరగవిశిఖానుగుణము గుణము 33

వ. అట్లుం గాక మఱియును. 34

క. జలముల గోధూమము లిడి
సలసలమనఁ గాచి కాచి చాపము కొలఁదిన్
బలువిడి పోసిన పట్టా
జలముల నుడికించి తివిచి సమ్మొద మొదవన్. 35

సీ. పదియాఱుముష్టుల బాణాసనమునకు
పదియేను ముష్టులై పరగు మార్వి,
పదియేను ముష్టుల బాణాసనమునకు
పదునాల్గు ముష్టులఁబరగు మార్వి,

పదునాల్గుముష్టుల బాణాసనమునకు
పదమూఁడు ముష్టులఁ బరగు మౌర్వి
పదమూఁడు ముష్టులబాణాసనమునకు
పదిరెండు ముష్టులఁ బరగు మౌర్వి,

గీ. యేకొలందిని గార్ముకం బెసగుచుండు
నా కొలంది యథావిధి నాకలించి
కొలఁది కొక ముష్టి కొఱఁతగాఁ గూర్చవలయు
గుణము ధనురాగమజ్ఞానకుశలుఁ డగుచు॥ 36

వ. ఇఁక నంగుళీత్రాణంబుల లక్షణంబులును, తద్వినియోగంబులును, తత్సాధనంబులును, ప్రశంసించెద నాకర్ణింపుము. 37

క. ఈవిద్యకు సాధనములు
భావింపఁగ నాల్గు ముఖ్య భావము గాంచున్
భూవలయంబున గుణవ
ల్లీ విశిఖ శరాస నాంగుళిత్రాణంబుల్॥ 38

గీ. అందు శరధనుర్జ్యా త్రితయంబు కరణి
గాదు విను మంగుళి త్రాణ మూదకున్న
గొడుగనగు బాణములు పెక్కు దొడుగరామి
నంగుళీత్రాణ మిడఁ దగు నండ్రు బుధులు॥ 39

వ వెండియు. 40

గీ. బాతుముక్కురీతిఁ బటుహంసపక్షంబు
రీతి, నిమ్మబద్దరీతిఁబిప్ప
లచ్ఛదంబురీతి లలిదీర్తురంగుళీ
త్రముల నాల్గు తెఱఁగులమరునట్లు. 41

గీ బాతుముక్కురీతి భాసిల్లుచుండెడు
నంగుళీత్ర మవని నరసిచూడ

భాతి నమరుచుండు నూతనాభ్యాసికి
విశిఖనిచయ మేయు వేళలందు॥ 42

చ. పదపడి హంసరోమ్ముర్మవలె బ్భాసిల్లుచుండెడు నంగుళీత్రముల్
ముదమున లక్ష్యవేది శరముల్ నినుపం జను ధన్వికిన్ దగున్
గుదురయి నిమ్మబద్ధవలె గుంఁడనగాఁ దగు నంగుళీత్రముం
బొదువగు దూరపాతిశరపుంజసమాకలనానుకూలమై॥ 43

ఉ. ఏనుఁగు నెక్కి సాహిణము నెక్కి రథోత్తమ మెక్కి పోరులం
దైనను వేఁటలాడు నెడ నైనను బర్వులువాఱుచున్ యదృ
చ్ఛానిరతిన్ ధనుర్ధరుఁడు చర్మవినిర్మిత మంగుళీత్రముం
బూని శరంబు లేయ నగు బొట్టనవ్రేలు చలింపకుండుటన్॥ 44

శా. శ్రోణి న్మద్గువిషాణఖండమున సద్గోధాంగచర్మంబునన్
మాణిక్యంబున రూప్యకాంచనములన్ మత్తేభదంతంబునన్
నాణెంబుల్ వెదచల్లఁ దీర్చుదురు విన్నాణంబుతో నంగుళి
త్రాణం బంగు రతుకం బగుట సిద్ధం బయ్యెఁ దన్నామమున్॥ 45

గీ. ఇందు మొదలిటి మూఁడును హేమరజత
మణి గజవిషాణ పాషాణ మద్గుశృంగ
ముల రచింతు రయ్యశ్వత్థదళముఁబోలు
నంగుళిత్రంబు గోధాజినార్జితంబు 46

గీ. క్రౌంచచంచుపుటాకృతి గజవిషాణ
ముఖ్య పూర్వోక్తసాధనములను బొడవు
గా యథావిధి రచియింపఁగా నెసంగు
నంగుళిత్రంబు నూతనాభ్యాసములకు 47

వ. ఇట్లు బాతుముక్కుకరణిం బురణించు నంగుళి త్రాణంబునకు విధా
నంబు నిరూపితం బగు, నింక హంసపక్షంబుకై వడిం దనరు నంగుళి
త్రాణంబునకు విధానం బుపన్యసించెద నాకర్ణింపుము. 48

క. పోఁడిమి గజదంతి, మరుణ
చూడాండమువలె నమర్చి చొరఁదొలిచి యసిం
గేడిం గోసిననవియును
గేడిం దళుకొత్తు నొడ్డగెడవుమొగములన్ 49

వ. ఇం దొక్క విశేషంబు గలదు 50

గీ. గెడినట్టు లొడ్డగెడవుగాఁ గోసిన
యంగుళిత్రయుగళ మవల నవల
తూఁచిచూఁచు నెడలఁ దులకు నేకాకృతి
హంసరోమ్ముఁరీతి నమరవలయు. 51

వ ఇంక వర్తులంబగు నంగుళిత్రాణంబునకు విధానం బుపన్యసించెద
నాకర్ణింపుము. 52

గీ పరిణతంబగు జంబీరఫలమురీతి
గజవిషాణాదులను గుండ్రగా నమర్చి
విడఁ దొలిచి రెండు సమముగా నడుమఁగోయ
దనరు వృత్తములంగుళిత్రములు రెండు 53

వ. ఇంక నశ్వత్థదళాభంబగు నంగుళిత్రాణంబునకు విధానం బుపన్య
సించెద నాకర్ణింపుము 54

చ. చతురస్రంబుగ నాలుగంగుళములున్ చర్మంబు గోధాంగకో
ద్యతముంగోసి దినత్రయం బది శిలాధస్స్థంబు గావించి సం
గతి నశ్వత్థపలాశభావమునఁ జక్కం దీర్చి బాలక్షుపా
పతి లీలన్ వివరం బమర్చి గర వాపన్ వ్యాఘ్రవక్త్రాభమై
సతతంబున్ విలుకాండ్ర కింపు నెఱపున్ జర్మాంగుళీత్రం బిలన్ 55

ఉ. జడ్డన హంసరోమ్మువలెఁ జక్కన గాఁదగు నంగుళీత్రమున్
రొడ్డవలంబుగా నిడి గిరుక్కునఁద్రిప్పిన బొట్నవ్రేల మా

. రొడ్డదు నిమ్మబ్రద్దవలె నొజ్జలు గుల్కెడు నంగుళీత్రమం
దిడ్డను మేలురంధ్రమది యిట్టిటు ద్రేలఁజలించు నట్లుగన్. 56

వ. మఱియు నీయంగుళిత్రాణంబులకు గుణాలతోర్ధ్వాంశంబు లా వృనుపం దగు నంతకు నధికంబుగా నునిచిన జ్యాఘాతంబున నంగుళీ త్రాణంబు వీడి పడు నంగుష్ఠంబునకు నొవ్వడరం జేయు వెండియుఁ జర్మాంగుళిత్రాణంబు దక్కం దక్కినయంగుళిత్రాణత్రితయంబునకు వివరంబులు రొడ్డవలంబుగా నోరుదెరచిన కరణిం దీర్ఘవలయు, హంసోరస్సదృశంబులగు నంగుళిత్రాణంబులు కొన్ని దేశంబుల విలుకాండ్రకుం బ్రియం బాపాదించు, వెండియుం గ్రౌంచచంచూపుటసముదంచితంబులగు నంగుళిత్రాణంబులు కొన్ని దేశంబుల విలుకాండ్రకుం బ్రమోదం బాపాదించు, జంబీరఫలార్ధప్రతీకాశంబులగు నంగుళిత్రాణంబులు కొన్ని దేశంబుల విలుకాండ్రకుఁ బ్రమోదం బాపాదించు, వ్యాఘ్రాననంబు కరణిం బఱిణద్ధంబగు చర్మాంగుళి త్రాణంబులు నిఖలదేశంబులం గల విలుకాండ్రకు నాదరణీయంబగు, నట్లగుటఁ జర్మాంగుళిత్రాణం బుత్తమం బగు నండ్రు మఱియునుం గల విశేషంబు లాకర్ణింపుము 57

ఉ చాపం బెక్కిడు నేర్పు లాఱు తెఱఁగుల్ శాస్త్రానుకూలంబులై
ప్రాపించు న్వాను మందు రెండు దెఱఁగుల్ ప్రత్యగ్రచాపార్హముల్
దీపింపుం బెఱనాలుగుం దెఱఁగు లర్థిన్ సంతతాభ్యాస వ
చ్చాపారోపణ సాధనంబు లగుచున్ సభ్యంబులై ధారుణిన్. 58

వ అందు నూతనచాపజ్యారోపణప్రకారద్వయం బుపన్యసించెద
నాకర్ణింపుము 59

చ కుడితొడక్రింద, వామపదగుల్ఫము నూనుమి వామభాగపున్
దొడకును గ్రిందుగా గరిమతోఁ గుడిపాదపు గుల్ఫ మూనినన్
బుడమిని గోముఖాసనముఁ బోల్చి సుఖాసన సంజ్ఞగాంచు న
య్యెడ నుభయోరుపర్వముల నెత్తిన గోముఖనామకంబగున్. 60

ఉ. అటువలె గోముఖాసనము నందు నరుం డుభయోరుపర్వముల్
హాటమున లస్తకంబునకు నవ్వల నివ్వల నూదుచుం గొమల్
చిటుకున వేఱొకం డెదిరిచేతుల వంపఁ బిఱుంద వ్రాలి వి
స్ఫుటగతిఁ గ్రొత్త శార్ఙ్గమునఁ బూన్చుదగున్ గుణమశ్రమంబునన్.

వ. వెండియు నెండల నెండినం గుండలాభంబగు నవీనశార్ఙ్గకోదండం బంగారంబులం గ్రాచి మెత్తఁదనం బాపాదించి తత్సదృశంబుగా దారుఖండం బమర్చి యక్కాఁచిన శార్ఙ్గయష్టి నద్దారుఖండంబుపై నిడి రజ్జువులం దృఢబంధంబు గావించినం దినత్రయంబు గడచనునంతకుం దిన్ననై యుండు నట్లు సరాళంబైన శార్ఙ్గయష్టిం బూర్వోక్త ప్రకారంబున నెక్కిడం దగు నదియునుంగాక శార్ఙ్గయష్టి మఱియుం గరినంబగునేని కొమలవంపు లెదుర నొక్కండు ద్రోచిపట్టినం దానును జానుపర్వంబుల నూని పిఱింది దెస మ్రొగ్గ వ్రాలిన నొండొకరుండు లాఘవంబున మౌర్వి నెక్కిడందగు నిత్తెఱంగునకు మువ్వురు గావలయు నైనను ప్రకారభేదంబు లేమింజేసి మొదలింటి తెఱంగున నంతర్భావంబు ప్రాపించునని పలుకుదురు, మఱియు నొక్కరుండు నవీన శార్ఙ్గంబెక్కిడం గోరిన నొక్క యుపాయంబు గలదది యెట్లనిన, శింజినీ సదృశంబుగా నొక్కచర్మపట్టికా లలామంబునకుం గొలకులం గూర్చి యక్కొలకుల శార్ఙ్గయష్టి కొమల నోయిం దవులించి యెక్కిడందగు, నదియును సవిశేషంబుగా వివరించెద నాకర్ణింపుము. 62

క. అసహాయస్థితి నొక్కరుఁ
డెసకమున నవీనశార్ఙ్గ మెక్కిడఁ దలఁపన్
బ్రసభంబున నుప్పొంగుచు
నసమగతిం గోముఖాసనాసీనుండై ॥ 63

చ. కొలఁకులమర్చి శృంగములఁ గూర్చిన పట్టిక యోగపట్టికా
వలయము కైవడిం దిరుగు వాఱఁగఁ దాలిచి రెండు వైపులం

దొలయఁగ నూరుపర్వముల నూని పిఱిందికి మ్రొగ్గవ్రాలి ని
శ్చలగతి కేలుదోయి నవశార్ఙ్గము సజ్యముసేయఁగాఁదగున్ 64

వ. ఇట్టి నవీనజ్యారోహణంబులనుం బూర్వోక్తంబైన మౌర్వీలలామంబు సమర్థకంబుగా నయోమయంబైన మౌర్వీదామం బెక్కిడందగు నదియును సవిస్తరంబుగా వివరించెద నాకర్ణింపుము. 65

చ ఇనుమునఁ గొంకియుం గొలుసు నీవలనావల దావలంబుగా
గొనయమూలం దమర్చి యటు గూర్చిన యగ్గొనయంపుదోయి క్ర
న్నన నవశార్ఙ్గపుం నవరణమ్ముల దారిచి యెక్కుపెట్టు వే
ళను గొలు ఒదు కొంకితెవులం దొలుదొల్త ఘటింపఁగాఁదగున్. 66

వ ఇట్లు పేడెత్తకుండం దరతరంబునం బదిలంబుగా పైపై గొలుసులం గొంకి దవులించి కొమలపట్టున సూత్రమ్ములు గుదురుగా గట్టి కతిపయదినంబు లునిచినం దెఱంగుపడి యుండు నట్టియెడ నయోమయంబైన శింజిని సడలించి పూర్వోక్తంబైన మౌర్వీలలామంబు సేర్పందగు, నీ రెండువిధంబుల నవీనశార్ఙ్గంబులు సజ్యంబులు గావించి యాలవరించి డించిన శార్ఙ్గంబుల నెక్కిడం దగిన నాల్గు తెఱంగులం బ్రశంసించెద నాకర్ణింపుము. 67

చ కడిమి మెయిం సుఖాసనము గైకొనుచుం గొమ వామభాగపుం
దొడపయి నూది లస్తకము తొడనె దక్షిణజంఘ క్రిందుగా
నిడివలచేత మూఁగొమ నేర్తైఱ వంచుచు సవ్యపాణి నె
క్కిడఁద ను మౌర్వి శార్ఙ్గమున నిట్టి తెఱంగు మహార్హమై తగున్ 68

చ. లలి సమపాదుఁడై నిలిచి లస్తకమున్ వలత్రెక్క నూనుచున్
వలతొడలోన నొక్క కొమవంపు ఘటింపుచు సొంపు మీఱఁగా
వలపలి కేలిమీఁది కొమ వంచుచు దాపలికేలు సాచి దా
నలి గొనయమ్ములన్ నవరణమ్ములఁ గూర్పఁదగున్ జవంబునన్ 69

ఉ. డాపలి ప్రక్కనొక్కకొమ డగ్గఱ దక్షిణకూర్పరంబునన్
జాపపు మధ్యమూని పెలుచం గొమ దావలచేత వంచుచుం

డాపలికేలు సాచి ప్రకటంబుగ శార్ఙ్గము నెక్కుడం దగున్
మోపిడ నిట్టి మూఁడువిధముల్ విహితంబులు ధారుణీస్థలిన్. 70

సీ. ఆఱవ తెఱంగు ధనురాగమార్థవిదులు
మెచ్చు రడుగున శార్ఙ్గము మెట్టుకతన
బెట్టిదంబైన విల్లెక్కుఁ బెట్టఁ దగిన
తెఱఁగుగావున వివరింతుఁ దెల్లముగను॥ 71

క. మోపుల వలతొడ కొమ నిడి
చాపము లస్త్రకము వామచరణాధస్థం
బై పెలు చగ వలపలికిన్
డాపలిచేఁ ద్రోచి యెక్కుడం దగువలచేన్॥ 72

వ ఇట్టి యాఱుతెఱంగులు శాస్త్రవిహితంబులై ప్రసిద్ధిగాంచు, మఱియు నింతకుం దమతమ ప్రజ్ఞావిశేషంబులం గొందఱు కొన్ని తెఱంగుల నెక్కుడఁ జూచినం జూచెదరుఁగాక సకలధనుర్ధరాసాధారణంబులు గాకుండ నింక నిందొక్క విశేషంబు గల దాకర్ణింపుము 73

క, నిస్తుల మగువింటన్ గుణ
లస్త్రకములకును నవాంగుళము లెడగలుగన్
బ్రస్తుతి నెక్కుడఁగా దగు
శస్తముగా దీకొలంది సమకొననున్నన్. 74

గీ. ఈ తెఱంగున శార్ఙ్గంబు లెక్కుపెట్టి
తత్ప్రకారముల్ భావింపఁ దగు నరుండు
భావ మది రెండువిధములఁ బరిఢవిల్లు
కనుబొమలతీరు బాలచంద్రుని విధంబు 75

ఉ. బాలసుధాకరుండుఁ బలె భాసిలు శార్ఙ్గము లక్ష్యవేదికా
ఖేలనవేళ నారస మొగిన్ నిగుడింపగ నర్హమై తగున్

భ్రూలతికా విలాసమున (బోల్పగ నైతగు శార్ఙ్గచాపముల్
వ్రీలక చిత్రలక్ష్యముల వేఢ్కలు గుల్కుచునుండు నందమై. 76

వ. అట్లగుట నెక్కిడిన బాలశశాంక భావంబునం బరిఘవిల్లు శార్ఙ్గంబు కరిన లక్ష్యభేదనంబునకుం దెఱంగుపడియుండు, రెండియుఁ గను బొమల నలువంబునఁ జెలువంబు దాల్చిన శరాసనంబు దూరపాతన ప్రముఖ చిత్ర లక్ష్యంబుల శరంబు లరి వాపుటకుం దరంబై యుండుఁ గావున శార్ఙ్గంబు లెక్కిడి మనంబున నివ్విశేషంబు లరయుం దగు నింక తక్కుంగల విశేషంబు లాకర్ణింపుము. 77

శా. చాపం బెక్కిడు నేరుపుల్ దెలిసి యుత్సాహంబునన్ వింటికిన్
వైపుల్ గాంచఁదగున్ ధనుర్ధరుఁడు భాస్వల్లీలఁ జాపంబునన్
వైపుల్ గాంచి ధరించ నేర్చిన ధనుర్వ్యాపారపారంగతున్
బ్రాపించున్ జిరకీర్తియున్ విజయమున్ భాగ్యోదయంబున్ మహిన్.

క. సకలకళా పరిణతుఁడై
రకమున శార్ఙ్గంబు నరుఁడు రచియించినచో
నొకవైపున మెత్తదనం
బొకవైపున కరినభావ ముండుం దిరమై. 79

వ. ఇట్లు కరినభాగంబు పుచ్ఛంబును, బులకనిభాగంబు శిరంబును గావిం చుట నొక్క విశేషంబు గలదు 80

మ. మెఱయన్ ముష్టిశరాసనంబు నడుమన్ మేలైన తన్ముష్టిపై
జరగున్ బాణము లల్లుగా విశిఖముల్ సంధించుచున్ దీయుచో
బిఱుసయ్యున్ బొడవౌట క్రిందివలువుల్ జిట్టాన జబ్బయ్యునుం
గుఱుచౌటం బయివైపునుం గలసి వంగుం దుల్యభావంబులన్. 81

చ సమత్వబలశృంగమై తనరు శార్ఙ్గముకోటులలోన నొక్కటై
యమరువసుంధరావలయ మందలిశైలసముద్రకన్యకా

రమణులహ స్తపద్మముల రాజిలు శార్‌ఙ్గము సాటివచ్చు ని
క్క్రముగను రాజరాజులకుఁ గాని లభింపదు తాదృశం బిలన్. 82

వ. అట్టి శార్‌ఙ్గధనుర్లాభంబున నూర్ధ్వాధర వివేచనంబు వలవదు, రెండువైపుల సంజ్ఞాసూత్రం బిడవలయు, నిద్ధను ర్శేష్ఠంబు సవ్యాపసవ్యంబుల నేయుటకుం దెఱంగుపడియుండు, వెండియు నెక్కిడితివియుచుం దారతమ్యంబులు భావించి కరినభాగంబు పుచ్ఛంబునుఁ జులకనిభాగంబు శిరంబునుం గావించి శిరోభాగంబునకుం గొమ క్రింద జ్ఞాపకంబుగా సూత్రంబు చుట్టందగు, గొందఱు గుఱుతులిడక యభ్యస్తంబులగు శార్‌ఙ్గంబులకు నూర్ధ్వాధఃకాయంబు నిరూపింతు రెట్టులనిన నాకర్ణింపుము. 83

క. బాణపు టొరయికచేతన్
బాణితలం బలవరించి పట్టుటచేతన్
క్షోణితలంబున వింటికి
నాణె మెఱఁగివైపు దెలియు నైపుణ మెసగన్ 84

వ ద్వంద్వసంకులసమరంబులను నిశాసమయంబులను శరసంధానంబున నూర్ధ్వాధర భాగవినిభాగంబు దుర్లభం బగుట సంజ్ఞాసూత్రంబునం జుట్టవలయు నిట్లు నైపులు భావించి శరాసనంబు వామముష్టిం దాల్పందగు, నట్లు దాల్ప నుచితంబులగు ముష్టులు వివరించెద నాకర్ణింపుము 85

క క్షితి శార్‌ఙ్గము దాల్పఁగ వ
ర్ణితమై ముష్టిత్రయంబు నెలకొను శాస్త్రో
చితమై వర్తుల మనఁగా
చతురస్రం బనఁగ దీర్ఘచతురస్ర మనన్ 86

వ. క్రమంబున దల్లక్షణంబులు నిరూపించెద. 87

క అంగుష్ఠము వెలిగా జతు
రంగుళముల విల్లు దాల్చి యన్నాల్గిటిపై

యంగుష్ఠమ్ము వాచినయెడ
లంగనుపడు ముష్టివర్తులంబన బరగున్. 88

క. అంగుష్ఠాగ్రంబు ద్వితీ
యాంగుళి శిఖరంబు సోకునట్లుగఁ బెఱమూఁ
డంగుళు లవి దాల్చిన
సంగతమై దనరు ముష్టి చతురస్రమనన్. 89

క. అంగుష్టాగ్రమున ద్వితీ
యాంగుళినఖరంబు మూయునట్లుగ నిడి మూఁ
డంగుళముల పిడికిటఁ గొన
సంగతమగు ముష్టిదీర్ఘ చతురస్రమనన్ 90

మ. ఇలపై బాణము లేయ నిశ్చలముగా నేస్థానమందైన రా
జిలుచో వర్తులముష్టి మేలు రథవాజిస్యందనస్థుండు సం
కులయుద్ధమ్ములవేటలం దమిఁ బరుంగుల్ వాఱుచున్ వ్రేయ నొ
జ్జలు గుల్కం జతురస్ర దీర్ఘచతురస్రంబుల్ మనోజ్ఞాకృతిన్ 91

వ. విను మిందుల నొక్కవిశేషంబు గలదు దూరాపాతన ప్రముఖంబులగు కొన్ని విన్నాణంబులు సమస్థాన ప్రముఖస్థానంబుల నచలుండై సంధానంబుసేయుంగావున శరంబు సడలక ధారాళంబుగా నడుచు ద్విరదరథప్రముఖ వాహనంబుల నారూఢుండై సంధానంబు సేయునప్పుడు వాహనవల్గనంబులఁ జెల్లించుంగావున, వర్తులముష్టి నాశుగంబునకుం బట్టు లేమిం జేసి సడలిపడుం గావున వాహనారూఢులకు చతురస్రదీర్ఘ చతురస్రంబులు యోగ్యంబు లిమ్ముష్టుల మధ్యమ ప్రముఖాంగుళి త్రితయంబున శార్ఙ్గమధ్యంబుఁ బట్టి తక్కిన ప్రథమ ద్వితీయాంగుళంబుల నంగుష్ఠంబు మీఁదుగాఁజుట్టినవ్రేలి క్రింద శరంబు సడలకుండునట్లుగా నరివోయం దరంబై యుండు, మఱియు నిట్టి ముష్టిత్రితయంబునం గుణదోషంబు లేర్పరచెద నాకర్ణింపుము 92

క. ముంజేయ్యెడచేయు సగము
శింజిని ఘాతంబు దారసిలనీక రహిం
రంజితముష్టిత్రయమున
మంజులగతి శార్ఙ్గమధ్యమము పూనఁదగున్. 93

క. కరతలము సగము ముంజే
యరయ గుణాఘాత మొందు నట్లుగఁ దాల్పం
ధరణీస్థలిఁబంచానన
చరణాభం బంద్రు తగదు శార్ఙ్గము ధృతికిన్. 94

వ వినుమర్ధచంద్రహస్తంబున వంశభవకార్ముకంబు ధరియించినం
బంచాననచర పరిణాహంబునం బురణించు నిప్పట్టు శార్ఙ్గంబులకుం
గాదని కుమారపరశురామ ప్రముఖులగు ధనుఃకళాపరిపూర్ణుల నిర్ణ
యంబు గలదు, మఱియును 95

గీ తనబలిమి కెక్కుడగు విల్లు దాల్చునేని
పట్టుగారాని పట్టునఁ బట్టెనేని
పొడవు సింజిని గలవిల్లు పూనునేని
యతనిముంజెయి గుణఘాత మందుచుండు. 96

సీ. అరచేయి నవకోరకాశ్రయంబునఁ బొక్కు
బలువిల్లు వదలుగాఁ బట్టునేని,
ముడుతవాఱును జర్మమును జారుపట్టులో
దృఢత చాలక విల్లుదిరిగెనేని,
యభ్యాసదుస్సహం బగు విల్లు సమబలం
బైనను జబ్బుగాఁ బూనునేని,
యంగుళంబులకు నొవ్వడరు వైపులఁ గ్రింద
మీఁదు గా వీడ్వడ నూఁదునేని,

తే. యనుగుణం బైనకార్ముకం బమరఁ బట్టి
మొదటి నడటున మణిబంధమునకు సోక

నీక శింజిని మొరయించి నిలుపుఁగాక
కాక కరతలమున కంటనీక శరము. 97

వ ఇవ్విధంబున కార్ముకముష్టిప్రకారంబులు ప్రవర్తిల్లుచుండు, నింక స్థానప్రతిష్ఠానలక్షణ వినియోగంబు లుపన్యసించెద నాకర్ణింపుము

శా. ఈశానుండు గుహుండు భార్గవకులాధీశుండు రామక్షమా
ధీశుండుం మొదలౌ ధనుర్ధరకులాధీశుల్ శరాభ్యాసముం
దా శంకింపుదు రైదు నిల్కడలు ప్రత్యాలీఢ మాలీఢమున్
వైశాఖంబు సమంబు మండల మనన్ నామంబు లైదింటికిన్ 99

సీ. ఎడమపాదము లక్ష్య మెదురుగా మున్నిడ
నవనిఁ బ్రత్యాలీఢ మైతనర్చు,
గుఱికిఁజక్కన గాఁగఁ గుడికాలు మున్నిడ
నాలీఢ మారూఢ మై తనర్చు,
పుడమి మూఁరకొలంది యెడముగా నంఘ్రిద్వ
యము నిల్ప వైశాఖమై తనర్చు,
నడుము నంగుళియుగ్మ మెడముగా నిలిచిన
నది సమస్థానకం బై తనర్చు,

తే. ఆల సమస్థానముననుండి యడ్డముగను
దోరణాకృతి నడుగుల దోయి ద్రిప్పి
యుభయ పార్శ్వముఖంబులు నోరయ నిలుప
మహిఁ దనరుఁ దోరణాకృతి మండలంబు. 100

వ వెండియు ధనుర్ధరుం డయ్యైస్థానంబుల నిలుచు విన్నాణంబులును దత్తద్వినియోగంబులు నుపన్యసించెద నాకర్ణింపుము 101

మ తెఱఁగారం గుడి పాద మడ్డముగ ధాత్రిన్ నిల్పి తద్గుల్ఫముం
గుఱిగా మూఁరెట వామపాద మిడి యంగుష్ఠంబుపైఁ జక్కఁగా
గుఱికిం గార్ముకముష్టిసాచి శర మక్షోభంబుగా నేయున
త్తఱి నీస్థాన మధీనమై తనరుఁ బ్రత్యాలీఢనామంబునన్. 102

మ తనరారుఁ విను మూఱుచందములఁ బ్రత్యాలీఢమందాద్యమై
ననుచుఁ వైష్ణవ మాంతరం బగు విధానంబై తగుఁ స్వస్తికా
సన మీరెండునుగాక నాల్గు తెఱఁగుల్ సంధిల్లు వామాంఘ్రి తి
న్ననగా రెండును మూఁడు నాల్గయిదు జేనల్ జంగలఁ సాచినఁ

సీ, జగతిపై మూరెఁడుజంగగా నిలిచిన
సారిది హెచ్చున నేయ సుగమ మింద్రు,
బలువిడి మూఁడు జేనల జంగసాఁచిన
యదిసమలక్ష్యార్హమై తనర్చు,
నత్యంత కఠిన లక్ష్యముల దూయఁగ నేయ
నాల్గుజేనల జంగ నాణె మందు
రైదు జేనలజంగ నంగయష్టిక డాఁచి
మిగులఁ దగ్గన నేయఁ దగు ధరిత్రి,

తే. నిత్తెఱంగుల నాల్గింట నెడమ పిఱుఁదు
గానరా సవ్యజాను భాగంబు ముందల
వంచుకతమున దృఢసౌష్ఠవంబు గలుగు
నందమైన ప్రత్యాలీఢ మందు వినుము 104

వ మఱియు నొక్కవిశేషంబు గల దాకర్ణింపుము. 105

సీ కుడికాలు వెనుకనుంకువ నైదు జేనల
జంగగా నాఁచి సారంగమునకుఁ
బొంచిన బెబ్బులిపోలిక డాకాలి
మీఁదఁ గూర్చుండి బిట్టూదునపుడు
కొంచెము భూమికై కుదురుగా నొఱఁగుచు
గళుకైన డాపలి కాలిమీఁద
కంచగా వలెఁగాను వంచుటయెట్లన్న
తన వామభాగ నితంబదేశ,

తే. మెలమి గనుపడు నిట్లుగా నివ్విశేష
మన్త్రవిద్యార్థ పారగులై నయట్టి
ఘనులసన్నిధి నభ్యాసమున ఘటించు
చాపధరుఁడు ధనుఃకళాసమధికుండు. 106

వ. విను మిందువైష్ణవంబును స్వస్తికాసనంబునుం గాక శుద్ధప్రత్యాలీఢంబునం దాఱుభేదంబు లంగుళీభేదంబుల నేర్పరింతురు అట్లైననేక భేదంబు లేర్పడు నాఱుతెరంగులనుటకుం గొలఁది గాకుండు గావున, వితస్తిద్వితయంబు, వితస్తి త్రితయంబు, వితస్తి చతుష్టయంబును వితస్తిపంచమంబును, గొలందులుగా నడుగుల విన్యాసంబుల నాల్గు తెఱంగు లేర్పరించి, వైష్ణవ స్వస్తికాసనంబులతోడ నాఱుతెఱంగులనుట సుగమంబై యుండు, వైష్ణవస్థానంబు శరప్రయోగ్యంబు గాకుండియు, స్థానంబుల నగ్రగణ్యంబగుఁ బ్రత్యాలీఢంబునకుఁ బ్రథమ పరికరంబగుటం దత్ప్రతిష్ఠానంబ నాఁ బరగుచుండు స్వస్తికంబు భిన్న ప్రకారంబయ్యునుం బ్రత్యాలీఢంబునం బట్టుటం దత్ప్రతిష్ఠానంబ నాఁబరగు, వి ల్లు ప్రతిష్ఠానయుగళంబునకు లక్షణంబు ప్రతిష్ఠాన ప్రకరణంబున వక్కాణింతు, నింక నాలీఢస్థానంబున ధనుర్ధరుండు నిలుపందగు విన్యాణం బుపదేశించెద నాకర్ణింపుము 107

వ. ఆలీఢస్థాన విభాగము (ఎ.) 107

మ. కడిమిన్ వామపదంబు ధాత్రి పయిఁజక్కన్ నిల్పుచుం మూరెఁటన్
గుడిపాజ్జమ్మును జంగసాఁచి యుభయాంగు ష్ఠాగంముల్ లక్ష్యమం
దిడి పార్ష్ణిద్వయ మిట్టటున్ గదలఁగానీకన్ ధృతిన్ నిల్చి తూ
పడరింపన్ వశపడా ధనుర్ధరుల కయ్యాలీఢ మారూఢమై. 108

వ. ఈలక్షణానకు కిందాళ వెంకటాచార్యులుగారు చెప్పిన పద్యాలు 109

సీ. కుడికాలుజంగ మూరెఁడెడంబుగా సాఁచి
కుడికాలు వంచక కుదురుపఱచి,
పదద్వయాంగుష్ఠముల్ పటుశరవ్యంబున
కెలమిఁ జక్కనగాఁగ నిలిపిఁనిలిచి,

గోధాంగుళిత్రముల్ గోమరారఁ గాఁ బత్రి
మౌర్విని సంధించి మగటిమిగను,
చాప మాకర్ణాంత మేపారఁగాఁ దివ్చి
తటినిఁ గాల్గదలింపఁ దగదు కదలి,

తే. శార్ఙ్గమున నేయుధన్వికి సత్త్వ మెడలఁ
బార్ష్ణి చలియించు నదిగాన పార్థ వినుము
కాలు గదలింప దోషంబు గల దటంచు
చాపధరులందు రాలీఢసరణులందు. 110

వ వైశాఖస్థాన విభాగము 111

మ పుడమిన్ మూరెఁ డెడంబుగాఁ బదయుగంబున్ నిల్పి వామాంఘ్రికిన్
గడుఁ బ్రేలుం దుదలై శరవ్య మెదురంగాఁ జాపముష్టింగడున్
బెడిదంబై తనరార సాఁచి యపు డాభీలస్థితిన్ బాణముల్
వడి నేయందగు తానకంబు దనరున్ వైశాఖనామంబునన్ 112

వ ఈస్థానకంబునకు లక్షణవివక్ష 113

గీ. రెండుపదములనడుమ మూరెఁడు వెడల్పు
విడిచి నిలుచుండవలెఁ దనయెడమకాల
నమరు చిటికెనవ్రేల లక్ష్యమున కెదురఁ
దనరు వైశాఖనామకస్థానమునను. 114

వ సమస్థానవిభాగము, 115

గీ అంగుళద్వయ మెడ ముండునట్లుగాఁగ
సౌరుఁగాఁ బాదయుగళంబు సరస నూఁది
యూర్ధ్వలక్ష్యంబుపైఁజూడ్కులోలయు నిలుచు
తానకం బగు ధర సమస్థానకంబు 116

క పాదద్వంద్వము నడుమను
మేదిని రెండంగుళములు మితమిడి నిలుపన్

గాఁదగు నూర్ధ్వశరవ్యని
పాదనమున (జూడ్కి దనరు సమపాదమునన్. 117

వ. మండలస్థాన విభాగము. 118

గీ. పదము లిరుగడలును ద్రిప్పి పార్శ్వములను
మండలాకృతి జానుయుగ్మంబు వంచి
తగ నధోలక్ష్యమునఁ జూడ్కి దవుల నిలుచు
ఠానకంబగు మండలస్థానకంబు. 119

వ. ఇట్టి స్థానపంచకంబునకు వినియోగంబులు వివరించెద నాకర్ణింపుము.

శా. ఆశంసార్హములై ధరం బరగు ప్రత్యాలీఢ మాలీఢముల్
వైశాఖంబు సమానలక్ష్యముల భవ్యంబుల్ సమం బూర్ధ్వగం
బై శోభిల్లెడు లక్ష్యముం గడప నర్హంబౌ సధోలక్ష్యము
ద్దేశింపం దగు మండలంబున ధరిత్రీరాజతేజోనిధీ 121

వ. ఊర్ధ్వాధస్సమానలక్ష్యవిభాగము (౨) 121

గీ పార్థ విను పాదచారికి పాదచారి
తోడరు నాధోరణునకు నాధోరణుండు
రథికి రథి సాదికిని సాది రహి సమాన
లక్ష్యములు గాఁగఁ బలికిరి లక్ష్యవిదులు 122

చ. తరుశిఖరస్థలీఫలపతంగవితానము శైలకూటగో
చరహరిచిత్రకాయముఖ సత్వనికాయము శత్రుభృన్నభ
శ్చరనికరంబు కృత్రిమరుఘుప్రముఖాంబరయంత్రముల్ వసుం
ధర నివి యూర్ధ్వలక్ష్యము లనంబడు నో భరతాన్వయాగ్రణీ 123

గీ, ఉన్నతస్థాయి కడుగున నొనరుచుండు
నిభము పంచాననము భటుండెద్దియేని
తగ నధోలక్ష్యభావంబు దాల్చునిట్టు
లవని చాతుమలక్ష్యత్రయంబు దనరు. 124

గీ. ధరణి మీఁద భద్రదంతావళము మీఁద
రథము మీఁద సలుపు రణములందు
స్థానపంచకంబు దనరు వైశాఖ మొ
క్కటియె సాదులకును గరిమ నెఱపు. 125

వ. మఱియు నీస్థానపంచకంబున కనుబంధంబులై ప్రతిష్ఠానంబు లనేకం బులు గలవు. అందు ధనుర్ధరాను గుణంబులై వైష్ణవంబును, స్వస్తి కాసనంబును, దోరణంబును, గతాగతంబును, హంసలలితంబును, బార్శ్వగంబును, డోలాపాదంబును, వివర్తనంబును, నేకపాదంబును, మయూరలలితంబును, వ్యత్యస్తపాదంబును భ్రమరీమండలంబును, జక్ర మండలంబును, నర్ధమండలంబును, జిత్రంబును, లోనుగాఁ బంచదశస్థానంబులు ప్రవర్తిల్లుచుండు, నందు వైష్ణవంబును, స్వస్తి కాసనంబును, దోరణంబును, గతాగతంబును, ప్రత్యాలీఢాను బంధంబును హంసలలితంబును, బార్శ్వగంబును, డోలాపాదంబును, వివర్తనంబును, నైశాఖంబున కనుబంధంబులై యుండు, నేకపాదం బును మయూరలలితంబును, వ్యత్యస్తపాదంబును, సమస్థానకంబున కనుబంధంబులై యుండు, మఱియు భ్రమరీమండలంబును జక్రమండ లంబును నర్థమండలంబును, బూర్వోక్తంబులగు ప్రతిష్ఠానంబుల కరణి మండలస్థానంబున కనుబంధంబులు గాకుండియు నామానుబంధం బునం దత్ప్రతిష్ఠానంబులనాఁ బరగుచుండు, నిట్టి ప్రతిష్ఠానంబులకు లక్షణ వినియోగంబు లుపన్యసించెద నాకర్ణింపుము 126

వైష్ణవ స్థానకము.

గీ కుడియడుం గూని డాపలిగుల్ఫమందు
సవ్యపదపార్ష్ణి గీలించి సగము ధరణి
పార్శ్వముఖముగాఁ నూనుచు భాతి నిలచు
తానకం బగు వైష్ణవస్థానకంబు. 127

స్వస్తికాసనము.

క ప్రత్యాలీఢపదస్థితి
సత్యము వలజంఘ వామజంఘకుఁ బైఁగా

నత్యంతముఁ గూర్చున్నన్
బ్రత్యయమున స్వస్తికాసనం బనఁబరగున్. 128

గతాగతము.

క. వారక ప్రత్యాలీఢప
దారూఢి శరవ్య మెదిరి యరిముఱినడవన్
దోరణ మగుఁ దోరణమున
ధారుణిఁబోరాకలను గతాగత మమరున్. 129

హంసలలితము, పార్శ్వగము, డోలాపాదము, వివర్తనము.

సీ. హంస మేఁగిన రీతి నడుగు లూనుచు నేఁగు
నది హంసలలితాఖ్యమై తనర్చుఁ
గుడికేల ధనువూఁది గుఱికినై యాననం
బటు ద్రిప్ప పార్శ్వగంబై తనర్చు,
మోకాళ్ళఁజిఱుదొడల్ మును వంచి శర మేయ
నవని డోలాపాదమై తనర్చుఁ
గాల్ద్రిప్పక పిఱింది కడకు వక్షము ద్రిప్ప
నది వివర్తాహ్వయం బై తనర్చు,

తే. మానితం బగు నీప్రతిష్ఠానమునకు
నాలుగింటికి జనకమై నలువ మగుచు
జగతి సవ్యాపసవ్యలక్ష్యముల నేయఁ
దనరు వైశాఖనామక స్థానకంబు 130

ఏకపాదము.

మ. కమనీయాకృతిఁ జాపరోపముల జాగ్రల్లీలచేఁ బూనుచున్
సమపాదస్థితి నందమా నెడమహాజ్ఞన్ దక్షిణోరుప్రదే
శమునం దూనుచు దూరపాతనములన్ సంధానవిద్యాపరి
శ్రమముం జూపెడు ధన్వి నిల్కడ ప్రశస్తం బేకపాదంబునన్. 131

మయూరతిలకము.

మయూరతిలకం బగున్ మదమయూరభావంబునం
బ్రయత్నమునఁ బాదముల్ పయిపయిన్ గడు నొ్రపుచున్
జయంబు గొని సంగరక్షమ సమస్థితిన్ ధన్వి దా
వియచ్చరులు మెచ్చఁగా విఱివి మీఱఁ గ్రీడించుచోన్ 132

వ్యత్యస్తపాదము.

మ. గళమందున్ గటియందు వామచరణస్కంధంబు నందుం ద్రిభం
గుల భగ్నంబగు మేనుతోఁ గుడియడుంగుం ధాత్రిపై నూని డా
పలిజంఘన్ వలజంఘపై నిడుచుఁ దత్పాదాగ్ర మిప్పాద మీ
వల నూనన్ సమపాదసంస్థితులకున్ వ్యత్యస్తపాదం బగున్. 133

భ్రమరీమండలము. చక్రమండలము అర్ధమండలము

మ. భ్రమరీ మండలమౌ భ్రమద్భ్రమర విభ్రాంతిన్ భటుండేకపా
దమునన్ ధారుణి దిర్ధిరం దిరుగ మాద్యల్లీలఁ గ్రీడించుచో
సమపాదభ్రమి చక్రమండల మగున్ జక్రాకృతిన్ జుట్టిరా
నమరున్ మేదిని నర్ధమండలము చంద్రార్ధంబు కాల్ద్రిప్పినన్ 134

వ. విను మిట్టి ప్రతిష్ఠానంబులకు వినియోగం బుపన్యసించెద. 135

సీ. ఇల నంతు కందుకాదుల దూయ నేయఁగా
నాయితం బగు స్వస్తికాసనంబు,
పరచుచుండెడు ఘోర భల్లుకాదులఁ గూల్ప
నారూఢమై యుండుఁదోరణంబు,
జిరజిరపైకి వచ్చిన వరాహాదుల
నలయింపఁదనరు గతాగతంబు,
హ్రస్వఁపైయహితుఁ డే యఁగఁ దాను హ్రస్వఁడై
లలి నేయఁదనరు డోలాపదంబు,

ఘనసమానలక్ష్యంబుపైఁ గదిసి కదిసి
యాశుగము లేయఁగా దగు హంసలలిత

మిరుగడలఁ గ్రమ్మ శత్రుల నేయుటకును
భాసురం బగు ధన్వికి ఁబార్శ్వగంబు. 136

ద్రుతవి. ఒరుని మార్కొని యొండొకరుండు దా
శరము లేయుచు నారెకు వెన్కొనన్
మరలి యేయుచు మార్తుర నొపఁగా
ధర పివర్త ముదారత వర్తిలున్. 137

ఇంద్రవ. సత్యంబుగాఁ బల్కెదుఁ జాపహస్తుం
డత్యంత మభ్రంబున నభ్రగం బౌ
ద్ధత్యం బునం బర్వగఁ దాని నేయన్
వ్యత్యస్తపాదంబున వాసి గాంచున్ 138

క. వియదావరణపదస్థితి
భయదుండై దనుజుఁ డేయు బాణంబులు దాఁ
బయిఁబొరయనీక మెలఁగగ
మయూరలలితంబు దనరు మహనీయంబై. 139

తే. దూరపాతి శరంబులఁ దొడఁగుటకును
సముచితం బగు ధర సమస్థానకంబు
ధర సమస్థానకములీల దవ్వు నడుమ
నేకపాదంబు జోకల నాకలించు. 140

క. ప్రత్యేకమున నేకపాద
స్థితిఁ గుమ్మరసారెభంగి దిర్దిరఁ దిరుగన్
ప్రతివీరాభీలరఁశో
ద్ధతిభ్రమరీమండలమనఁ దనరు భటునకున్. 141

చ పలువురు పన్నిదంబులను బైకొని బాణము లేయ ధీరుఁడై
వలఁగొని చుట్టునుం దిరుగువారుచు నందఱ కన్నిరూపులై
చిలుకుటలంతిబాణములఁ జందరవందర లాడుచున్ మహిన్
మెలఁగఁగఁజక్రమండలము మేలు ఘటించు ధనుర్ధరాళికిన్. 142

క. శౌరి సమప్రత్యాలీ
ఢారాఢుల విశిఖ మొదలి యర్ధశరధరా
కారముగ వడుగు మార్చు క
క్షారసికత కర్దమండలము దనరు మహిన్ 143

చిత్రగతి.

మ. సమపాదప్రముఖాదిమస్థిరచరస్థానప్రతిష్ఠానతా
నములన్ నాలుగడుంగులన్మెలఁగుచున్ దభ్రం బదభ్రంబు హ్ర
స్వము దీర్ఘంబును నే సదృశ్యమును దృశ్యంబై పిసాళించు గా
త్రముతో రాజిలు ధన్వి చెయ్దమిలఁ జిత్రస్థానమాఁబోరల్ 144

వ. మఱియును. (౨) 144

సీ. హస్త్యశ్వరథభూములందు ధనుష్మంతుఁ
డతిభయంకరవృత్తి నడరి నిలిచి,
ధనురాశుగంబులు ధరియించి నాల్గడుం
గుల కొలంది మెలంగి కుడియెడమలఁ
దిరుగుచు దిశలందు దివియందు భువియందు
శరములు సవ్యాపసవ్యములను,
వ్రేయుచు రిపులను డాయుచుఁ బరివేష
గతుఁడైన చండభాస్కరుని కరణి
హ్రస్వుఁడన దీర్ఘుఁడన సూక్ష్ముఁడనఁగ మెఱసి
శూరవరులెల్ల వెఱఁ గంది చూడఁ జక్ర
వలయమున సంచరింపుచు వెలయు జగతిఁ
జిత్రగతి యన నొప్పుఁ బ్రసిద్ధముగను 145

వ. వెండియు నొక్క విశేషంబు గల దాకర్ణింపుము 146

క. స్థిరములు చరములు నై ధా
త్రి రహించున్ స్థానములు ప్రతిష్ఠానంబుల్
స్థిరమగు చతురంగాఙ్గము
చరము పదాతికిని దక్కఁ జన దన్యులకున్. 147

వ. అందుఁ బ్రథమోద్దిష్టంబగు ప్రత్యాలీఢాది స్థానపంచకంబును వైష్ణవ స్వస్తికాసన డోలాపాద పార్శ్వగ వివర్తవ్యత్యస్త పాదైకపాదం బులు లోనుగా సప్తప్రతిష్ఠానంబులుం గూడ ద్వాదశస్థానంబులు స్థిరంబు లనంబరగుఁ జిత్రంబు స్థిరచరస్థానసంకీర్ణంబు గావున నుభయ సంకీర్ణం బనం బరగు, వెండియు స్థిరస్థానంబులు చతుర్విధయుద్ధా ర్హంబు లనియు, గతాగతంబును, దోరణంబును, హంసలలితంబును, మయూరతిలకంబును, అర్ధమండలంబును, జక్రమండలంబును, భ్రమ రమండలంబును, లోనుగా సప్త ప్రతిష్ఠానంబులు చరంబులనం బరగుఁ బత్రంబు స్థిరచిరస్థాన సంకీర్ణంబు గావున నుభయసంకీర్ణం బనం బరగు, వెండియు స్థిరస్థానంబులు చతుర్విధయుద్ధార్హంబు లనియుఁ జరస్థానంబులు పదాతి సుగమంబు లనియును, స్థిరచరస్థాన సంకీర్ణంబగుటఁ జిత్రంబు చతురంగార్హం బనియును నిర్దిష్టంబయ్యె, నిం దాశ్వికులకు వైశాఖం బొక్కటి విధేయంబు గావునఁ దత్ప్రతిష్ఠా నంబులగు పార్శ్వగవివర్తనంబులు విధేయంబులై యుండు, మఱి యును జిత్రస్థానకంబు పాదచారులకు విధేయం బగు నట్లు హయ గజస్యందనారోహకులకు విధేయంబు గాకుండియు వాహనచిత్ర వల్గ నంబులం జిత్రస్థానకంబునాఁ బరగు, నిట్టి వింశతిస్థానకంబుల లక్షణ వినియోగంబు లెఱింగినధనుర్ధరుండు లోకోత్తరుండై వర్తిల్లు ననిన నాచార్యుం గనుగొని పాండవమధ్యముం డిట్లనియె. 148

శా. స్థానంబుల్ వినియోగలక్షణపరీక్షారూఢి బోధింపగా
నానందంబునఁబొందు డెందము మహాత్మా ధన్వికిన్ భవ్యమై
స్థానం బెయ్యది యాదిమంబు నిఖిలస్థానంబులం దత్తదా
ఖ్యానంబుల్ వినఁగోరు నాహృదయ మోకారుణ్యపాథోనిధీ. 149

వ. అని యడిగిన నాచార్యుండు పార్థుని భక్తిస్నేహంబులకుం దద్దయు నంతసిల్లి యిట్లనియె. 150

క. నీవడిగినట్ల యడిగితి
భావంబిగురోత్త మున్ను భార్గవరాముల్

నావినతికిఁ బరితుష్టుం
డావిబుధకులావతంసుఁ డానతి యిచ్చెన్ 151

వ. తత్ప్రకారంబు వినుపించెద నాకర్ణింపుము. (అ.) 151

శా. ఏయే లక్ష్యములందు శాస్త్రనియతం బేస్థానకం బుర్విలో
నాయాలక్ష్య విభేదనంబు వివరం బాస్థానకంబైన మే
లై యుండుం జిరకాలసంస్థితికి బ్రత్యాలీఢ మిష్వాసదీ
క్షాయుక్తిన్ సమ మాదిమంబు నిఖిలస్థానంబులం దారయన్. 152

క. శ్రుతులకు నోంకారము వలెఁ
గృతులకు శ్రీకారమెసఁగురీతి సమపద
స్థితినిఖిల స్థానములకు
హితగతి ప్రథమాంగ మగుచు నిల విలసిల్లున్. 153

వ అని యానతిచ్చి తత్సమయసమాపాదితప్రమోదపరాయత్తచిత్తుండై
వెండియు. 154

మ. క్షితిజాగ్రంబునఁ గృత్రిమం బయిన పక్షిన్ లక్ష్యముంగా సమ
స్థితి సంధానముసేయు కౌశలము కీర్తించెన్ మహాకూపపా
తితకార్తస్వరకందుకంబు దృఢశక్తిన్ మండలస్థానక
స్థితి బాణమ్ముల దిప్పనేర్పును బ్రబోధించెన్ రహస్యంబునన్. 155

వ మఱియు నీదృశంబులగు విన్నాణంబులు పెక్కు లుపదేశించినం గృతా
ర్థుండనై వచ్చి భవాదృశరాజకుమారసమక్షంబునం గూపపతితంబగు
కందుకంబును, మణిమయం బగు నంగుళీయకంబునుం దిగిచితి, నది
గారణంబుగాఁ గృపగాంగేయానుమతంబున భవత్ప్రముఖ కుమార
వర్గంబున కాచార్యకం బొనర్చుచున్నవాఁడ, మద్భాగ్యంబు పెంపున
నీయట్టి శిష్యునిం బడసి యీ దృశంబులగు ధనుకళావైదగ్ధ్యంబు
లుపదేశింపం గాంచితి, నీవలన నామనోరథంబు సఫలంబు గాఁగల
దని మృదుమధురభాషణంబులం బ్రబోధించు నాచార్యుం గాంచి
వినయావనతవదనుండై పుత్రుం డిట్లనియె, 156

క. సమమూర్ధ్వలక్ష్యగంబై
తుములంబున మండలం బధోలక్ష్యగమై
యమరఁగ నవసర మెయ్యది
విమలాత్మా, తెలియఁబల్కవే వినవలతున్, 157

వ. అనిన నాచార్యుండు పార్థున కిట్లనియె, 158

సీ. హరిదంత దంతావళావళుల్ సరివచ్చు
మదకలస్తంబేరమముల మీఁదఁ
గనకాద్రిశిఖర సంకాశంబులగు మణి
ఖచిత కాంచన శతాంగములమీఁదఁ
జక్రవాళంబు మెచ్చని హేమ వరణంపు
ఘనగోపురాట్టాలకముల మీఁద
జలధరంబుల భాతి సకలదిక్కులఁగామ
గంబైన వర పుష్పకంబు మీఁద,

తే. నిలిచి క్రిందికి శరములు నిలుపునపుడు
మండల స్థానకంబున నుండవలయు
నున్నతస్థాయిపై శరం బొలయఁ జేయఁ
దరియఁ జనువేళ నగు సమస్థానకంబు 159

వ. వెండియు వాహనారూఢుం గదిసి శరంబులు నినుచు పాదచారికి
సమస్థానకంబును, నట్లు కదియంబడి శరంబులు నినుచు పాదచారిపై
శరంబులు నడుపు వాహనారూఢునకు మండలస్థానకంబును దక్కం
గల సమలక్ష్యంబుల నాలీఢ ప్రత్యాలీఢ వైశాఖంబును బ్రతినియతం
బులై యుండు నిట్టి విన్నాణంబు లెఱింగిన ధనుర్ధరుండు త్రిలోకీతిల
కుండగు, నింక ధనుర్ధరాకర్షణ హస్తవిశేషంబులును, దదనుకూలం
బులగువిన్నాణంబులు నుపన్యసించెద నాకర్ణింపుము 160

సీ. కర్తరీహంసముఖంబు లరాళంబు
కటకాముఖం బన గణుతిఁగాంచు,
హస్తముల్ బాణాసనాకర్షణంబున
కలరు విన్నాణులగు నరయ నందుఁ

కర్తరీహంసముఖములు వంశజశార్ఙ్గ
కోదండయుగళానుగుణము లంద్రు,
శార్ఙ్గ మరాళహస్తమున వంశభవంబు
కటకాముఖంబునఁ గడిమి నెఱపు,

తే. నలపతాకాఖ్యహస్తమునందు జుట్న
వ్రేలి వెలిఁ బెట్టనగు కర్తరీకరంబు
కొలఁది తర్జని మధ్యమాంగుష్ఠనఖర
శిఖరములు గూర్పఁదగు హంసముఖకరంబు. 161

గీ. మహిత తర్జని మధ్యమా మధ్యమమున
బుంఖ మంగుష్ఠ మొరయంగఁ బూనఁదగిన
హస్తమగుఁ గటకాముఖం బదియు వంశ
గుణగుణితవంశధను వనుగుణ సుమ్ము. 162

చ బొటమన వ్రేలిమీఁది కణుపుం బయిఁ జుట్టనవ్రేలు వాంచి ప
ట్టుటయె యరాళ హస్తము కడుఁ బెడిదంబగు శార్ఙ్గచాప ము
త్కటరభసంబునం దివియఁగాఁదగు సాధన మిందునారిది
వ్పుటకును మూఁడుచందములు చొప్పడు నిప్పుడ విప్పిచెప్పెదన్. 163

చ శర మదివోసి పింజె సగసం బెనువ్రేలు గుణంబు మీఁదుగా
నరుదుగ వాంచి తర్జని శరాధర మూనఁగ బొట్నవ్రేలిపై
పరువము మీఁదుగా గుణముపై నెడమం గుడి మూఁడు దిక్కులం
బరువడి నూనవయ్యె సరిపట్టును లోవెలిపట్టు లిద్ధరన్. 164

క. రెండవకణు పంగుష్ఠము
రెండవకణుపుపయిఁ దేజరిల శింజినిపై
నుండును జుట్టన వ్రే ల్తుదఁ
జండతర స్ఫూర్తిగలుగు సరిపట్టునకున్. 165

గీ. గుణము పెను వ్రేలి మొదలిటి కణుపుమీఁదఁ
గూర్చు కతమునఁ గొలఁది కంగుళము వాసి
పొడవుగల సాయకం బిట్లు దొడఁగవలయు
పదిల మగు నంగుళిత్ర మిప్పట్టునందు. 166

క అంగుష్ఠాగ్రంబు ద్వితీ
యాంగుళ మధ్యమున మధ్యమాంగుళ మెడఁగా
సంగత మగు జుట్టన వ్రే
లుం గొన గుణ మీవలఁ దనరు లోపట్టునకున్ 167

గీ. వసుధ వెలిపట్టు లోపట్టువలె నెసంగుఁ
గాని యంగుష్ఠనఖరంబు గానుపంచు
నించుకేనియు తనకునై యిది విశేష
మరయ సకలాంగుళిత్ర యోగ్యములు రెండు 168

చ ఇట్టు లరాళహస్తమున నేడ్తెఱ న మ్మరివోసి తీయుచున్
జుట్టన వ్రేలి కవ్వలన సొంపులు గుల్కెడు నంగుళిత్రయం
బెట్టుల మొప్పు మీఱ నిసుమేనియు రాలక యుండునట్లుగాఁ
ట్టఁదగున్ శరంబు తెగఁబాపిన గుప్పున విప్పఁగాఁ దగున్ 169

వ. కర్తరీహస్తంబున ధనురాకర్షణం బెట్టిదనిన 170

గీ ఖగ మదికి మధ్యమాంగుళాగ్రంబు పింజె
వలపలిగ నారిలోపల వాంచి గుణము
మీఁదుగా నంబు తర్జని మెట్టఁ దనరు
కర్తరీహస్తమునఁ దదాకర్షణంబు 171

క సరిపట్టున నంగుష్ఠో
పరిభాగము సరస గుణముపై తర్జని మో
మరవాంచి మోపఁగా నగు
నరయఁ దదాకర్షణంబు హంసముఖమునన్ 172

మ అనురాగమ్మున నీకు నీగతి సఖండాఖండభావోల్లస
ద్ధనురాకర్షణ సుప్రశ స్తములు హ స్తమ్ముల్ నిరూపించితిన్
విను వా లమ్మరివోయు మూలము ధనుర్వే దానుకూలంబుగా
వినుపింతున్ జమదగ్నిరామకరుణావిర్భూత బోధంబునన్ 173

వ బాణగ్రహణహ స్తనిరూపణము 174

గీ. హంసముఖము శిఖర మను హ స్తయుగళంబు
తూణముఖమునుండి బాణ మెడలఁ
దివియుటకును ధాత్రిఁ దివురు హ స్తము లంచు
నస్త్రశాస్త్రవిదుల కభిమతంబు 175

వ అందు హంసముఖహ స్తలక్షణంబు నిరూపితం బయ్యె. శిఖర హ స్తం
బునకు లక్షణంబు నిరూపించెద నాకర్ణింపుము 176

క అంగుష్ఠం బెడగా నిత
రాంగుళులన్ వాంచి పట్టి యన్నాల్గిటపై
శృంగాకృతిఁ జక్కనఁగా
నంగుష్ఠము నిలుప శిఖరహ స్త మనఁ దగున్ 177

గీ హంసముఖహ స్తమున దొన సమరుచున్న
కాండ మెడలంగ దివుచుట కలము పట్టు
సమధికస్ఫూర్తి శిఖరహ స్తమున విశిఖ
మిషుధివెడలంగఁ దివుచుట యీాటెపట్టు 178

మ కనదూర్ధ్వాధరభావముష్టికలనాకర్షంబులన్ దోషముల్
గని విన్నాణమునన్ శరాసనము జాగ్రల్లీలచే వామము
ష్టిని గీలించి శరంబు లాఘవమునం జే నొయ్యనం బూని శిం
జిని యొక్కించుక లాగి పుంఖ మదుకన్ జెల్వొందు సంధానమున్

గీ అదికి గుణముపైఁ బింజకు నవల నివలఁ
దర్జనీ మధ్యములఁ బట్టు దార్ఢ్యవలయు

నట్లు గానింప గుణము నోరారఁ బింజ
గఱచుఁ గఱచి నశరము పొంకముగ నడచు. 180

క. ఈరీతిఁ బుంఖ మదుకక
బీరమ్మున నదికెనేని పింజ గుణమునన్
జారున్ జారక నిలిచిన
వారక తెగగొనిన శరము వడవడ వణఁకున్ 181

క. పింజమొగమ్మున కొలఁదికి
శింజినిలో వెలితిఁ జూప జిరజిర దిరుగున్
రంజనసెడి లక్ష్యంబున
కుం జొరక కదంబకంబు గుణరత్ననిధీ. 182

గీ. కణఁక బాలుండు బిట్టున బెణక నీక
కాండ మరివోయఁగా నగు గాఢలీలఁ
బోతుటీఁగయు వ్రాలిన పుంఖమెడలి
సడలి పడనగుఁ దెగవాపు సమయములను 183

క సాయక మదికెడువేళ ను
పాయంబునఁ బుంఖ మెడమభాగంబునకుం
బాయక త్రిప్పిన విశిఖం
బాయతుకున గుఱికి నుఱుకు నటునిటు సోరకన్, 184

క ఎడమకు నటువలెఁ ద్రిప్పిన
కుటికే ల్ప్రథమాంగుళమునకుం దర్జనికిన్
నడుమను నెడ మిమ్మడి గు
మ్మడివిత్తుం బోలి హాలి మలయన్ వలయున్ 185

క. దాపలి ముష్టిని నెలకొను
చాపము లస్తకము నడుమ సరవిన్ జూడ్కుల్

ప్రాపింపఁగ వలపలిచెయి
లోపలికిం ద్రిప్ప శరము లోలత నడుచున్. 186

క ప్రక్కలు చెక్కలు దృక్కులు
చక్కనగా నిలుచునేని చాపము నడుమన్
గ్రక్కున విశిఖపుఁదాఁకున
మొక్కలమున మూఁడు దోషములు ప్రభవించున్ 187

గీ. పింజ సోకినఁ మచ్చుఁ బ్రాపించియుండు
కన్నుసోకిన రాపిడిఁ గలిగియుండు
ఘోరపుటలుంగు సోఁకినఁ గోఁతగలుగు
తివిచి వలచెయ్యి లోనికిఁ ద్రిప్పరాదు 188

వ మఱియు నీయాకర్షణహస్తచతుష్టయంబునకు సప్తస్థానంబులు గల
వాకర్ణింపుము. 189

మ. బొమ లిమ్మైన నధరాధరాధరతలంబున్ దక్షిణశ్రోత్రమూ
లము వక్షం బపసవ్యజత్రుభుజమూలద్వంద్వమున్ మీసముల్
సముదారస్థితి బాణహస్తనియత స్థానంబు లందున్ నితాం
తము రాణించు ధనుర్ధరాభిమతమై స్థానత్రయం బిమ్ములన్ 190

క. వలజత్రువు వలపీనున్
మలయక చిబుకాధరముల మధ్యంబును రా
జిలుచుండు బాణహస్తపు
నిలుకడకున్ ధాత్రి మాననీయములనుగున్ 191

క. ముష్టిత్రితయంబున నొక
ముష్టిన్ వంశభవచాపముం దాల్తురు స
ద్దృష్టిన్ దక్షిణజత్రుస
మష్టిం గటకాముఖాఖ్య మగు హస్తమునన్ 192

మ కర్ణాభ్యర్ణము సోక గాఢధనురాకర్షంబు గావించుచో
నిర్ణీతస్థితి దక్షిణేక్షణతటిన్ నిల్పం దగున్ నిల్పి త
త్కర్ణప్రాంగణ మంగుళిత్ర మొఱయంగా నమ్మదిం బాపినం
దూర్ణంబై నడచుం శరవ్యమునకుం దూరం బుదారోద్ధతిన్ 193

క ఆకర్ణాంతంబుగ ధను
రాకర్షణమునఁ గదంబ మగ్రము వెలిగా
నాకృష్ట మగుట నగుదూ
రాకలనంబునకుఁ జూడ్కి యమరుం దిరమై 194

గీ వామభుజకూర్పరంబున వంపు దీర్చి
గాఢముష్టి ధనుర్హస్తకం బమర్చి
దృష్టి కార్ముకముష్టిపై ధృతిని గూర్చి
రహిఁ నిలుప నొప్పుఁజుబుకాధరముల నడుమ. 195

క విను చుబుకాధరమధ్యం
బున శింజిని నిలుప దీర్ఘములు హ్రస్వములై
తనరెడు బహువిధ శరములు
నిలుపందగుఁ బగలు రేయి నెలకొను హాయిన్. 196

వ వెండియు దక్షిణశ్రుత్స్థానంబు వంశభవ ధనురాకర్షణంబునం బాణహస్తక్షేత్రంబై యుండు కర్ణాభ్యర్ణంబును, చిబుకాధరమధ్యంబును, శార్ఙ్గాకర్షణంబున, బాణహస్తక్షేత్రంబై ప్రవర్తిల్లుచుండు వెండియు, నాకర్షణంబున గుణదోషంబు లేర్పరించెద నాకర్ణింపుము.

సీ పలుమొన లధరంబుపై సూనగా రాదు
ముసుకొని కనుబొమల్ ముడువరాదు
మెడ వంచుకొని గ్రుడ్లు మిణుకరించఁగ రాదు
దీమసంబున నోరు దెఱవ రాదు

హాళాయలుగా వక్షమ్ము బయలు చూపఁగరాదు
గడ్డంబు వెలిగడ నిడ్డఁగాదు
నిశ్వాసపవనంబు నిగుడింపఁ గారాదు
చిత్త మొండొకచోటఁ జేర్ప రాదు

గీ. కీళ్ళనరములు బిగువు సోకింపరాదు
వామభుజకూర్పరంబును వంపరాదు
నిలిచి తివుచుచు నెడ నెడ నిలుపరాదు
నరుఁడు బాణాసనాకర్షణమ్ములందు 198

మ. శరసంధానవిధానతానకములన్ సంధిల్లు నిర్దోషముల్
పరిభావించి ధనుఃకళానుకలనాభాస్వన్మనోవృత్తియై
శరసంధానవిమోచనమ్ముల విశేషంబుల్ పిసాళింపుచున్
నరుఁ డానందము నొందుచుండు ధరణీనాథుల్ ప్రశంసింపఁగాన్ 199

వ. ఇట్లు శరసంధానంబునుం ధనురాకర్షణంబునుం బసమించు నింక శరం బాకర్షించుచో వామముష్టిపై నాఱుచందంబుల నిలుపందగు నట్టి నిలుకడలకుం దగిన స్థానంబులును అట్టి స్థానంబుల విలిపినం దనరు విశేషంబులును వివరించెద నాకర్ణింపుము 200

సీ. అలుఁగు లస్తకమున కవలఁ జిక్కఁగఁ జాప
మోజ నాకర్షించు టొకవిధంబు,
ఒకపాలు వెలిని లస్తకములో నలుఁగు గా
నోజ నాకర్షించు టొకవిధంబు,
సాబాలు వెలిని లస్తకములో నలుఁగు గా
నోజ నాకర్షించు టొకవిధంబు,
శరముఖం బవల లస్తకమంతయును జిక్క
నోజ నాకర్షించు టొకవిధంబు,

ఆ. కణఁకఁ బెనువ్రేలి రెండవ కణుపు మీఁద
నొకట నలుఁ గూనగా దివ్చు టొకవిధంబు

ఆకర్ణువు లోనుగా నలుం గమరఁ దివిచి
యోలి శరమోచనము సేయు టొకవిధంబు. (౨) 200

సీ. క్రందుకయ్యములందుఁ గడిఁది వేఁటలయందుఁ
బ్రథమ ద్వితీయముల్ పరగుచుండు,
ద్వంద్వయుద్ధములంచుఁ దరల కేయుటలందు
బాగై తృతీయంబు ప్రబలుచుండు,
దూరపాతములందుఁ దూఁగ నేయుటలందు
మించు తురీయంబు పంచమంబు,
దూరలక్ష్యములందు దూయనేయుటలందు
సముచితంబై షష్ఠమమరియుండు

గీ. తెగువ బాణముల్ ప్రథమ ద్వితీయములను
దక్కఁ దక్కిన నాల్గిటఁ దగదు తెగువ
బాణములు దక్కఁ దక్కటి బాణసమితి
యాఱు దెఱఁగులఁ దెగ వాపనగు నరుండు. 201

వ. విను మియ్యాఱు తెఱంగులం దృతీయంబగు విధంబు శరాగ్రంబునకు లస్తకంబు సాబాలు వెలి నుండుటం జేసి పురఃప్రేరణంబున కనుగుణంబగుట శరంబు సత్వరంబై నడచుం గావున ధనుర్ధరభావజుష్టంబై యుండుఁ దురీయపంచమ ప్రకారంబులు పురః ప్రేరణార్హంబులు గాకుండియు నలుంగు లస్తకంబులోఁ బడంగాండంబు నిండారం దివియం బడుం గావున దూరాపాతనంబున కనుగుణంబులై యుండు షష్ఠప్రకారం బంగుష్ఠంబు రెండవ పర్వంబులోనికి నలుంగు దివియం బడుటం గొండొకసమయంబున, లస్తకాంగుష్ఠంబులకుం బ్రమాదం బాపాదించుం గాని సరకుఁగొనక యభ్యాసబలంబునం గుశలుఁడగు నరుండు దూరస్థంబగు లక్ష్యంబు భేదింపఁ దమకించునెడ నిత్తెఱంగునం దివిచి తెగవాపంజూచు నీయాఱు తెఱంగుల మెఱుంగు లంతరంగంబునఁ దరంగితంబులుగాఁ బరిగ్రహించి ధనుర్ధరకులావతంసుండవగు మన పలికి మఱియు నిట్లనియె 202

సీ. కడిమి నూర్ధ్వాధరాంగములు కార్ముకమున
కెఱఁగి వక్కాణింప నేమి ఫలము,
ముష్టి భేదముల నిమ్ముగ శరాసనమధ్య
మెడపక ధరియింప నేమి ఫలము,
స్థానప్రతిష్ఠాన తానకంబుల లక్ష్య
మెడపక నెదిరింప నేమి ఫలము,
సాయక మరివోసి చాప మాకర్ణాంత
మెలమి నాకర్షింప నేమి ఫలము,

గీ. ఆత్మమానసవృత్తితో నాకలించి
మానసము చూడ్కితో నేకధా నయించి
కదలఁగానీక చూడ్కి లక్ష్యమున నుంచి
మొనసి విశిఖమ్ము గుఱితుపై నిలుపఁడేని 203

సీ కలశమధ్యగదీపకలికాంకురము లీలఁ
దలపు నిశ్చలముగా నిలుప వలయు,
నంతకంతకు నంతరాంతరాళంబున
నింపు దీపింప రాణింపవలయు,
గజముపై గమకించు కంఠీరవము భాతి
చాపయష్టిని మేను డాప వలయు,
సారిది డాపలి కంటి చూడ్కి కార్ముకమధ్య
మము దాల్చి ముష్టిపై మనుపవలయు

గీ కడిఁది కుడికంటిచూడ్కి పుంఖమున కలుఁగు
నకును లక్ష్యప్రదేశంబునకును సమము
గాఁగఁ బరగింపఁగాఁ దగుఁ గౌశలమున
శరము లరివాపు నెడలందుఁ జాపధరుఁడు. 204

క. సాదులకు నిషాదుల కరి
భేదులకు మృగాదులకును బెనుపుగ నిలుపం

గాడట్టిచూడ్కి యచలము
భేదిల నేయుటకుఁ దక్క భీషణమూర్తీ 205

గీ. మాట లిఁక వేయు నేటికి మానసంబు
చంచలించినఁ జూడ్కియుఁ జంచలించుఁ
జూడ్కులు చలింప లక్ష్యంబు సొరదు శరము
శరము లక్ష్యంబు సొరదేని జాఱు యశము. 206

వ. ఇట్లగుటఁ దదేకధ్యానంబున నిశ్చలమనస్కుండై పూర్వోక్తప్రకారం బున యథాస్థానంబులఁ జూడ్కులు నిగుడింపుచు దృఢముష్టి సంధా నలాఘవంబుల శరమోక్షణం బాపాదించి లక్ష్యశుద్ధిం గాంచి శర దిందుచంద్రికాసుందరంబులైన యశఃకందళంబులు హరిల్లతాంగు లకు మేలుముసుంగులై మెఱుంగులు తుఱుంగలింప నుభయకుల వర్ధనుండవై వర్ధిల్లుము. 207

క శరపుంఖోద్వేజనమును
శరమోక్షణ లక్షణంబు శరమోక్షానం
తరమ్మునఁ జాపోత్సరణం
బరయుం దగు మూఁడు తెఱగు లవి యెట్లనినన్ 208

శా ఆకర్ణాంతము కాండముం దివియుచో నర్ధాంగుళం బాశుగం
బేకస్ఫూర్తిని లోనికిం దిగిచి లా వెక్కించి యిట్టట్టునుం
పైకిం క్రిందికిఁ దీక పుంఖము బిగింపన్ నిశ్చలంబై రయో
ద్రేకం బొప్పఁ గదంబకంబు నడచున్ ధీరుల్ ప్రశంసింపఁగాన్.209

వ అందొక్క విశేషంబు గలదు 210

క. ఎడనెడ నెడమకుఁ గుడికిన్
వెడవెడ నుబికించు నేని శిఖము నడుమన్
దడఁబడి సుడిఁబడి బడిబడి
వడిసెడి యెడపడనిజడిమ వడవడ వడఁకున్ 211

చ అటులు బిగించి పుంఖమున కావలి యీవలియంగుళంబు లొ
క్కట వదలం దగుం జులకగా వదలం గమకింపకున్నచో
బొటమనవ్రేల నందముగఁ బొంకెసలారెడు నంగుళిత్రముం
దటుకున జాఱు మౌర్విబలుతాఁకున వీడి ధనుఃకళానిధీ 212

క ముష్టిం బ్రథమము తాన స
ముష్టిం జక్కందనంబు మానక ధనురా
కృష్టిం గాఢోల్లసనము
దృష్టిన్ నిలుకడయు భాగధేయము లనఘా. 213

వ అట్లు ప్రథమోద్దిష్టంబులగు పుంఖోద్యోజనంబు వివరింపంబడు నింక ద్వితీయోద్దిష్టంబగు శరమోచనలక్షణంబు వివరించెద నాకర్ణింపుము.

క శరమోక్షణసమయంబున
నురుశక్తిం జాపముష్టి నుబికింపఁ దగున్
బొరిబొరి నిరుగడ తెక్కలు
తరతరమున నొకటి కొకటి తటిఁదటి నొరయన్ 215

గీ సంతతాభ్యాసవశమున శస్త్రధరుఁడు
చాపముష్టియు బాణహస్తంబు నొకటి
నెమ్మి నుబికించి యేసె నేనియు శరంబు
దూరతరలక్ష్యముల మీఁదఁ దూఁగు నిజము 216

వ తృతీయంబగు చాపోత్సరణంబు వివరించెద నాకర్ణింపుము 217

క ప్రబలు శరమోక్షణంబున
నుబికించిన చాపముష్టి నొగి జాడింపన్
సబలంబై మార్గణమున్
నిబిడతరస్థిరశరవ్య నిర్మథనమగున్. 218

క. బాణ మరివాపి తోడనె
బాణాసనముష్టి వనువుపడ ఝూడింపఁ
బాణము లక్ష్యంబున వి
న్నాణంబుగఁ దెంపుసేయు నయవినయనిధీ 219

వ విను మిత్తెఱంగులు మూఁడునుం ద్విరదరథపదక్రమశరమోక్షణ లక్షణానుగుణంబులు తురగారోహణంబునం ద్వితీయతృతీయ కృత్యంబులు గావింప నలవి గాకుండిన నుపాయంబున నిందొక్కటి యైన నాచరింపఁదగు శరప్రయోగంబుల నిత్తెఱంగు లావశ్యకంబులై యుండు మఱియు నిందుల కనుబంధంబైన విశేషంబు గల దాకర్ణింపుము. 220

ఉ. మానితముష్టి కార్ముకము మధ్యముఁ బట్టిన నేమి సూచిత
స్థానవిశేష భావములఁ దప్పక నిల్చిన నేమి బాణసం
ధాన మొనర్చి మార్వీ విహితంబుగఁ దీసిన నేమి పుంఖమం
దూనినయంగుళుల్ తెగువ నొయ్యన విప్పఁగ లేని వానికిన్ 221

క శరమోక్షణ సమయంబున
వరుసన్ బెనువ్రేలు లాఘవంబున వదలన్
గర మర్థి శరవ్యమునకు
నుసుతరగతిఁ గాండ మొయ్య నొయ్యన నడచున్. 222

గీ. కణఁక నంగుష్ఠ నఖర మాంసముఁ జూడ
రూఢిఁ దర్జనీ నఖరమ్ము రొమ్ము సూడ
నురుక శాఘాతమునకు బిట్టులికి నట్టి
లోలి శరమోచనము సేయు టుచిత మండ్రు 223

వ. వెండియు నొక్కవిశేషంబు గలదు. శరాభ్యాసంబు సేయు విన్నాణులకుం దక్షిణహస్తాంగుష్ఠనఖరంబు మాంసంబునకుం బొడ వునుపఁ దగ దట్లునిచినన్ జ్యాఘాతంబున నఖరం బురియు నట్లగుట సమం

బుగా నిడవలయు నింక శరాభ్యాస మాసవాసర తారకాయోగ కరణ ప్రకరణంబు నిరూపించెద నాకర్ణింపుము 224

మ మును మున్ గార్తిక మార్గశిరమున్ బుష్యంబు మాఘంబు ఫా
ల్గునమున్ జైత్రము మాధవంబు రహిఁ కెక్కున్ జ్యేష్ఠ మాషాఢముం
ధనురభ్యాసకళాకలాప కలనాధారంబులై ధాత్రి నా
య్యన నిమ్మాసముల న్నవాభ్యసన యోగ్యం బంద్రు మాఘంబిలన్.

శా హేలిన్ బ్రాతర ధీతికిన్ హిమజలవ్యాసక్తిచేతోమలం
బై లావూనక శార్ఙ్గముం దివియ నవ్యాభ్యాసికెన్నన్ శర
త్ప్రాలేయంబుల నిమ్ము గాదు ప్రథమారంభోత్సవోత్సాహమున్
వాలాయంబుగ శీతలోష్ణ సదృశవ్యావృత్తి మాఘంబున

సీ. పన్నిదంబున భంగపరచవచ్చినవాని
పన్నిదంబులు దీర్చి భంగపరచు,
కాలత్రయాభ్యాస కలనానుకూలమై
సాహసోత్సాహముల్ సంఘటించు,
కల్పవృక్షము భాతి గామధేనువు రీతిఁ
గామితార్థంబులు గలుగఁ జేయు,
నాఁడు నాఁటికిని విన్నాణంబు దులకించు
ప్రతిభావిశేషంబు పాదుకొలుపు,

తే. నోలిఁ దిథివార తారకాయోగకరణ
వివరణస్ఫూర్తి సుముహూర్తవిహితమహిత
మాఘవాసరభాసుర మంత్రతంత్ర
కలితలలిత ధనుఃకళా కౌశలంబు 227

వ వెండియుఁ బురహర స్కంద పరశురామ ప్రముఖులగు మహాపురుషు లిమ్మాఘంబున ధనుర్విద్యా ప్రథమరంగోత్సవంబు యథావిధిం గావించి దుష్టనిగ్రహ జాగ్ర దవగ్రహ సమగ్రోద్ద్యోతిత హృద్యా

నవద్య ధనుర్విద్యా సముద్యమంబున మాద్యజ్జంభారి స్తంబేరమ
రమాజనక వీచికావిచికల కలహంస హంసరథసతీసతికాముకము
కురబింబానుబింబ యశోవిడంబాడంబర నిరంతర పాండుర ప్రసార
ఘనసార పేటికాయిత దశదిశాభ్యంతరులై దిగంత విశ్రాంతిం
బరిఢవిల్లుటం జేసి మాఘుం బమోఘుం బని ధనుఃకళానియామక
నికరావతంసులగు విద్వాంసులు ప్రశంసితు రింక ధనుశ్శరవ్యాపార
సమయాసమయంబులు నిరూపించెద నాకర్ణింపుము. 228

క. కార్తికమాది దొమ్మిది
కీర్తింపఁగ శార్ఙ్గనిరతికిం దగు నెలలై
వర్తిల్లు వంశభవ ముఖ
లర్తు ప్రతిపాద్య మగుచు లాలింపఁబడున్ 229

క. తక్కిన మాసత్రయమున
నక్కజమున శార్ఙ్గచాప మాకర్షింపన్
జొక్కము గా దలవంశజ
మొక్కటి సకలర్తువిలసనోచిత మనఘా. 230

ఆ. సకలఋతుయోగ్య మయ్యు వంశజశరాస
మంబుదాగమ సమయంబులందు శరము
నడుపఁ జాలదు తామున్ను నడపినట్టు
లరసి తగువేళ ధను వూననగు నరుండు. 231

క. నిద్రాసక్తుని కైవడి
నుద్రేకము సూప దంబుదోదయముద్రా
ముద్రితమై శార్ఙ్గం బను
పద్రవమునఁ బూనఁదగదు ప్రాజ్ఞుల కవనిన్. 232

క. మొక్కల మానిన వంశజ
మెక్కుడి పన్నిదము తీర్పు మొనసినకినుకన్

మిక్కిలి నడువకయును శర
మక్కఱ నెఱవేర్చు నంబుదాగమవేళన్. 233

మ. చను నాషాఢము జ్యేష్ఠమాసమును వైశాఖంబు దూరాభిపా
తనయోగ్యాళుగ సుప్రయోగకలనాధారంబులై చైత్రఫా
ల్గునమాఘంబులు నారసంబులకుఁ జెల్లుం దక్కనుం గల్గుబా
ణనికాయంబులు తొమ్మిదింట నడపన్ నాణెంబులై వర్తిలున్. 234

వ. మఱియు ధనురభ్యాసప్రథమకరణంబులగు తిథివారతారకాయో
గకరణంబులు వివరించెద నాకర్ణింపుము. 235

గీ. మాఘశుద్ధపక్షంబున మలయు నాఱు
బహుళమున నాల్గు దిథు లివి పది శరాస
నూతనాభ్యాసములకు సన్నుతము లయ్యె
వాని వివరింతు వినుము భావజవిరోధి 236

గీ శుద్ధమున ద్వితీయ శుద్ధతృతీయయు
శుద్ధపంచమియును శుద్ధసప్త
మియును శుద్ధదశమి మీఁద త్రయోదశి
యరయ భావుకంబు లైన తిథులు. 237

గీ బహుళమున ద్వితీయ బహుళతృతీయయు
బహుళపంచమియును బహుళసప్త
మియును వరము లనుచు నియమించి రిద్ధను
రాగమజ్ఞులైన యస్త్రగురులు 238

గీ వారములను మూఁడు వారము ల్కార్ముక
ధారణానుగుణములై రహించు
భానువాసరంబు భార్గవవారంబు
గురునివాసరంబు గుణపయోధి 239

సీ. ధీరసమ్మతమైన తిథిని విల్లుధరించు
వారికి నసమాన వైభవంబు
ప్రతిహితంబైన వారమున నారంభించు
వారికి నాయుష్యవర్ధనంబు
శుభతార నిష్వాసము భజింప గమకించు
వారికిఁ గలిదోషవర్జనంబు
సద్యోగమునఁ గార్ముకోద్యమంబు ఘటించు
వారి కామయవినివారణంబు

తే. నమరు శుభకర కరణంబులందు రంగ
మంగళస్థానతానకాసంగచంగు
లగు మగల డెందముల కందమై తనర్చు
గాఢతరసౌఖ్యలాభంబు గలుగు చుండు 240

వ. ఇట్లు తిథివారతారకాయోగకరణంబులు ప్రవర్తిల్లు నింక రంగప్రకారంబునుతదనుబంధంబులగు విన్నాణంబు లుపన్యసించెద నాకర్ణింపుము.

క. ఈ విలువిద్యకు సాధన
మై విబుధ జనాభినంద్యమై యస్త్రపరీ
క్షావిలసన విహితంబగు
నావరణము రంగ మనఁగ నవనిం బరగున్ 242

ఉ. రంగముఖానుకూల చతురంగము రాజితరాజరాజసా
రంగము దర్శనోత్సవతరంగము కార్ముకవేదసారపా
రంగము విస్ఫురచ్ఛర కురంగము ధారుణిపై ధనుఃకళా
రంగము విద్యకుం బ్రథమురంగము రంగు లెసంగ నర్జునా 243

వ. అట్టి రంగంబునకు నంగంబులై ప్రమాకరణంబును, మదుత్తరణంబును, సమి కరణంబును, విరజీకరణంబును, బరిష్కరణంబును నాఁ బ్రసిద్ధంబులైన నామంబులం బంచసంస్కారంబులు ప్రవర్తిల్లు

చుండు, నట్టి సంస్కారపంచకంబునకు లక్షణప్రపంచంబు వివరించెద నాకర్ణింపుము. 244

సీ. దక్షిణపశ్చిమోత్తరపూర్వదిగ్విభా
గములు గూర్చుట ప్రమాకరణ మండ్రు
అస్థికంటకశిలాహతి దీఱ ధారుణీ
స్థిరశోధనము దురుత్తరణ మండ్రు
పల్లములో మెఱక లేర్పడనీక చదరంబు
గావించు విధి సమీకరణ మండ్రు
అడుగుతాఁకున రజం బదరకుండఁగ ధరా
ఘట్టనము విరజీకరణ మండ్రు

గీ. ద్వారసీమలఁ బచ్చలతోరణములఁ
గూర్చి ముత్యాలసరుల ముగ్గులు ఘటించి
ప్రతిదినము ధూపదీపాదిబలివిధాన
కల్పనానల్పవిధి పరిష్కరణ మండ్రు 245

క రంగవిధానంబున కివి
యంగోపాంగంబు లని శరాసనగురుశి
క్షుం గల శాసన మిట వీ
నిం గూర్పక మెలఁగవచ్చునే రంగమునన్. 246

గీ అన వినుచుఁ బార్థుఁడిట్లను నతనిలోడ
కలశభవ పంచసంస్కారములు ఘటింప
కున్న నే మేమి దోషంబు లొదవుచుండు
ననఁగ నతనితో నిట్లను నస్త్రగురుఁడు. 247

ఉ. ఆయము లేని గేహము సహాయము లేని చిరప్రవాస మా
దాయము లేని బేర ముచితజ్ఞత లేని ప్రధాని యౌవన
ప్రాయము లేని లేమ రతిభావ మెఱుంగని పల్కు విక్రమో
పాయము లేని రాజు సిరిఁ బోటికి నెక్కునె వత్స ధారుణిన్ 248

క. ప్రస్తారలక్షణక్రమ
విస్తారంబై దిగంత విశ్రాంతధను
ర్వ్యాస్తప్రమాకరణవిధి
శస్తంబై తనరు సకలజనసమ్మతమై. 249

గీ కంటకాస్థిశిలావళీకలితమైన
ధరణితలమున నడుఁ గూన దరముగామి
గని దురుత్తరణాఖ్యసంస్కార మెలమి
నిర్ణయించిరి కార్ముకనిగమవిదులు 250

వ. అదియునుం గాక 251

ఉ. కీకస లోష్ట లేశములఁ గిల్బిషభావముఁ గాంచు రంగధా
త్రీకటకంబు దాన నియతిం గొనరాదు మహాస్త్రశస్త్రముల్
దీకొని యస్థిలోష్ట వితతిం దెమలించిన రంగ ముజ్జ్వలం
బై కనుపట్టు దానఁ గొనునస్త్ర మభీష్టఫలప్రదం బగుణ్. 252

గీ. ఒడ్డగెడవైన రంగమధ్యోర్వి ధన్వి
స్థానపంచకమున నడు గూన కునికి
గని సమీకరణాఖ్యసంస్కార మవని
నామతించిరి ధనురాగమార్గవిదులు. 253

గీ. అడుఁ గుతాకున భూరజం బడలి మేన
సోఁకెనేనియు ధన్వికి సొలపు పుట్టు
గాన విరజీకరణపరిష్కార మవని
నెఱపి రస్త్రశస్త్రాగమనిగమవిదులు 254

క జగతి నరిష్టనివారక
మగుటఁ బరిష్కరణవిధి మహార్హం బనుచున్
నిగదించిరి వరకార్ముక
నిగమపరిజ్ఞానఘనులు నేర్పుదలిర్పన్ 255

వ అట్టి ధనుఃకళారంగంబునకుం దగినవిధానం బాకర్ణింపుము 256

గీ. ఎలమి నిన్నూఱుబారలకొలఁదిఁ బావ
నావనీస్థలిఁ జతురస్ర మాచరించి
కిరణపరిణతమణిగణఘృణివిచిత్ర
కనకవరణంబు నలుగడఁ గడలుకొలిపి 257

క. పంకరుహనాభ శంకర
పంకరుహాసన కళానుభావోజ్జ్వలమై
పొంకము గులుక యథావిధి
శంకుస్థాపనము సేయఁ జను మధ్యమునన్ 258

వ తదనంతరంబ 259

గీ, హరిహరహిరణ్యగర్భుల నభినుతించి
ధరణిఁ బూజించి దిగ్దేవతావతంస
ములకు నంజలిఁ గావించి మొదలిచాప
ధరులచెలువంబు హృదయపద్మమునఁ దలంచి 260

సీ. వల్మీకతరులతాగుల్మము ల్మాయించి
కుద్దాలముల ధాత్రి గుద్దలించి
కంటకాస్థిశిలాప్రకాండంబు లెడలించి
గరిమతోఁ జదరంబుగా ఘటించి
కొటిశమ్ముల ధాత్రిఁ గొమరార ఘట్టించి
చెన్నారు పన్నీరు చిలుకరించి
ప్రేక్షాలయమ్ములఁ బెలుచ శృంగారించి
సింహాసనములు సజ్జీకరించి

గీ. కడిది గొడుగులు పడగ లుగ్రంపుటాల
వట్టములు చామరంబులు వఱలఁజేసి
మేలిబంగారు రంగారు మెలపుఁ గొలుపు
కంబములడంబముల మంచకము లమర్చి 261

క, ద్వారములు నాలుగును బం
గారపు గడపలను వలను గరగరికల శృం
గారములు గులుకఁ బచ్చల
తోరణములు గూర్చవలయుఁ దొలుతొలుత రహిన్. 262

మ. ప్రకటస్ఫారగభీరనీరపరిఖా ప్రాకారమున్ హైమమం
చకముల్ కాంచన చిత్రవప్రవలయాంచత్ప్రేక్షణాగారమున్
సకలాశాధిగమాతివిస్తరవిరాజద్గోపురాట్టాలక
ప్రకరంబుల్ సుకరంబులైన ఖురళీరంగం బెసంగన్ రహిన్. 263

వ. ఇవ్విధంబున నంగప్రత్యంగసంగతంబుగా ఖురళీరంగంబు నిర్మింపంజేసి చందనాగరు పరిమళ ఝులఝులంబులగు జలంబులు కలయం జిలుకరించి ముక్తాఫలరంగవల్లికావిన్యాసంబుల భాసమానంబు గావించి శాంతికబలివిధానహోమంబుల రామణీయకం బాపాదించి గంధపుష్పాక్షత ధూపదీపాదిసంస్కారంబులఁ బరిష్కారణంబుఁ గావించి దేవతాయతనంబులకుం బోలె నసంస్కృత సంపర్కంబు దొరలనీక దౌవారికులవలన నహోరాత్రంబును సురక్షితంబుఁ గావించి యథాసూచిత మాస వాసరాది స్ఫూర్తంబగు సుముహూర్తంబు నిశ్చయించి యిష్టదేవతానుస్మరణ పూర్వకంబుగాఁ బర్యంకంబు డిగ్గి దంతధావనజిహ్వానిర్లేహనగండూషముఖప్రక్షాళనతైలాభ్యంగోద్వర్తనగంధామలకసురభిళ జలావగాహనంబులఁ బరిశుద్ధుండై ధౌతకౌశేయంబులు ధరియించి మణిగణ స్థగిత కటక కాంచీ ప్రముఖంబుల నలంకృతుండై కస్తూరికాతిలకంబు లలాటంబున వాటంబు గులుకఁ గాలాగరుధూపంబులును మాల్యాంగరాగ ధారణలేపనంబులును లోనుగా సుచితాధివాసనంబుల భాసమానుండై మహోత్సాహంబున.

సీ కలధౌతజలజాత లతికాతరళికాత
పత్రంబు లోకచాయఁ బరిఢవిల్ల
కలనాదముల భేదముల మోదముల నూద
గలవాదకులవాదికలు ఘటిల్ల

పగడంపు జగజంపు నిగరంపు జిగిపెంపు
లోఁగి నింపు మేల్కట్టు లుల్లసిల్ల
పటువీరభటవార చటులారభటి మీఱ
పటహారవము లోలిఁ బరిఢవిల్ల

గీ. చోళనేపాళపాంచాల గౌళమాళ
వాంగవంగ కళింగ కర్ణాట లాట
పాండ్యకొంకణకుంకణ ప్రముఖ సుముఖ
నరవరకుమారకులు గొల్వ నగరు వెడలి 265

సీ. సవయస్కు లుత్సాహసహితులై యొకచాయ
భావరంజనముగాఁ బలుకరింప
భూసురాగ్రేసరుల్ భాసురోల్లాసులై
సమధికస్వస్తి ఘోషము ఘటింప
వందివైతాళికవ్రాతముల్ కెలఁకుల
విజయాంకబిరుదముల్ విస్తరింప
గణికావతంసముల్ గానమానంబుల
గరగరికలఁ గుఱంగట నటింప

గీ. పణవకాహళతమ్మట పటహశంఖ
వేణువీణామృదంగాది వివిధవాద్య
ధీంఘుమఘుమధ్వానంబు దిశల నిగుడ
రమణ నరుదేరఁగా నగు రాజవీథి 266

వ. వెండియు నాఖండల శుండాలశుండాదండసముద్దండతర భుజాగ్రజాగ్ర
న్మండలాగ్రమహోగ్రధారాధారాళధారాధరధారాసంపాతభీ
తరిపువ్రాతచేతస్సరోజాతులగు పదాతుల మొత్తమ్ముల చిత్త
మ్ము లనునెత్తమ్ము లుత్సవరసాయత్తమ్ములై క్రొత్తలగు నుత్త
లమ్ముల సరిహత్తిన కత్తళమ్ముల ఘణఘణత్కారమ్ములు ధీర
మ్ములై శ్రవణమ్ములకుం బ్రవణమ్ములుగా రవణించిన నురవణిం

చుచుం బరవాహినీమదకల కలభావలగ్న పరివారిత ఘంటికానిక్వాణంబులను బుద్ధిం దలంగక చెలంగెడు మాతంగమ్ముల యంగమ్ములం గడలుకొను మదసలిల ధారాపూరమ్ముల రొంపులగు నిలాతలంబులం జిలిబిలి నలమికొను ప్రత్యగారద్వారస్ఫాటితసురచిర తర మరకత మణిగణకిరణకలా కలాపమ్ములు సురూపమ్ములై చూపట్టినం బచ్చికలను మచ్చికలను నిచ్చల విచ్చలవిడి మెచ్చులం గూర్చుచుం గబళింప సంభ్రమించు ప్రతిగృహ సంవర్ధితసారంగ కిశోరమ్ముల విహారమ్ములకు లోచనకుముదమ్ములు వికసింప, భర్మ నిర్మిత నిర్మల హర్మ్యాగ్రమ్ములనుండి యఱ్ఱులెత్తి చూచు పురపురంధ్రీతిలకమ్ముల ముఖమ్ములు సాంద్రతరచంద్రికావికాసమ్ముల కనుప్రాసమ్ములగు హాసమ్ముల భాసిల్లుచు, నిష్కలంక శశాంక సహస్రశంకాస్పదమ్ములగుటకుం గనుకనియనేకభావమ్ముల మూర్తీభవించి యంతరంగమ్ములం దరంగితమ్ములగు నానందరసంబులం బొంగి పొరలు వాహినీ పతులును, వాహినీపతుల కనుసన్నలం గ్రన్ననం గాంచి కాంచన నేత్రమ్ముల శ్రోత్రమ్ములకు మిత్రమ్ములగు వాదిత్రమ్ములఁ జిత్రమ్ములు గులుకు పాత్రమ్ముల నలుగెలఁకులం బలుపలుకులఁ గొలకొలమను కలకలం బాపాదించు పామరనరవ్యూహంబుల మోహారమ్మున నోహరిసాహరి నెడనెడ నెడఁగలుగం జడియువేత్రపాణులును, వేత్రపాణుల ధిక్కారంబులకుం గక్కసంబుల వెక్కసం బందుచు, నొక్కటం ద్రొక్కటపడి మక్కువకాండ్రు దిక్కుమొగమ్ములుగా స్రుక్కి నంగ్రక్కున నక్కునం గదియించినం జొక్కు చక్కెరబొమ్మలును, చక్కెరబొమ్మల విహారమ్ములకు నిమ్మగు ప్రతిభవనపావనవనవాటికాంతర క్రాంతాతాంత లతాంతకాండ కుటజోటజ మరువక కురువక మల్లికావల్లికా సమంజస నికుంజ పంజర పరివృత పరిసర సరోవర వరాంభస్సంజాత కంజాత మంజుల కింజల్కపుంజ రంజిత పింజర రజోవ్రజంబులఁ గడారంబులగు సమీరకిశోరంబుల విహారమ్ములఁ జంచలమ్ములగు నూతనప్రోతనికేతన కేతన పటాంచలంబుల యనుకూల ప్రేరణమ్ములకుం గారణమ్ములగు సమీకరణమ్ములఁ గుశలసూచ

కమ్ములకుం బ్రహర్షించుచు వేదానువాదమ్ముల మోదమ్ములు గూర్చు సాంగవేదులును సాంగవేదుల కుఱుంగటి కిసలయసేవంతికా లవలీ కువలయారవింద నానావిధ కుసుమ విసరంబులును, వివిధ వర్ణంబులగు హారిద్రాది భద్రచూర్ణంబులును, బొంకంబులగు సాంకవ కర్పూరకర్పూర కుంకుమాది సురభిళ భవ్యద్రవ్య దివ్యార్ద్ర చందనపంకంబులును, నూతనంబులగు వజ్రవైడూర్యాది రత్నంబులును, శ్రీలంబులగు కాంచనదుకూలంబులును, బరిమళోదారంబులగు జలపూరంబులును, లోనుగాఁ బ్రశస్తవస్తు సంఘాతంబులకుం బాత్రమ్ములగు కనకపాత్రమ్ములు కరతలంబుల నమర్చికొని, మాంగల్యగానంబుల వీనులకు వినోదంబులు గూర్చు భూసురపక్ష్మలాక్షీ నికరంబులకుం దరణికిరణప్రసారంబులు సోకనీక శరచ్చంద్ర చంద్రికాభంబులగు నుల్లాభంబులం బట్టిన పరిచారక నివహంబులును, బరిచారకనివహంబులకుం బురస్సరులై సమవయస్కులగు రాజనందనులిరుగెలంకులం గొలువ నగ్రభాగంబున మాల్యాంబరాభరణ భూషితుండును, శిరస్త్రాణ తనుత్రాణతలత్రాణ కలితుండునునై కనత్కనకమణిగణ కలాకలాపంబులగు శరచాపంబులు ధరియించి, మదకలశుండాలంబు లీల మందయానంబునన్ ధనురాచార్యుండు నడువ నుదంచితోత్సాహంబునం బొదలుచు, నఖండితాఖండల వైభవంబున ఖురళికారంగద్వారంబుఁ జేరంజని, పరిఖాపరివారిత తప్తకార్తస్వర భాస్వర వరణంబును, మరకతమణిఖచితమంచక శ్రేణీ సముదంచితంబును, లంబమాన ముక్తాఫల మంజరీ సమంజసోల్లాభ శోభితంబును, తరుణారుణ కిసలయతోరణ స్ఫారితచతుర్ద్వారంబును నిరంతరాలేపిత ఘనసార చందనాగరు పరిమళ ఘుమఘుమితంబునునై, విలసిల్లుచు సదాశివస్థానంబు లీల సర్వమంగళాభిరామంబై, రామవిజయంబు లీల సుమిత్రానందనాశ్రయంబై, సరోవరంబు లీలఁ బద్మరాగోపశోభిత భువనంబై, శింశుమారంబు లీల సూర్యావరణీయంబై, యలకానగరంబు లీల రాజరాజాభిరక్షితంబై, మెఱుంగులు తుఱంగలించు రంగమధ్యంబుఁ బ్రవేశించి వేదవేదాంగాది

హృద్యానవద్య విద్యానుద్యోతిత ప్రశంసులగు విద్వాంసులును, గావ్యనాటకాలంకారధోరణీ పరిణతానల్పకల్పనానుభవులగు మహాకవులును, భాసురేతిహాసోపన్యాస వ్యాసోద్భాసిత వాణీ శ్రేణికులగు పౌరాణికులును, నిరతిశయరాజ్యలక్ష్మీ సమాగమ కళానుబంధులగు బంధులును, ధీమంతులగు సామంతులును సంధి విగ్రహ యానాసన ద్వైధీభావ సమాశ్రయణాభిధాన షడ్గుణ యథాను సంధాన పరికర పరతంత్రులగు మంత్రులును, ఘనసయదేశీయ భేదాపాదిత హృద యంగమ సంగీతగోష్ఠీ విధాయకులగు గాయకులును, నానావిధ జాతీయకథాసూచకులగు పరియాచకులును, శ్రోత్రపుటైకపాత్ర కథాస్పందులగు వందులును, సముచితాస్తరణంబులం బరివేష్టింప నగ్రభాగంబున మణిఖచిత కాంచనపీఠంబున నాచార్యు నాసీనుం గావించి తానును బవిత్రాస్తరణంబునం బ్రాఙ్ముఖంబుగా నాసీనుండై కల్పోక్త మంత్రతంత్ర ప్రయోగకలనా సమాహితులగు పురోహితు లిరుగెలంకులం గలసి పూజోపకరణంబులగు చందన కుసుమతాంబూలాది భవ్యద్రవ్యంబు లుచితప్రదేశంబుల నమర్చి, పవిత్రాస్తరణంబున శరశరాసనంబు లునిచి వినాయక ప్రార్థనా పూర్వకంబుగాఁ బుణ్యాహవాచనంబు సలుప దానును సమాహిత మనస్కుండై మఱియును 267

ఉ వాసవుఁ డాదిగా ఖచరవర్గ మనర్గళభక్తి నిన్నుఁ గై
సేసి నిరంతరాయమునఁ జేకొనుచుండుదు రీప్సితార్థముల్
దోసిలియొగ్గి నిన్ బ్రియముతోఁ దలతున్ గొలుతున్ ధనుఃకళా
భ్యాస మనంతరాయముగఁ బాటిలఁ జేయఁగదే గణాగ్రణీ 268

గీ అని వినాయకుఁ బ్రార్థించి యష్టదిశల
నమరు నింద్రాగ్ని యమ నైరృ తాబ్ధిరాజ
పవన యక్షరాట్కైలాసపతుల నామ
తించి కల్పోక్తవిధులఁ బూజించి మఱియు, 269

సీ. ప్రతిభానుభావ మేర్పడఁజేయుమీ సురరాజ
భవ్యముల్ గూర్చుమీ హవ్యవాహ,
ధర్మానుకూలచింతన లిమ్ము సమవర్తి
యపయోగములఁ బాపు యాతుధాన,
యొడల మహోత్సాహ మొసఁగు మంబుధిరాజ
కౌశలం బొసఁగుమీ గంధవాహ,
నవనవోల్లాసంబు నసుచు మీ నరవాహ
వాంఛితార్థము లిమ్ము వామదేవ,

తే. వకుళవంజుళ లవలీ లవంగ లుంగ
కనకకల్హార కరవీర కమల కుముద
ముఖనిఖిలసూన సంతాన ముద్రితోప
హారము ఘటించి మీకు జోహారు సేతు. 270

వ. అని యష్టదిక్పాలకుల నారాధించి కల్పోక్తప్రకారంబున హోమ
గుండంబుఁ గావించి యందు వీతిహోత్రుం బ్రజ్వరిల్లం జేసి యథా
విధి ధనుర్యాగంబు గావించి, యగ్నిప్రదక్షిణంబును బలివిధానం
బులు నిర్వర్తించి ప్రదక్షిణజ్వాలాకలాపంబుల వెలుంగున నగ్ని
భట్టారకున కభిముఖంబుగా నిలిచి నిటలతట ఘటితాంజలి పుటుండై
యిట్లని వినుతింపం దగు. 271

సీ. నీ సఖ్యమునఁ గదా నీరజబంధుండు
శిశిరావరోధంబుఁ జెందకుండు,
నీముఖంబునఁ గదా నిర్జరావళులకుఁ
జన్నంపు టామెతల్ సంభవించు,
నీకొసంగును గదా నీహారకిరణుండు
మునుమున్న నిజకళా మోదకంబు,
నీ తేజమునఁ గదా నిఖిలలోకంబుల
కాహారపరిపాక మనుగమించు,

గీ. పావనాకార సంశ్రితభయ విదూర
హరనిటలచక్షురుపగేహ హవ్యవాహ
విఘ్నము లడంప విలువిద్య విస్తరింప
వరదుఁడవు నీవు నీకును వందనంబు. 272

వ. అని యగ్నిభట్టారకు నారాధించి తత్ప్రసాదంబునఁ గృతార్థుండై యర్ఘ్యపాద్యాది షోడశోపచారంబుల ధాత్రీ దేవిం బూజించి కరంబులు మొగిచి 273

ఉ. అమ్మ తపోనుభావనిధి వమ్మ సమస్తము దాల్చు పేటి వీ
వమ్మ జగంబుల మ్మనుతు వమ్మ రమాదులు నీదునాటి రా
రమ్మ రథాంగపాణి సతి వమ్మ మనంబున నీకు మ్రొక్కెనా
నమ్మ దయోదయాంబునిధి వమ్మ పదాహతి నోర్చు ధారుణీ. 274

వ. అని ధరిత్రిం బ్రార్థించి శరశరాసనావయవంబుల నిష్టదేవతా వాహనంబు గావించి 275

సీ, విరివిగా విరిసిన విరజాజి పువులతో
నెఱిదీర నెఱయు గన్నేరులతోడఁ
జెంగావిరంగైన క్రొంగల్వ విరులతో
సౌగంధ్యమెసగు గొజ్జఁగులతోడ,
ఘుమ్మన నెత్తావిఁ గ్రమ్ము గేదఁగులతో
బరువంపుసిరుల తామరలతోడఁ,
బొలుపు సంపాదించు పున్నాగములతోడఁ
బ్రియములౌ బొడ్డుమల్లియలతోడ,

గీ. కలితమృగమద కర్పూర గంధసార
కుంకు మాగరు కర్పూర సాంకవాది
సురభిళాలేపములతోడ సొబగు మీఱ
శరశరాసనపూజలు సలుప వలయు 276

వ ఇవ్విధంబునఁ బూజించి మఱియును. 277

సీ. వామశృంగం బల వామదేవుండును
దక్షిణశృంగంబు తమ్మిచూలి,
గొటిమలు గుహుఁడును గొమలు హేరంబుఁడు
వక్షస్థలంబు జైవాతృకుండు,
లక్ష్మీవినోదుండు లస్తకస్థానంబు
పృష్ఠంబు పద్మినీప్రియతముండు,
మౌర్వీలలామంబు గీర్వాణనాథుండు
కుండలిశ్రేష్ఠుఁడు గొనయములను,

గీ. చక్రహస్తుఁడు సతతము శరముఖంబు
మహిమ నీశుండు సాయకమధ్యమంబు
పుష్కరభవుండు మార్గణపుంఖ మెలమి
సదమల ప్రౌఢిఁ గాచుచుండుదురు గాత 278

వ. అని యివ్విధంబున శరశరాసనంబులకు సంగరక్షకులు గావించి. 279

సీ. పాదద్వయము తీర్థపాదుఁడు రక్షించుఁ
బ్రపదముల్ పాలించు భవహరుండు,
గుల్ఫముల్ గాచు రక్షోవిభేదనశాలి
జానుజంఘుల నేలు సర్వమయుఁడు,
నూరువుల్ గాచు వరదారు మందారుండు
గుహ్యంబు గాచు సద్గుణపయోధి,
జఘనంబు రక్షించు జగదేకనాథుండు
నాభి నేలును నిత్యశోభనుండు,
శ్రోణిద్వయం బేలు సురుచిరాకారుండు,
మధ్య మేలు తమోవిమర్దనుండు,
జఠరంబుఁ బాలించు సర్వాంతరాత్ముండు
వక్ష మేలును భక్తవత్సలుండు,
స్కంధముల్ రక్షించుఁ గరుణాలవాలుండు
జత్రువుల్ గాచును శత్రుహరుఁడు,

బాహువుల్ ప్రోచు గోపాలక శ్రేష్ఠుండు
కూర్పరంబులు గాచుఁ గుశలదాయి,
మణిబంధముల నేలు మణిమయాభరణుండు
కరతలంబులఁ గాచు ఖరవిరోధి,
గళము సంరక్షించు గంభీరవాహుండు
చుబుకంబుఁ గాచు యశోధనుండు,
గండయుగ్మము బ్రోచుఁ గల్యాణశీలుండు
శ్రుతులఁ బాలించు విశ్రుతయశుండు,
ఘ్రాణ మేలు బహుప్రకారఖేలనశాలి
నయనముల్ గాచు దుర్నయవిదారి,
భ్రూయుగ్మ మేలు సంపూర్ణ తేజోనిధి
ఫాలస్థలముఁ గాచుఁ బావనుండు,
మూర్ధంబు పాలించు మునిమనస్సదనుండు
పృష్ఠభాగము నేలుఁ బృథుబలుండు

గీ. అగ్రభాగముఁ గాచు సర్వాగ్రగణ్యుఁ
డుభయపార్శ్వంబులను బ్రోచు నూర్జితుండు
ప్రోచుబహిరంతరము లాదిపూరుషుండు
మదిని బాయక నిలుచును మాధవుండు 280

వ అని యిష్టదేవతా ప్రార్థనంబులు పఠింపుచు మంత్రకవచంబున నవ
యవంబులు సురక్షితంబులు గావించి యథావిధిఁ ధనురాచార్యుం
బూజించి పండ్రెండు మారులు ప్రణామం బాచరించి యానతపూర్వ
కాయంబుగాఁ దత్సన్నిధి భయవినయంబులు రెట్టింప నిలిచి యిట్లని
ప్రార్థింపం దగు 281

సీ. ఏవిద్య పెంపున నీశానదేవుండు
త్రిపుర సంహారంబు ధృతి ఘటించె,
నేనేర్పు పెంపున సేనాధినాథుండు
శూరపద్మాదుల బీర మణఁచె,

నేకళాపరిణతి నెసగ భార్గవరాము
డరిలోకభీకరుండై చెలంగె,
నేకౌశలంబునఁ గాకుత్స్థతిలకుండు
దశముఖాదులఁ ద్రుంచి ధరణి నేలె,

తే. నట్టి విలువిద్య నయమున నభ్యసింపఁ
గోరి మీ మ్మాశ్రయించితిఁ గూర్మి పేర్మి
ననుఁ గృతార్థునిఁ గావించి కనుము కీర్తి
యరినికరభేది ధనురాగమార్థవేది. 282

వ. అని వినుతించి సమీహితమనస్కుండై నిలువం దగు నట్లు కరం బులు సాచి వినయావనతవదనుండై ప్రార్థించు శిష్యునకు నాచా ర్యుండు శరశరాసనంబు లొసంగుటకుం దగిన విన్నాణంబు గల దాకర్ణింపుము 283

క. బాణాసన తిలకంబును
బాణత్రితయంబు సవ్యపాణి నొసఁగి వి
న్నాణంబు మీఱ దక్షిణ
పాణి నఱయ దాన మిచ్చి భావం బలరన్. 284

సీ. శ్రీరస్తు రాజ్యలక్ష్మీసమూర్జితధామ
సౌభాగ్య మస్తు సజ్జనలలామ,
ఆరోగ్య మస్తు గంభీరభావవికాస
విజయో౽స్తు విజయకా యుజ విలాస
కీర్తి రస్తు బుధప్రకీర్తితామలశీల
శుభమస్తు శత్రుతేజోవిఫాల.
అష్టపుత్రావాప్తి రస్తు ధైర్యవిధాన
దీర్ఘాయు రస్తు సుస్థిరనిధాన,

గీ అని యిటుల మాగధులగాన మనుదినంబు
వీనులకు సోఁకగాఁ దగు విభవ మంది
మను కుమారాగ్రణీ ధనుర్మహిమఁ దెలిసి
యనుచు నాశీర్వదింపఁగా నగు గురుండు. 285

వ అని యివ్విధంబున నాశీర్వదించి యిచ్చు ధనుర్బాణంబులు కరయుగళంబున నంగీకరించి కృతార్థుండై క్రమ్మఱ నొక్క ప్రణామం బాచరించి యనఘంబులగు మణికనకపట్టాంబరంబు లర్పించి, యాచార్యుం బరితృప్తుం గావించి గోభూహిరణ్యప్రముఖ వాంఛిత మహార్హవస్తు ప్రదానంబుల ధాత్రీసురులం దనిప, వారలవలన దీవనలం బడసి బంధు మిత్ర పరివారసహితంబుగా నానాపదార్థ సంపన్నంబులైన యన్నంబులు గుడిచి చందన కుసుమాంగరాగంబుల నలంకృతుండై మహోత్సవంబున నయ్యహోరాత్రంబునం బ్రొద్దుపుచ్చుచు వినోదింపందగు నిట్టిది ప్రథమారంభంబు మఱియు నుంగల విశేషంబు లాకర్ణింపు మని యాచార్యుం డర్జునునకుం జెప్పినట్లు రోమహర్షణి శౌనకాదులకుం జెప్పె నని వైశంపాయనుండు జనమేజయులకుం జెప్పుటయు నవ్విభుండు ప్రమోదంబునఁ బొదలుచుం దదుపాఱి చరితంబు వినవలతుఁ జెప్పు మనుటయు. 286

మ. వరనోపాటవిభంగ భంగభవదీవ్యద్దివ్య కల్లోలినీ
శరజత్కీర్తితరంగ రంగదలికాసక్తాలకశ్రీవిభా
స్వరసోమాంబుదసంగ సంగరకళా సజ్జభవత్కౌశికా
ధ్వరనానాగమగాంగ గాంగ పులినోద్యత్తాపసేంద్రాకృతీ 287

భుజం. ఇలాకన్యకారూఢ హేలాభిరామా
బలారాతిజిత్సార్వ భౌమాతిభీమా
కళానాయకస్మేర కల్యాణ సీమా
కులక్ష్మాధరస్థేమ కోదండరామా, 288

గద్య. ఇది శ్రీమత్కౌసల్యానందనకరుణాకటాక్షవీక్షణపరంపరాసాదిత కవితావిచిత్ర, సుకవిజనానుగ్రహపాత్ర, మైత్రేయసగోత్ర, నృసింహ గురుపుత్ర కృష్ణమాచార్య ప్రణీతంబైన ధనుర్విద్యావిలాసంబను లక్షణగ్రంథంబునందు ధనుర్బాణగోపనార్హనిచోళనిషంగ రచనా ప్రవచనంబును, మార్గవిధానకథనంబును నంగుళిత్రాణ ప్రకీర్తనంబును, జ్యారోపణప్రకరణంబును, ధనుర్మూర్ధ్వాధరభాగవిని భాగంబును, ముష్టి ప్రకరణంబును, స్థానోపసంఖ్యానంబును, శరగ్రహణోపాయ ప్రతిపాదనంబును, సంధానక్రమ వివరణంబును, నాకర్షణహస్త ప్రస్తావంబును, బాణహస్తక్షేత్ర నిరూపణంబును, దృష్టిలక్షణా న్వీక్షణంబును, ధనురాకర్షణ కౌశలోపన్యాసంబును, పుంఖోద్వేజన విభజనంబును, జాపముష్టి ప్రేరణవివరణంబును, శరమోచన ప్రకారప్రవచనంబును, జాపోత్సరణ లక్షణవినిభాగంబును శరాభ్యాసోచితమాసోపన్యాసంబును, శరవ్యాపార యోగ్యతిథివారతారకాయోగకరణ విస్తర ప్రస్తావంబును, ఖురళికారంగ ప్రసంగంబును, రంగప్రవేశ లక్షణ నిర్దేశంబును, ధనుశ్శరపూజాయోజనంబును, గురుప్రణామ స్థేమంబును, శరశరాసనగ్రహణ పౌర్వాపర్యపర్యాలోచనంబు లోనుగాఁగలుగు విశేషంబులం దనరుద్వితీయాశ్వాసము. 289

---

# ధనుర్విద్యావిలాసము

## తృతీయాశ్వాసము

క. శ్రీరవికుల కలశాంబుధి
పూరణహిమధామ నిఖిలభువనక్షేమా
ధార శ్రుతిసుఖనామా!
నీరధరశ్యామ! యీవనీ రఘురామా? 1

వ. అవధరింపు మట్లు రోమహర్షణి శౌనకాదులకుం జెప్పినట్టు జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె 2

ఉ. ఆమఱునాఁటి వేకువ హితానుమతిం జలకంబు లాడి ధౌతామలచేలగంధ కుసుమాభరణాంచితుఁడై శిరస్త్రముల్
మైమరు వంగుళిత్రము సమస్థితి రాజిలగా ధనుర్ధరగ్రామణి మున్నుగా ఖురళికావరణంబునఁ జేరి ధీరుఁడై 3

శా. విద్వద్వ్యాపకు నాదిదేవుని మనోవీథిం బ్రశంసింపుచున్
విష్వక్సేను వినాయకుం దలఁచి పృథ్వీదేవి గానమ్రుఁడై
యిష్వాసమ్మున కంగరక్ష లిడి తా నేకాగ్రభావంబుతోఁ
దుష్పాపప్రతిరోధి నస్త్రగురుఁ జేతుల్ మోడ్చి భావింపుచున్ 4

క కోదండపృష్ఠభాగము
మీఁదరయగ తద్గుణంబు మేదినిఁజూడన్
బ్రోదిన్ వర్తులముష్టిని
గోదండము పూనఁగాఁదగున్ సమపదుఁడై 5

వ. ఇట్లు సమపదస్థానకంబున నిలిచి పూర్వాధఃకృత పృష్ఠమార్గకంబుగాఁ జాపంబు వర్తులముష్టిం దాల్చి మఱియును 6

సీ. అవల నరాళాఖ్య మైనహ స్తంబుచేఁ
బ్రోదిమై శింజిని పూనవలయు
నట్లుశింజినిఁబూనియాదట వైష్ణవ
స్థానకంబున బిట్టు దనరవలయు
చాపశృంగము సవ్యజానుపర్వగముగా
సవ్యాంఘ్రి మును జంగసాచవలయు
నట్లుప్రత్యాలీఢ మమర నాకుంచిత
ప్రేరితంబుల నేర్పుఁ బెనుపవలయు

గీ. సమధికాకుంచితప్రేరితములయందు
హ్రస్వుఁడును దీర్ఘుఁ డగుచు సవ్యాంఘ్రిజంఘ
మీఁదఁగూర్చుండి లేచుచుఁ బ్రోదిమీఱ
ధీరుఁడై విల్లు మెల్లనఁ దివియవలయు. 7

క. అలుకని శార్ఙ్గం బనుచును
జులకనగా మోర్వి తివియఁ జూడక ఘనుఁడై
బలుశార్ఙ్గము దివిచినగతి
బలిమిం దివియఁ దగు బాహుబల మధికముగన్. 8

క ఈరీతి విల్లు దివియుచు
నారిం జిబుకాధరములన డుమను బదిలుం
డై రహిం వలకనుఁగొలికిన్
వారక నిలుపంగ వలయు వలచెవిమోలన్. 9

క. ఆకుంచితమున హ్రస్వుఁడు
దీకొని ప్రేరితమునందు దీర్ఘుం డగుచున్
జేకొని వెనుక న్మోంగల
నాకర్షణవేళఁ బదిలుఁడై పీఁగఁదగున్ 10

క శర మరివోసినకై వడి
స్థిరతరగతి మోర్వి దిగిచి తెగవాపి పోరిం

బోరి నర్ధమండలంబున
మరలి సమస్థానకమున మలయఁగ వలయున్. 11

వ. ఇవ్విధమునఁ బ్రత్యాలీఢస్థానకంబున సంస్థితుండై ద్విత్రిచతుఃపంచ వితస్తి ప్రమాణంబుల జంగసాచి తత్తదనుకూలంబులగు పూర్వోక్త లక్షణంబుల నుపలక్షితుండై చాపలముష్టి దృష్టి సెలకొనం జేయుచు చుబుకాధరమధ్యంబునను దక్షిణాలోచనాపాంగ ప్రదేశంబునను దక్షిణకర్ణాభ్యర్ణంబునను మౌర్విని నిలుపుచు నెడనెడఁ బుంఖోద్వేజనశర మోచనంబు లాచరించుకరణిం గుణంబువదలి సింహగర్జనంబు సేయుచు నర్ధమండలంబున సమస్థానకంబునకు వచ్చి ధనురాలింగనంబు సేయుచుం గ్రమ్మఱ మౌర్వి తివియం దగు. 12

క. ఈ చెప్పినచందంబుల
వాచాలుం డగుచుఁ బెక్కు వరుసల దివియన్
జూచిన చాపము బరువై
సూచితగతి గాత్రమునకు సొలపు ఘటిల్లున్ 13

ఉ. అంతట మాని సారతమై బెడిదంబగు ద్రోణముష్టిచేఁ
గొంత పరిశ్రమంబు గని కొండొక సాముల నారితేరి య
శ్రాంతము నిట్లు శస్త్రగురుసన్నిధి రంగమునన్ వినీతుఁడై
యెంతయు సావధానమతి నేడ్తెఱ నభ్యసనంబు సేయుచున్ 14

వ. వెండియుఁ జతురస్రదీర్ఘచతురస్రంబులగు ముష్టివిశేషంబుల ధనుర్గ్రహణ ప్రకారంబులును, కటకాముఖ కర్తరీహంసముఖ నామకంబులగు హస్తంబుల గుణాకర్షణ ప్రకారంబులును, యథావిధి నభ్యసింపుచుఁ దక్కంగల్గు నాలీఢసమవైశాఖమండల స్థాన చతుష్టయంబునం బేర్వెఱ నాకుంచితప్రేరితప్రముఖంబులగు విశేషంబుల నభ్యాసంబు సలుపందగు మఱియును. 15

సీ. పరగఁ బ్రత్యాలీఢపదభావము లభించి
యాలీఢపదభావ మందవలయు,
నాలీఢపాదవిన్యాసంబు భావించి
సమపదాభ్యాసంబు సలుపవలయు,
సమపదాభ్యాసంబు సలిపి విన్నాణియై
వైశాఖమున బిట్టు వఱలవలయు,
వైశాఖమున మహాకౌశలం బార్జించి
మండలావస్థితి నుండవలయు

గీ. మండలస్థానకంబున గండు మిగిలి
తత్ప్రతిష్ఠానములఁ బెంపు దనరవలయు
తత్ప్రతిష్ఠానములఁ బెంపు దనరునేని
చిత్రగతుల నభ్యాసంబు సేయవలయు. 16

వ ఇట్లు స్థానప్రతిష్ఠానంబుల మెఱుంగు మెఱచినకైవడి మెలంగుచు, చరణజానుజంఘోరు వక్షో గళనయనభ్రూలలాటకరతల మణిబంధ కూర్పర ప్రముఖంబులగునంగకంబుల దృష్టిముష్టి సంధానస్థానాకర్షణాకుంచితప్రేరితపుంఖోద్వేజన శరమోచన ముష్టిప్రేరణసింహగర్జన కార్ముకోత్పరణార్ధమండల సమస్థానక ధనురాలింగన ప్రముఖంబులగు విశేషంబులం దగిన విన్నాణంబుల యథోక్తప్రకారంబున నలవరించుచు, నెడనెడ నాచార్యుండు బోధించు దృష్టి ముష్టిసంధాన స్థాన కౌశలంబులు మఱవక యేకాగ్రచిత్తుండై కొన్నివాసరంబు లభ్యాసంబు సలిపి వెండియు. 17

క. నాలుగు జేనల కోలఁదిన్
హాలిన్ నెలవంకలీల నమరిచి కుడ్యం
బాలో నలుకనగా నిసు
మోలిన్ నిండార నునిచి యుత్సాహమునన్, 18

క. ఆకుడ్యమ్మున లక్ష్యము
సైకమ్మున జేనకొలఁదిఁ జతురస్రముగాఁ
బ్రాకటగతి నమరిచి విలు
గైకొని గురువునకు మ్రొక్కి కౌశల మెసఁగన్. 19

శా. ప్రౌఢిన్ దూ పరివోసి లక్షమున దృక్పాతంబు గావించుచున్
రూఢిన్ గాత్రము వింటిమ్రోలఁ గలికారూపంబునం గ్రుచ్చుచున్
గాఢాకర్షణ మాచరించి కుసుమాకారంబున న్విక్రమా
గూఢంబై మయి విస్తరిల్ల శరముల్ గూర్పందగున్ లక్ష్యమున్. 20

వ. ఇవ్విధంబున సమపదస్థానకంబున నిలుచుటయు నూర్ధ్వాధఃకృత పృష్ఠ మార్ద్వికంబుగాఁ జాపంబు వర్తులముష్టిం దాల్చుటయు శరం బరి నమర్చుటయుఁ గార్ముకాధశ్శృంగంబు వామోరుపర్వాగ్రం బుగా వామచరణంబు సాచి ప్రత్యాలీఢంబున నిలుచుటయుఁ దోడనే వామముష్టి సాచి గాఢాకర్షణంబు గావించుటయుఁ బుంఖోద్వేజన శరమోచనముష్టిప్రేరణసింహాగర్జనార్ధమండలసమస్థానకధనురాలింగ నంబులు లోనుగా నభ్యాసక్రమంబున నాచార్యుండు బోధించిన కరణి నిరంతరంబు శరంబుల లక్ష్యంబున నడపుచు. 21

సీ. తొలుదొల్త నొకవింటికొలఁదిలక్ష్యంబున
కెదిరించి సాయకం బేయవలయు
నొకవింటికొలఁది తప్పక తాఁకె నేనియు
రెండువిండ్లకొలంది నుండవలయు
రెండువిండ్లకొలంది కాండంబు నడచిన
మూఁడువిండ్లకొలంది మొనయవలయు
లక్ష్యంబు మూఁడువిండ్లకొలంది నందిన
నాల్గువిండ్లకొలంది నడపవలయు

గీ విక్రమంబున నొక్కొక్కవింటికొలది
విస్తరింపుచు నిరువది విండ్లమీఁద

నొక్కవింటికొలందిని మొక్కలమున
నిలిచి గుఱిమీఁద విశిఖమ్ము నినుపవలయు. 22

క ఒప్పుగ బాణ త్రితయము
తప్పక లక్ష్యంబునడుమ దవులఁగ నేయన్
జొప్పడు ధీరుఁడు ధారుణి
మెప్పులు గను విల్లుదాల్చు మేటిమగలలోన్ 23

క. వెంబడి వెంబడి బలువా
లంబులు మూఁ డేకముష్టి లక్ష్యము సొర నే
యం బరగిన పిమ్మట వివి
ధంబు లగుశరమ్ము లేయఁ దగు లక్ష్యముపై 24

క. నానావిధవిశిఖంబులు
పూనిశరవ్యంబుమీఁదఁ బోరిఁబోరి నేయం
బూనుచుఁ బ్రతివాసరమును
మానక కడిమిన్ బరిశ్రమము సేయఁదగున్. 25

క. అంతదడవు రంగస్థలి
సంతతము పరిశ్రమంబు సలిపెడునతఁ డ
శ్రాంతం బాయుష్యంబు ని
తాంతస్థితి వృద్ధి నొందఁ దనరు ధరిత్రిన్. 26

వ. ఇవ్విధంబునం బరిశ్రమంబు గావింపుచు, 27

గీ. అవల నైదునూఱు లైనను నన్నూట
యఱువదైనశరము లనుదినంబు
సేయుచుండవలయు నెడపక కడపట
శతశరంబులైనఁ జాపధరుఁడు. 28

క. ఈరీతి నభ్యసింపుచు
వారక యభ్యాస మొక్కవాసర ముడుపన్

ధారుణి నలువది దినముల
నేరుపు గొనకొనవదు చాపనిరతున కనఘా. 29

వ. ఇట్లు జ్యారోపణకార్ముకగ్రహణశరసంధానసమాకర్షణగాత్రాకుంచన దృష్టిప్రసరణపుంఖోద్వేజనశరమోచనముష్టిప్రేరణకార్ముకోత్సరణ సింహగర్జనాదిలక్షణంబులను శిక్షితుండై చెలంగ వలయు నింక లక్ష్య వేదికావిధానంబును దదనుబంధంబు లగు లక్షణంబులునుం గల వవియును యథానుకూలంబుగా నిరూపించెద నాకర్ణింపుము. 30

గీ. లలి శరవ్యంబు లక్ష్యము లక్ష మనఁగ
నమరు నామత్రయంబు లోకమున గుఱికి
వేదిపై లక్ష్య మిడ లక్ష్యవేది యంద్రు
అదియు నారాచవిలసనార్థమ్ము సుమ్ము. 31

క. ద్విరదరథాదిక నిష్ఠుర
తరలక్ష్యవిభేదనంబు తనచే నగు సు
స్థిరలీల లక్ష్యవేదిక
నిరతిఁ నారసము సొనుప నేర్చినపిదపఁ 32

వ. అట్లగుట లక్ష్యవేదికావిధానంబును దదాయామోత్సేధపరిణాహంబుల ప్రమాణంబులను, అందలిపరిశ్రమంబును, దదనుకూలంబు లగు విన్నాణంబులునుం దెలియవలయుఁ గ్రమక్రమంబున వివరించెద నాకర్ణింపుము. 33

సీ. రహి నుదఙ్ముఖమైనఁ బ్రత్యఙ్ముఖంబైన
భిత్తివేదిక లీలఁ బెంప వలయు
నది చతుష్పంచదశాంగుళోత్సేధంబు
కొమరార షష్ట్యంగుళముల నిడుపు
నమరఁ జత్వారింశదంగుళ పరిణాహ
మును గల్గు మూఁడు వైపుల ఘటించి,

నడుమ గోధూమచూర్ణంబేని కార్పాస
చూర్ణమేనియు నించి సొబగు మీఱ
మెత్తగా వల్మీకమృత్తిక మర్దించి
గోక్షీరతైలముల్ గూర్చి మెదపి,
సలిలంబు లెడనెడఁ జల్లుచుఁగరినంపు
ముద్దపాకంబుగా నద్దళించి
ఆ కుడ్యముఖమున నది ద్విత్రి చతురంగు
ళమ్ములకొలందిఁ గుడ్యము ఘటించి
తనబలంబును శరాసనబలం బూహించి
వెయి రెండువే లూర్వుఁడువేలు నాల్గు

గీ. వేలు ఘట్టనములు చేసి పాళిఁదీర్చ
నధర మూర్ధ్వంబు మార్దవ మాకళింప
వక్షమతి కర్కశస్వభావంబుఁ దాల్పఁ
దనరు నిది లక్ష్యవేదివిధాన మవని 34

వ. వెండియు నట్టి లక్ష్యవేదిక యూర్ధ్వభాగంబు శిరంబనియును, మధ్యంబు వక్షస్థలంబనియును, నధోభాగంబు పుచ్ఛంబనియును, ధనుఃకళాని పుణుల పరిభాషణంబు గలుగు, నట్టి వేదికాముఖంబున నెంత ఘట్ట నంబు సలిపిన నంత నూర్ధ్వాధర ప్రదేశంబుల మార్దవంబును మధ్యం బునఁ గాఠిన్యంబునుం గలుగుట నిక్కువం బీ యింగితం బెఱింగిన పరీక్షాసమయంబుల నభ్యాసికి భంగంబు దొరకొనకుండు, మఱియు నిట్టి వేదికావిధానంబు ప్రతివాసరకరణీయం బగు నని పలుకుదు రది యట్లుండె వెండియు నాకర్ణింపుము 35

క. గురుభృగురవివాసరముల
నరయఁగ నొకవాసరంబునం దీగతి సు
స్థిరలీల లక్ష్యవేదిక
సరవిం బచరింపవలయు సమ్ముద మొదవన్. 36

వ. మఱియును. 37

ఉ. వాసరనాథజీవభృగువారములం దొలుదొల్త నూతనా
భ్యాసికి లక్ష్యవేది పరిపాటి నమర్పఁదగుఁ నిరంతరా
భ్యాసికి సౌమ్యవార మశుభంబగుఁ దక్కటి యాఱువారముల్
భాసిలు లక్ష్యవేది నిలుపన్ ధనురాగమసమ్మతంబులై. 38

వ. ఇట్లు నూతనాభ్యాసి పూర్వోక్తంబులగు రవిగురుభార్గవవారంబులఁ బంచాంగసంగతంబగు నొక్కవాసరంబున లక్ష్యవేదికావిధానంబు పూర్వోక్త ప్రకారంబున నాచరింపం జేసి. 39

సీ. ఆవేళ వేకువ నవలీల మేల్కాంచి
యఘమర్షణస్నాన మవధరించి
భవ్యమాల్యాంబరాభరణముల్ ధరియించి
తిలకంబు నుదుటఁ జిత్రీకరించి
ఆగమోక్తుల ధనుర్యాగంబు గావించి
యగ్నిప్రదక్షిణ మాచరించి
ధాత్రీసురులకు సంతర్పణల్ గావించి
వార లొసంగు దీవనలు గాంచి

గీ. బొమిడికం బుత్తమాంగకంబున ధరించి
కంచుకము గూర్పరమ్మున మించఁ దొడిగి
అవల గోధాంగుళిత్రాణ మవధరించి
రంగమధ్యంబుఁ జేరి ధీరత రహించి. 40

సీ. రహి నిష్టదేవతాప్రార్థన గావించి
శరశరాసములపూజలు ఘటించి
మ్రొక్కుచు గురునాజ్ఞ ముదమున భావించి
యవల ధాత్రీదేవి నభినుతించి

యేపుమై చాపంబువై పులు భావించి
గరిమతో నరిఁ జక్కఁగా ఘటించి
ప్రోదిమై విల్లు వర్తుల ముష్టిఁ గీలించి
యాలక్ష్యవేదిక నధికరించి

గీ. దవ్వులను లక్ష్యవేదికఁ దనరు శక్తి
యమరుచోట సమస్థానకము ఘటించి
కార్ముకగుణంబు పృష్ఠభాగంబు క్రిందు
మీఁదు గనునట్లుగా ముష్టినూఁది మఱియు. 41

గీ. మ్రోల నోరుఁ డూను తూణపుముఖమునందు
నీటు పట్టున నారస మెడలఁ దిగిచి
సాఁచి నారాచమధ్యంబు చాపయష్టి
నడుమ డాపలిముష్టిపై నిడఁగ వలయు. 42

క. అటు లూనిననారాచం
బిటునటులుం గదలనీక యిట్లు పదిలుఁడై
దిటమున జుట్టనవ్రేలం
బటుతరగతి నూదవలయుఁ బాటవ మెసఁగన్. 43

క. మొదలిటి నియమము దప్పక
సదమలగతిఁ బుంఖ మదికి సమధికధైర్యా
స్పదుఁడై డాపలిపార్ష్ణిన్
బదపడి యిడవలయు సవ్యపదగుల్ఫమునన్. 44

వ. ఇవ్విధంబున వైష్ణవస్థానకంబుననుండి తోడన ధనుశ్శృంగంబు వామోరుపర్వాగ్రగంబుగా శరాసనంబు వంచి యిరువదినాలు గంగుళంబుల కొలఁదిం బదయు ళంబునకు నెడ గల్గునట్లుగా వామపదంబు జఱపుచు బెట్టిదంబుగా నిలువరించి పూర్వోక్తప్రకారంబుగా నరాళ హస్తంబున గాఢాకర్షణంబుఁ గావించుచుఁ జుబుకాధరమధ్యంబు

స్కంం దిగిచి పదజానుజం ఘోరుకటిమధ్యవక్షోగళచుబుకాధరనయన భ్రూలలాట భుజకూర్పర మణిబంధకరతలాంగుళంబుల నార్జవంబా పాదించుచు దక్షిణభుజకూర్పరంబు నారాచపుంఖంబునకును, నారాచపుంఖంబువామజత్రుస్థానమునకును వామజత్రుస్థానంబు ధనుర్హస్తక సంహతంబగు వామముష్టి ప్రదేశంబునకుం జక్కనగా నూలునం బట్టిన యట్టు లమర్చి యట్లు బెడిదంబగు వామముష్టిప్రదేశంబు ననుసరించి నిశ్చలంబుగా దృష్టిప్రసారంబు నిగుడింపుచుఁ గోరంబు కరణిఁ జాప యష్టిమఱుంగున గాత్రం బాకుంచితంబుఁ గావించి యూర్ధ్వగాడ్పుల నెడగలుగం జడియుచుఁ గర్ణాభ్యర్ణంబునకుం దిగిచి తోడనే వలపట దాపటం బ్రకటంబులగు టెక్క లక్కజంబుగా నొండొకటి నొరయం బుంఖోద్వేజనంబును, నారాచమోచనంబును, ముష్టిప్రేరణంబునుం జాపోత్సరణంబునుం గావించి పుంఖంబు లస్తంబు వెడలునంతకుం బంచాననంబునకుం గమకించు శరభంబులీల సరభసంబుగా మలయానిలశీతలవలనంబులం జలిబిలివికసించు మల్లికాముకుళంబు కరణి వెలి కుఱికి కరికరణిం గరకరి నర్ధమండలంబునం దక్షిణచరణంబు వామాంఘ్రిసదృశంబుగా సమపదస్థానకంబున నిలిచి యూర్ధ్వాధఃకృతగుణపృష్ఠంబగు కార్ముకంబు వక్షంబునకుం దెచ్చి పౌరుషంబునకుం బరిరంభణంబునుఁ గావించుచు, సింహగర్జనంబుతోడన దక్షిణహస్తప్రథమాంగుళనఖరంబు గగనభాగంబును, ద్వితీయాంగుళనఖరంబు వక్షఃస్థలంబునుం జూచునట్లుగా నమర్చి నిలుపం దగు నిది వేదికాలక్ష్యంబున నారాచనమోచనప్రకారంబు, మఱియు నిందు లకుందగిన విన్నాణంబులు గలవు క్రమక్రమంబున వివరించెద నాకర్ణింపుము. 45

క. ఇమ్ముగఁ బ్రత్యాలీఢప
దమ్మునఁ గూర్చుండి యేయఁ దలచినఁ బదయు
గ్మమ్మునకు నడుమ నెడమున
సి మ్మనుపఁగవలయు నైదు జేనల కొలఁదిన్. 46

క. ఏయదుకున దానదుకునొ
యాయదుకున నదియు లక్ష్యమం దెడసొచ్చున్
బాయక నుబికింపుచు వల
చే యించుక లోపలికి ససిం ద్రిప్పనచోన్. 47

గీ. ఎడమపార్శ్వంబు గ్రక్కున నించుకంత
వంచి పుంఖంబు వడి నుబికించె నేని
పుట్ట నురగంబు సారఁబాఱుపోల్కి నార
సము ఖచిక్కునఁ జొక్కు లక్ష్యంబునందు. 48

సీ. మున్నుగా నొకశార్ఙ్గముకొలంది నడపించి
యిరుశార్ఙ్గములదూర మిడఁగవలయు
నిరుశార్ఙ్గములదూర మిడి నేప్పు నాటించి
సార్ధత్రయంబుగా జరగవలయు
సార్ధశార్ఙ్గత్రయాయతికృతాభ్యాసుఁడై
నాల్గుశార్ఙ్గము లెడ నడపవలయు
నాలుగింటికొలంది నారాచ మడరించి
సార్ధపంచక మెడ జరగవలయు

గీ సార్ధశార్ఙ్గపంచక మితస్థలమునందు
చతురుఁడై మీఁద నొక్కొకశార్ఙ్గ మూన
మొనగునట్లు నానాఁటికిఁ బదునొకండు
శార్ఙ్గములదూర మద్ధతి లుప లయు. 49

గీ. పదునొకండుశార్ఙ్గమ్ముల పదునొకండు
సరణు లభ్యాసపరిణతిస్థలమునందు
సార్ధశార్ఙ్గత్రయాయతి సార్ధశార్ఙ్గ
పంచకాయతి సేయుట భరము సుమ్ము. 50

క. ఈలీల నీస్థలంబుల
ప్రీలక నారసము లక్ష్యవేదిక నిలుపన్
జాలినధీరుడు విజయ
శ్రీలాలితుఁడగుచు నుల్లసిల్లు నధికుఁడై. 51

క. తెక్కలుగల నారసమే
యక్కజముగ రెండుచోటులందు నడపఁగా
తెక్కలు లేనిది నూఱుల
నొక్కఁడు నడపున్ బహుప్రయోగనిపుణుఁడై 52

ఉ. తెక్కలనారసంబులు గుఱి న్నినుపందగు లక్ష్యవేదికన్
తెక్కలులేనినారసము తివ్వన నైదిటిమీఁదిచోటులన్
రెక్కొనఁజేసెనేని యది రింగున నడ్డముఁబ్రాకు నిట్టులీ
చక్కటు లన్నియుం దెలయఁ జాపధరుం డలరుం జగంబులన్. 53

క. ఏకాదశస్థలంబుల
దాకొని ప్రథమస్థలంబు దక్కఁ బయిపయిన్
దీకొని నారస మదికినఁ
బ్రాకటముగ రెండుగఱులు పై నిడవలయున్. 54

క. ఒకశార్ఙ్గము కొలఁదిం బా
యక నారాచంబు సరవి నదికెడుచోఁ ద
ప్పక రెండు తెక్క లడుగున
నొకగరి పై నమరునట్టు లూనఁగవలయున్. 55

క ఒకశార్ఙ్గము కొలఁది కిల
స్తకమున నారాచ మూనఁ జను మఱి పైపై
నొకశార్ఙ్గమూన మెదిగిన
నొకదారమువాసి మించ నూనఁగ వలయున్, 56

గీ. మీఁదు లక్షీకరించినమీఁద నదికి
క్రిందు లక్షీకరించినఁ గ్రింద నదికి
నడుమ లక్షీకరించిన నడుమ నదికి
నారసము లక్ష్యవేదిపై నడుపవలయు 57

సీ. కుడియోర నగ్ర ముంకువమీఱ సోఁకిన
నెడమయోరకుఁ బుంఖ మెడలరాదు
ఎడమయోరనలుఁగు కడిఁదిమై నాటినఁ
గుడియోరకై పింజ సడలరాదు
అగ్రంబుమీఁద నవ్యగ్రమై సోఁకిన
వడిఁ బుంఖ మడుగున వ్రాలరాదు
అగ్రం బడుంగున నవలీలగాఁడిన
పుంఖంబు మీఁదికిఁ బొరయరాదు

గీ నారసము లక్ష్యవేదిపై నాటునపుడు
వఱలుపుంఖంబు వడవడ వడఁకరాదు
కావున యథానుసంధానకౌశలమున
నలుఁగునకుఁ బింజ సమముగా నడపవలయు. 58

గీ. నారసములక్ష్యవేదిపై నడపు నపుడు
నస్త్రధరుఁ డెంతతగ్గిన నంత మేలు
తగ్గి నారాచ మెత్తునఁ దవులనీక
నలువు దీపింప సమముగా నడపవలయు. 59

వ. మఱియు నొక్కవిశేషంబు గల దాకర్ణింపుము. 60

సీ. ఏవిల్లు తనబుద్ధి కెలమి నాపాదించు
నావిల్లు హితముగా నందవలయు
నేముష్టి తనపేర్మి కామోదము ఘటించు
నాముష్టి నిష్ఠాన మందవలయు

నేస్థానకము మది కింపు సంపాదించు
నాస్థానకంబున నమరవలయు
నేహస్త మాత్మకు దోహళంబు ఘటించు
నాహస్తమునఁ దివియంగవలయు

గీ. లక్ష్యలక్షణాభిజ్ఞుఁడై లక్ష్యవేది
నారసము లేకవిధముల నడపఁజూడ
ననుదినంబు చిరాభ్యాసమునఁ దెలంగి
నారసము లన్నివిధములు నడపవలయు. 61

వ అని యిట్లు కొందఱు ధనుర్ధరు లుక్తలక్షణంబుల నతిక్రమించి లక్ష్యభేదనంబు ఫలంబుగాఁ గార్ముకముష్టిసంధానస్థానాకర్షణంబులు మార్పడ శరంబులు నినుపఁజూచిన సంప్రదాయజ్ఞులగుధనురాచార్యుల కభిమతంబు గాకుండు మఱియును విశేషంబు గల దాకర్ణింపుము 62

సీ. అఖిలదేశభవంబులైన శార్ఙ్గములలో
నవఖండశార్ఙ్గమ్ము నాణె మండ్రు
ముఖ్యంబులగు మూఁడుముష్టుల వర్తుల
నామకంబగు ముష్టి నాణె మండ్రు
స్థానప్రతిష్ఠానసరణిఁ బ్రత్యాలీఢ
నామకస్థానంబు నాణె మండ్రు
ఆకర్షణమునైన హస్తంబు నాళ
నామకహస్తంబు నాణె మండ్రు

గీ. భవభవోద్భవ జమదగ్నిభవదిలీప
కౌశికరఘూద్వహాదిక కార్ముకాగ్ర
మార్గనిర్ధారణా గరీయఃప్రబోధ
సంశ్రితశ్రీపదశ్రిత శస్త్రధరులు. 63

వ. అట్లు కఠినలక్ష్య భేదన కౌశలంబునకుం బ్రథమస్థానంబగు లక్ష్యవేధి
కాభేదనంబునం గుశలుండై చిత్రలక్ష్యంబుల శరప్రయోగనైపుణ్యంబు
సంపాదింపవలయు నదియును వివరించెద నాకర్ణింపుము 64

సీ. గుణాలంబితంబైన గోవిషాణంబున
నిషుపంచకము గాఁడ నేయ వలయు
పశ్చారంబుల నీటిపై యంత్రములఁ జూచి
యేపుమై తెగి పడ నేయ వలయు
నారికేళఫలంబు ధారుణిపై నుంచి
యెసగంబుమై దూయ నేయ వలయు
ధాత్రిపైఁ బరచిన చిత్రకంబళముల
నెలమిఁ గూర్చినభంగి నేయ వలయు

గీ. రజ్జులంబితచషకంబు రథము మీఁద
సాహిణముమీఁద పరువునఁ జౌకళించి
వాఁడిశరమునఁ దెగనేయవలయు ధన్వి
తత్తదనుకూలబాణసంధాన మరసి 65

క. కృత్రిమతరుశాఖాగ్రగ
పత్రిం బడ నేయ వలయు భాసురదృష్టిన్
ధాత్రీశుఁ డొక్కశరమున
చిత్రశరవ్యముల నచల చేతస్కుండై. 66

వ. విను మొక్కవిశేషంబు వివరించెద, లక్ష్యంబు చాక్షుషంబును,
శాబ్దంబును, మానసికంబునను భేదంబులఁ ద్రివిధంబులై యుండు
చక్షుర్గ్రాహ్యంబగు లక్ష్యంబు చాక్షుషం బనియును, శబ్దగ్రాహ్యం
బగు లక్ష్యంబు శాబ్దంబనియు, మనోగ్రాహ్యం బగు లక్ష్యంబు మాన
సికంబనియును, బ్రఖ్యాతంబులై యుండు నం దాద్యావధస్సును విని
భాగంబుల నింతవట్టుఁ జాక్షుషంబు వివక్షితం బయ్యె, ద్వితీయంబగు
శాబ్దలక్ష్యంబున శరాభ్యాసంబున కుపాయంబు గల దాకర్ణింపుము

సీ. జల్లెడ కొలఁది లక్ష్యము రాత్రిఁ బచరించి
యాలక్ష్యమున ఘంట వ్రేలఁ గట్టి,
యెలమి నాఘంటకు నిరువది బారల
సన్నంపు సూత్రంబు సంఘటించి,
కుడియోర నొకరుఁ డాగుణము లాఁగుచు ఘంటఁ
గదలింపఁ దానును గనులు మోడ్చి,
మొదల లక్ష్యమునకు మూఁడు విండ్లకొలంది
శబ్ద మాలింపుచు శరము నడపి,

గీ. యవల నభ్యాసమున నాలు గైదు నాఱు
విండ్ల కొలఁదుల నొక్కొక్క వింటి కొలఁది
నాఁడు నాఁటికి దూరంబు నడపవలయు
శాబ్దలక్ష్య శరాభ్యాస సరణులందు 68

గీ. అట్టి శాబ్దలక్ష్య మధికరించుచు లక్ష్య
మొకటి క్రింద మీఁద నొకటి నుంచి
యేయుచుండవలయు నిది ధనురాగమ
సంప్రదాయవిదుల శాసనంబు. 69

క. అల ఘంటాధ్వని మానస
నలినంబునఁ బాదుకొలిపి నయనాంబుజముల్
బలువిడి మొగిచి శరంబుల
సలలితగతి నడుపవలయు సతతము రాత్రిన్. 70

వ. ఇట్లు చిరాభ్యాసంబున శాబ్దలక్ష్యభేదనంబున విజ్ఞానంబు సంపాదింపం దగు నింక మానసిక లక్ష్యభేదనోపాయంబు సమీరప్రేరణంబున దీపం బదృశ్యంబైనం దొల్లింటి యభ్యాసంబున భజియించి యది కతంబుగాఁ బగలింటి యభ్యాసంబున నిశాసమయంబున శరంబులు లక్ష్యంబునం జొనుపుటం జేసి భాగ్యవశంబున నప్రయత్నంబుగా నీకు లక్ష్యం బయ్యె, నిట్టిది మానసిక లక్ష్యభేదన ప్రకారంబు.

వెండియు ని ట్టూర్ధ్వాధస్సమభాగంబులం దనరు చాక్షుషశాబ్దమానసిక లక్ష్యంబులం జిత్రలక్ష్యంబుల విచిత్రంబుగా లక్ష్యశుద్ధిమంతంబులైన శరంబులు నడపుచుఁ జిరాభ్యాసంబునం గృతహస్తుండై పురంబు వెడలి మృగయావినోదంబులు సలుపుచు నెగసెడు విహంగంబులను బరుంగులిడు కురంగంబులును పైకుఱుకు వ్యాఘ్రంబులును, గదలెడు విహంగంబులును, నడ్డంబు సను భల్లుకంబులును, గిరికూటస్థంబులగు సింహంబులును బడలుపడ సేయుచు ననవరతాభ్యాసంబున నైపుణ్యంబు సంపాదింపవలయు నభ్యాసబలంబులేని ధనుర్ధరుండు యుద్ధంబుల నపరాద్ధ పృషత్కుండగు, నట్లగుట మఱి వక యభ్యాసంబున నప్రమత్తుండు గావలయు నింకనుం గల విశేషంబు లాకర్ణింపుము. 71

సీ. అరి యేడునూఱుచిన్నంగల నిలఁ జూడ్కిఁ
దగు ననామికమీఁద నిగుడఁజేయ
నరి యాఱునూఱు చిన్నంగల నిలఁ జూడ్కిఁ
దగు ననామికమీఁద నిగుడఁజేయ
నహితుఁ డేనూఱు చిన్నంగల నిలఁ జూడ్కిఁ
దగు మధ్యమాధిష్ఠితంబు సేయ
గొంగ నన్నూఱు చిన్నంగల నిలఁ జూడ్కిఁ
దగుఁ దర్జనీసంస్థితంబుసేయఁ,

గీ. జెలఁగి శత్రుండు మున్నూఱు చిన్నయంగ
లందు నిలిచిన శర మగ్రమందుఁజూడ్కి
సేర నరివాపఁదగు నట్టి చిన్నయంగ
బారకొలఁదికి మూఁడవపాలు సుమ్ము. 72

వ. మఱియును. 73

క ఇన్నూఱు చిన్నయంగలఁ
జెన్నారెడు నహితుపై నజిహ్మగ మేయం

గ్రన్ననఁ దన్మకుటంబు ప
యి న్నెలకొనఁజేయవలయు నీక్షణ మనఘా. 74

గీ. అట్లు నూఱు చిన్నయంగల రిపుఁ డున్న
నిటలసీమఁ జూడ్కి నిలుపవలయు
నింక చిన్నయంగ నేఁబదియెడఁ గల్గ
దృష్టి చిబుక మనుసరింపవలయు. 75

వ. ఇట్టి కొలంది లక్ష్యభేదనంబునకుం గొందఱు ధనుర్ధరు లుపన్యసించిన
విశేషంబు గల దదియును వివరించెద నాకర్ణింపుము. 76

చ. ఎనుబది చిన్నయంగ లెడ మేర్తైఱఁ గల్గినవేళ లక్ష్యముం
బనుపడ మధ్యమాంగుళముపై నిడు మర్వది చిన్నయంగలం
దనరెడు వేళ లక్ష్యములఁ దర్జనిపై నిడు మంతలోపలన్
మొనసిన వేళ మార్గణపు మోమున లక్ష్యము నిల్పు ముద్ధతిన్. 77

గీ. మఱియుఁ గదిసినఁ బుంఖంబు మధ్యమంబు
నలుఁగు నేకాకృతిని శరవ్యంబునడుమ
చక్కనగ నట్లు దివియుచు సాయకంబు
లక్ష్యమున నొప్పగాఁదగు లక్ష్యవేది. 78

వ ఇట్లు పాదచారియై ధనురభ్యాసంబు సలుపు నభ్యాసికిం దగిన విన్నా
ణంబులుం బ్రవర్తిల్లుచుండు నింక రథగజాశ్వంబులనుండు శరా
భ్యాసికిం దగిన విన్నాణంబు లుపన్యసించెద నాకర్ణింపుము 79

సీ చామరధ్వజసితచ్ఛత్రాది పార్థివ
వ్యంజనంబుల భావరంజనంబు,
స్థానపంచక సముత్థానంబు గలుగు నా
యోధనంబులకును సాధనంబు,

పరశుపట్టిసగదా ప్రముఖాయుధోత్తమ
ప్రేరణంబులకును గారణంబు,
ఘనచిత్రలక్ష్యభేదనబాణ వేణికా
యోజనంబునకును భాజనంబు.

గీ. మొదలి హరిహరపురుహూత ముఖధనుర్ధ
రావతంసుల కభిమతంబై తనర్చు
నరదము తురంగ మాతంగకాది వివిధ
వాహనంబుల నుత్తమ వాహనంబు. 80

వ. వెండియు రథారోహకులకుం దగిన దృష్టి ముష్టిసంధానస్థాన శర
మోచనప్రకారంబులు మున్ను వక్కాణించితి రథారోహణంబుల
నట్టి విన్నాణంబులు మఱువక యాచరింపుచుం బ్రతివాసరంబును
రథారోహణంబు గావించి విలంబమధ్యమ తీవ్రయానంబుల నచంచ
లంబుగా శరసంధానమోచనంబుల లక్ష్యశుద్ధిఁ గాంచి రాణించం
దగు నింక సంగ్రామసమయంబుల రథారోహణంబు చేసి రథికుం
డాచరించు విన్నాణం బుపచరించెద నాకర్ణింపుము 81

సీ. బాణంబు గల శిరస్త్రాణంబుఁ గీలించి
ఘనతనుత్రాణ మొక్కటి ధరించి
రాణించు నంగుళిత్రాణంబుఁ గదియించి
కవదొనల్ పదిలంబుగా బిగించి
విద్యాగురూత్తంసు విభవంబుఁ గీర్తించి
విలుగొని రథమెక్కి విస్తరించి
రథముపై నొగలపై రథ్యంబులను భువి
నెలకొని శరములు నిగుడఁజేసి

గీ. కిరణపరిదాహ పరిణత స్ఫురణతరణి
కరణిఁ బరిణింపుచును రణాంగణమునందు

హ్రస్వుఁడును దీర్ఘుఁడును సూక్ష్ముఁ డలఘుఁ డగుచు
మెలఁగు రథికుండు క్రొక్కాఱు మెఱుఁగు పగిది. 82

సీ. తనమేను రథము రథ్యముల సారథిఁ గాఁచి
యని సేయువాఁడు మహారథుండు
మును పన్నిదములాడి మొనసిన విరథుఁడై
యందంద పఱచువాఁ డర్ధరథుఁడు
విరథుడయ్యును బోవవెన్నిక యచలుఁడై
యాలంబు సేయువాఁ డతిరథుండు
రథము వ్రీలినఁ బాసి రథికుఁడై క్రమ్మఱఁ
జావ మొత్తెడువాఁడు సమరథుండు

గీ. ప్రమందని హయంబు లుడివోని మార్గణములు
కందని రథంబు విఱుఁగని కార్ముకంబు
పడని సారథి సడలని పడగగలుగు
సింహవిక్రముఁ డతిరథశ్రేష్ఠుఁ డనఘ. 83

వ. మఱియును. 84

చ. బలముల నీవలావలను బాయవడం జొరనోలి నడ్డమై
నలువము మీఱగా నడపి నాలుగు పాయలు జేసి మూలలన్
వలయములన్ వడిన్ దెరపివారగ నుద్ధతి సూపి ఘోరపుం
దళములతోడఁ బార్థివుఁ డుదారతఁ బోరఁ దగున్ రథస్థుఁడై 85

వ. మఱియు నొక్క విశేషంబు గల దాకర్ణింపుము. 86

క. కేవలమగు రథికునకుం
దావలమగు పోరులందు దళలక్షణముల్
భావజ్ఞుండగు సారథి
భావింపగ వలయుఁ గార్యపరతంత్రుండై. 87

క. సారథి రథికునకంటె ను
దారుండగునేని మిగుల ధైర్యస్థైర్య
శ్రీరూఢుండై రథికుడు
వీరాహవకేళులందు విజయము నొందున్ 88

వ, అనిన నర్జునుం డాచార్యునితో నిట్లను మహాత్మా! యుద్ధరంగంబున రథికునకుం బోడము దశలక్షణంబులకు నభిధానంబు లెవ్వి యివ్వి రథంబున రథికుం బ్రబోధించినసారథి యెవ్వండు అట్టి విన్నాణంబు లెవ్వరివలనం బ్రసాదితంబులయ్యె నిట్టి విధానంబు పురాతనరథికనికరంబులం బ్రవర్తిల్లెనేనియు వినవలతుం జెప్పు మనిన మెప్పు నప్పాకశాసనతనయుని పాణితలం బప్పళించుచుం గుంభసంభవుండిట్లనియె.

గీ. రామరావణ సంగ్రామరంగవీథి
రఘుకులేంద్రుని ఘోరనారాచనిహతి
రాక్షసవిభుండు సొగయ సారథి రథంబు
దొలగఁ దోలెడు నంతలోఁ దెలసి యతఁడు. 90

వ. రోషారుణలోచనుండై సారథివదనంబు చుఱచుఱం జూచి యిట్లనియె.

సీ. చెఱసాల వడెసునాసీరుఁ డధీరుఁడై
 చకితుఁడై పఱచె వైశ్వానరుండు
బలిమి చాలక మాటుపఱచె మై శమనుండు
 పఱచె భీతిలి కోణపాలకుండు
పాశముల్ వమ్మైన భయమొందె వరుణుండు
 కాందిశీకుం డయ్యె గంధవహుఁడు
పుష్పకం బొసఁగి పెంపుఁ దొఱంగె ధనదుండు
 సత్వంబునకు మెచ్చె శంకరుండు

గీ. మచ్ఛరాసన నిర్ముక్తమార్గణాగ్ని
సకలజగములు సంక్షోభ మందుచుండు

మనుజమాత్రుండు గెలుచునె నను గడంగి
మఱలఁ దోలితె రథ మభిమాన మెడలి 92

వ అని కటకటంబడి పలికిన నులికపడి సూతుండు భీతుండై చేతులు మొగిచి నిటలతటంబునకుం దిగిచికొని, కొనియాడుచు మున్ను పుర త్రయభేదనంబునకు నుత్సాహంబున సన్నాహంబు సేయుచుం బుర హరుండు సారథ్యంబునకుం జతురాననను నోడంబఱచుటకునై యొక్క విశేషం బుపవ్యసించెద నది శుక్రుండెఱింగియుండుటం జేసి యేక తంబున మహాత్ముండు యోగనిష్ఠాపరాయత్తచిత్తుండై యుండు నవసరంబున దండప్రణామం బాచరించి నిటలతటఘటితాంజలి పుటుండనై వినయంబునం గొలిచియున్న నన్నుం గాంచి ప్రస న్నుండై యిట్లనియె. 93

క. సారథివై రథికునకుం
బోరుల విజయంబుఁ గూర్పఁబూనెదు నీకున్
సారములగు విజ్ఞానము
లారూఢి నుపన్యసింతు నవి యెట్లనినన్ 94

మ. సమరోత్సాహము దర్ప మింగితము హర్షంబున్ బురఃపారవ
శ్యము భేదంబు బలాబలంబులును దైన్యంబు న్నిమిత్తంబు భా
వమునం దీ పది లక్షణంబులను భావస్ఫూర్తి భావించి యు
ద్ధములన్ సూతుఁడు మేలుగూర్చి రథికుం దాఁ బ్రోచుటొప్పున్ భువిన్.

వ. అవి యిత్తెఱంగున సురగురుం డుపదేశించిన విజ్ఞానంబులు మఱువ కుండుదుం గావునఁ దత్తత్సమయంబుల భవన్ముఖలక్షణంబు లరసి తగిన విధానంబు లాచరింపవలసె, యుష్మద్విజయంబుఁ గోరిన నా యెడలం బ్రసన్నుండవగుమని ప్రార్థించు సారథింగాంచి ప్రసన్నుండై యుద్ధంబునకు సమర్థుండయ్యెనని పురాణేతిహాసంబున వినంబడు నట్లు గుట రథికు నుత్సాహదర్పేంగిత హర్షభేదదైన్య పారవశ్యబలాబల

నిమిత్తంబులను నామంబులం బరగు దశవిధలక్షణంబు లరయం జాలు సారథిం గైకొనునేని రథికుండు సకలలోకాధికుండై ప్రవర్తిల్లు చుండుఁ దక్కుంగల విశేషంబు లాకర్ణింపుము. 96

మ. రణదారోధనసాధనంబు రిపుజిద్రాజాధి రాజాధిరో
హణలీలాసుగమంబు శత్రుభయదండాభీలశుండా విజృం
భణదుస్సాధము సర్వతోముఖము భూపాలైకసామ్రాజ్యల
క్షణమౌ వారణమందుఁబోరఁదరమౌ స్థానంబులం దైదిటన్. 97

గీ. పాదచారియైన భద్రేభ మెక్కిన
రథము మీఁదనైన రణములందు
నాశుగముల నడప నగు శరవ్యంబుల
హయము మీఁద నడుపు టరిది సుమ్ము. 98

వ అట్లగుట సంగ్రామ సముచిత లక్షణలక్షితంబులగు హయంబులును, దదనుకూలంబులగు నలంకారంబులును, వలయు సాధనంబులును, వేఱు వేఱ నిరూపించెద నాకర్ణింపుము. 99

సీ కళ దేరు పీవరస్కంధంబు గలదాని
మెఱుఁగారు వెన్నున మెఱయుదానిఁ
గ్రమభావముఁ దాల్చు కర్ణముల్ గలదాని
యొఱపు దేరు కడింది యురముదాని,
గంభీర హేషా విజృంభణంబుల దాని
గుళుకు గిట్టల సౌరుగలుగుదాని
గుఱుమట్టమైన లాంగూలంబు గలదాని
మెఱుఁగారు వెన్నున మెఱయుదాని,

సముచితములైన శుభలక్షణములదాని
గరుడపవమాన వేగంబు గలుగుదాని
ఘోరరణముల విజయంబుఁ గూర్చుదాని
భవ్యమగు నుత్తమాశ్వంబుఁ బడయ వలయు 100

వ. విను మీయాదృశంబగు నుత్తమాశ్వంబుఁ బడసి ధనుర్ధరుండు యుద్ధంబుల నారోహణంబుఁ జేయందగు, వెండియుం దదనుకూలంబులైన యలంకారంబులు నిరూపించెద నాకర్ణింపుము. 101

సీ. హాటకస్థగితసింహాళలాటబిరుదంబు
సనిదేరుదిప్ష్టి పూసల సరంబు
మెడనాణిముత్యాలబెడఁగు లీనెడుచెండ్లు
పరిఘవిల్లుకడాని పసిఁడిగుండ్లు
కమనీయమాణిక్యనత్కనక పల్యాణంబు
నీలంపుటంకెవన్నియలడంబు,
చతురంకముల చలచ్చామరంబులదోయి
సతమాహుమానిజాంశాతురాయి,

గీ. చలివెలుఁగుఁజూఁగవాగె వజ్రపుఖలీన
మందములఁ గుల్కునందియ లజిదివాలు
తళుకుగల సింగిణుల్ మేలితరకసములు
భర్మమయ కార్ముకవలగ్నబంధనంబు. 102

వ. వెండియు నీదృశంబగునలంకారంబు భాండంబు నాఁ బరగు నిత్తెఱంగునఁ దురంగంబునకు నలంకరణంబు గావింపవలయు, నింకనాశ్వికులకు నశ్వారోహణంబులం దగినసన్నాహం బుపన్యసించెద నాకర్ణింపుము.

సీ భూరిరైరికచారుహీరకోటీరంబు
రమణీయమణిమయోరశ్ఛదంబు
భర్మనిర్మిత చర్మపట్టలలామంబు
కీలితాభీల కౌక్షేయకంబు
కరతలోజ్జ్వలహైమకార్ముకకోత్తంసంబు
స్థగితగోధాంగుళిత్రద్వయంబు
బాణావళీ పూర్ణతూణీరయుగళంబు
భరితకార్ముకమధ్యబంధనంబు

గీ. రహిం ధనుశ్శాస్త్రచోదితక్రమనిరూఢిఁ
దాల్చి వరభూషణంబులు తళుకు లొలుక
నంగముల సంగరోత్సాహ మావహిల్ల
హయముపై నెక్కఁదగు నుత్తమాశ్వికుండు. 104

వ. వెండియు నశ్వారోహకుండు శరసంధానమోచనంబుల నాచరింపందగిన విన్నాణంబు లుపన్యసించెద నాకర్ణింపుము 105

క. కట్టాయితముగ నిలువం
బట్టినహయ మెక్కి కదలి పార్ష్ణితలములన్
ధట్టింపుచు బలుచబుకునఁ
జిట్టాడం గొట్టవలయుఁ జిఱుప్రక్కలపై. 106

ఆ. అట్టి తాడనమున నతిశయం బొక్కటి
గలదు కరము శిరము గడచునట్టు
లెత్తి కొట్టవలయు నేడ్తెఱఁ జిఱుప్రక్క
లటిమి కొట్టరాదు పిఱుఁదులందు. 107

వ. అట్లుకశాఘాతంబులన సత్వరంబు గావించియు సజ్యంబగు శరాసనంబు వామహస్తంబున నలవరించి క్రమ్మఱఁ గశాభిహతి నశ్వంబున కుద్వేగంబు సంపాదించి తోడనవాఁడిగలుగు బాణంబు తూణంబును దివిచి గుణంబున యథావిధి సంధానంబు గావించి చతురస్రముష్టిం బ్రథమద్వితీయాంగుళమధ్యంబునను స్థిరంబుగా నిలువంబట్టి వెండియుఁ జబుకునఁ జుబుకనం గొట్ట ధట్టించి హయంబునకు రయంబు సంపాదించి మఱియును, 108

సీ. తనకొలందికి నేయఁదగిన దూరంబున
మూఁడు భాగముల నిమ్ముగ విరోధి,
మలయ డాపలికాలి మడమ నంకెనమీఁద
సదృశంబుగా నూది చాపయష్టి,

వామాంఘ్రి సమముగా దీమసంబునఁ బట్టి
దృఢలీల నిండారఁ దిగిచి శత్రుఁ
డా మూఁడు భాగమ్ములందును మూఁడు భా
గంబులకొలఁది డగ్గఱిన పిదప

గీ నడచు గుఱ్ఱంబు చెవిప్రమాణంబు గాఁగ
మానస మచంచలంబుగా మనిపి శరము
రీవి నడపించి కేలు ఝాడింప వలయు
నసమసమరాంగణమ్ముల నాశ్వికుండు. 109

గీ. హయముఁ నదలించినది మొద లంచితముగ
నాశుగోత్తంస మరివాపు నంతదడవు
లక్ష్యమున దృష్టి నతినిశ్చలంబు గాఁగ
నప్రమత్తుఁడై యిడఁదగు నాశ్వికుండు. 110

క. తురగంబుం బరగింపుచు
శరసంధానమ్ము సేయ సమకొనుచోఁ జె
చ్చెఱ నెడమకాలియంకెన
పొఁబొరి నంగుళమువాసి పొడ విడవలయున్. 111

గీ, ఎడమపాద మూన నించుక హెచ్చుగా
నిడక యంగుళంబు లేకరీతి
నునిచె నేని బాణ ముబికింప నూనుచో
ద్రొగ్గతిల్లు సాది ముంగలికిని 112

వ. మఱియు నొక్క విశేషంబు గలదు. 113

క. అంకెనపై దాపలి యడు
గుంకువగా మిగుల భార మూనఁగఁ దగ ద
య్యంకనబంధము వీడును
సంకటమున టంగువాఱు జాఱు శిథిలమై 114

ఆవిధమున నడ రొదవ్వుం
గావున భారమ్ము సమముగా నిడవలయుఁ
దా వామాంఘ్రితలంబున
కావలితంబై తనర్చు నంకెనమీఁదన్. 115

అనిన నాచార్యునకు నర్జునుం డిట్లనియె. 116

చ. దురమున నుగ్రపుఁ రిపుల తోరపు ఘోరపు టంపవెల్లి వి
స్తర మరుదేర వారలకుఁ జాలి శరాలి నొగి న్నిగుడ్చుచుఁ
బరిగొనుచుఁ బిఱిందిదెసఁ బైకొను శాత్రవు నేయ గుట్టముఁ
మరలుపరామి నాశ్వికుఁడు మార్గణముల్ నిగుడింప నెట్లగుఁ. 117

వ. అదియునుం గాక. 118

క. కరిరథసంబాధంబై
తురఁగము మఱలింపరానిత్రోవఁ బోవఁ
బరవీరులు వెనుకొనఁగా
శర మెట్లరివాపవచ్చుఁజాపధరుఁ డిలన్ 119

వ. అనిన నాచార్యుం డిట్లనియె 120

అంకెనల మీఁదఁ బాదంబు లాని లేచి
వెనుమఱలి రొమ్ముపల్లవు వెనుకఁ గోటి
సమముగా వాంచి తిర్యగిష్వాసుఁ డగుచు
మెఱపు మెఱసినగతి నమ్ముఁ బఱపవలయు. 121

వ. విను మట్లు చాపంబు తిర్యక్సమశృంగంబుగా నాకర్షింపక తొల్లింటి తెఱంగున నాకర్షించిన శృంగంబునకు భంగంబు సంప్రాప్తంబగు నీదృశంబగు శరప్రయోగనైపుణ్యంబు చిరాభ్యాసంబున నధికరింపం దగు. వెండియు నాశ్వికునకుం దగిన చిత్రయుద్ధ ప్రకారం బుపన్య సించెద నాకర్ణింపుము. 122

## — దండకము —

శ్రీ జానకీమానసాంభోజమిత్రా సుమిత్రాసుతానూదిత స్తోత్ర పాత్రా, సుపాత్రానిశప్రాపితామేయగోత్రా, సుగోత్రామరశ్రీ పరిత్రాణ చిత్రా, అహో రామ ధాత్రీకళత్రా, సతం బీవనీపట్టణాస్థానసింహాసన స్థాయివై యున్న నిన్నుం బ్రకీర్తించుచుం గుంభజుం డర్జునుం గూర్చి బోధించు నీయాశ్వికాభంగ సంగ్రామరంగ ప్రసంగంబులన్ వాక్ప్రసూనంబులం దండకాకారవా చిన్నిపూదండ గావించి మీ దివ్యపాదారవిందంబులందున్ సమర్పించి సేవించెదన్ సత్కృపార్ద్రైకభావంబునం బ్రోవవే, సాదరుండై గురుం డానరుం గాంచి తోషించి భాషించి వేడ్కన్ బెడంగైన చెన్నుల్ విడంబించుకన్నుల్ మెఱుంగారుమేనున్ తెఱంగైన కానున్ ససిందేరునిమ్మున్ బిసాళించు రొమ్మున్ సిరుల్ గూర్చువాహంబు పైపచ్చడా లంకెవన్నెల్ రవాళించుబంగార పున్నీరులన్ సారులన్ దేరు పల్యాణమున్ మేలిముత్యాలచెండ్లున్ సొబంగారు బంగారు గుండ్లున్ జిరా కెంపురాసొంపురాణింప నింపౌఖలీనంబు నీలాలడాలై విరాళించుమేల్వాగె బాగా నిజాంశాతురాయీ చలచ్చామరంబుల్ లసన్మండలాగ్రంబు తూణీరముల్ మేనిసింగాణివిండ్లున్ ధనుర్మధ్యమాధారబంధంబునున్ లోనుగా యుద్ధరంగోచితాడంబరంబుల్ విడంబంబునం గూర్చి తేరం గిరీటంబునున్ గంటకంబున్ దిటంబైన గోధాంగుళిత్రాణముం దూణముం బాణబాణాసనంబుల్ న్మేఖలాబంధమున్ మెచ్చఁగా సద్ధనుర్మధ్యమాధారబంధంబు సమ్యగ్వలచ్చర్మపట్టీలలామంబు సేమంబునం దాల్చి సన్నద్ధుఁడై యుద్ధతిన్ వాహ ముత్సాహముల్ మీఱఁగాఁ దీరుగా నెక్కుచున్ గ్రక్కునన్ నిక్కి యేదిక్కునం దానయై యాశ్వికాగ్రేసరుం డశ్వమున్ విశ్వమున్ మెచ్చఁగా హెచ్చి రానిచ్చుచుం గ్రచ్చుఱన్ మెచ్చుచున్ డాయుచున్ బాయుచున్ వ్రేయుచున్ మ్రోయుచున్ వైరులం బోరులంజీరికిం గోక వెన్నిక మున్నావలం దావలంబై చలంబాఱ బోరాడ బేర్వాడిక్రొవ్వాఁడివాలమ్ము ఫాలమ్మునన్ నాటి ధాటిన్ విరోధిన్ నిరోధించుచున్ ఘోరమై నీరధిన్ దూఱు పెంజోరలీలన్ సఖేలంబుగా

శాత్రవవ్యూహ ముత్సాహియై చొచ్చి యొక్కొక్కచోఁ గాలఁ దాటించి
చోదాటుదాటించి బాణంబు తూణంబునం దీసి పెల్లేసి యుల్లాసియై
యట్టహాసంబు భాసిల్ల మల్లాడుచున్ బారెటన్ నిల్పుచున్ మూరెటన్
మల్పుచున్ కోపులన్ ద్రిప్పుచున్ తూపులన్ గ్రుప్పుచున్ శత్రు లుద్గా
త్రులై నెట్టనం జుట్టునం జుట్టినం దిట్టయై ముట్టి ఢేయంచు వేయంచు
వాలంబులన్ దత్తడిం దిర్దిరం ద్రిప్పుచున్ విల్లు చక్రాకృతిన్ బర్వఁగా
దుర్విగాహైకసంధాన పారీణుఁడై నూఱు నిన్నూఱు మున్నూఱు నన్నూఱు
నేనూఱు నార్నూఱుగాఁ దూపులన్ వీపులన్ వైపులన్ బ్రక్కలన్
జెక్కులన్ మేనులన్ వీనులన్ ద్రొక్కటం జక్కఁగా నుస్సి పాఱం
బ్రయోగింపుచున్ ద్రుంపుచున్ సొంపుగాఁ బెంపుగావింపుచున్ డాయ వేచా
యలన్ మాయలన్ సాయకంబుల్ రకం శార నేయం జయోదారుఁడై
ధీరుఁడై పైకి రానీక క్రొక్కారు మేఘంబునన్ దోచు విద్యుల్లతాధోరణిన్
దారుణాధోరణప్రేరణశ్రీరణద్వారణోత్సారణక్రూరనారాచధారాళధారా
ప్రసారంబు ఘోరంబు గావింపుచున్, బారులై తేరు లొక్కుమ్మడిన్
గ్రమ్మినన్ హుమ్మురంచున్ హయంబున్ రయం బారగాఁ జుట్టుపేరెం
బులన్ ద్రోలుచున్ దా రథున్ సారథిన్ యుగ్యమున్ బగ్గమున్
జాపమున్ రోపమున్ దండియై ఖండముల్ సేయుచున్ జిత్రసంచార
దుర్వారుఁడై శూరుఁడై లోకముల్ మెచ్చగా శత్రుసందోహమున్
దోలి భాస్వజ్జయశ్రీ సమారూఢుఁడై హారనీహారడిండీరపాటీరకర్పూర
మందారగోక్షీరవిస్ఫారకీర్తిస్ఫురన్మూర్తియై భాసిల్లరే కల్కితేజీ అయా
రేహుమా మేల్బళీ సత్కిలీనాశ్వరత్నంబ నీధాటికిన్ విద్విషత్కోటి
పేరోటమిన్ గూటమిన్ బాసి రంచున్ జెవు ల్మొట్టుచున్ గంరమున్
దట్టుచున్ బెంపు వాటింపగా నొప్పు నంచున్ గురుం డశ్వయుద్ధప్రకారం
బుదారస్థితిం జెప్పినన్ మెప్పునం గాంచి పూజించి పార్థుండు సంతోష
వార్ధిన్ వెసం దేరుభావంబుతోఁ దక్కునుం గల్గు విన్నాణముల్ సెప్ప
మంచున్ బ్రకాంక్షించె యుష్మత్పదాబ్జద్వయీచిహ్నితంబైన యీ
దండకం బిట్టు లాచంద్రతారార్కసంస్థాయి గావించుచున్ మేలు రావిం

చుఱుక్ బ్రోవవే దేవ దేవాధిదేవైక విశ్రామసీమా శుభస్థేమ కోదండ
రామా నమస్తే నమస్తే నమస్తే నమః 123

వ. చిత్రయుద్ధప్రకారం బుపన్యసించి మృగయావినోదంబుల నానావిధ సత్త్వంబుల నధికరించి శరంబు లేయం దగిన విన్నాణంబు లాకర్ణింపం దగుఁ గుతూహలాయత్తచిత్తుండగు పార్థునకు నాచార్యుం డిట్లనియె.

క. ఆకాశంబునఁ బక్షులఁ
బ్రాకటముగ నడవులందు బహువిధగతులం
దీకొను మెకములఁ నేయ వి
వేకమ్మునఁ గలవు సుమ్ము విన్నాణంబుల్. 125

సీ. వీను లక్ష్యము చేసి విశిఖ మేసిన గాఁడి
పాఱు వీపున నైన బ్రక్కనైన
నురము లక్ష్యము చేసి యఱవాప నోనాటు
శరము రొమ్మున నైన జబ్బనైన
మొగము సూపిన గళంబున సోకుగళము ల
క్ష్యంబు జేసిన నాటు జంఘ నైనఁ
ద్రోటి లక్ష్యముసేయఁ బాటవమ్మున నాటు
గళమున నైన వక్షమున నైనఁ

గీ. పఱచెడు మెకంబునకు నెదుర్పడినకిటికి
కుడియెడమ లడ్డముగఁ బ్రాఁకు క్రోలుపులికి
గగనమున నేఁగు పక్షికి గ్రమముతోడ
నభ్యసింపఁగ నగు నేర్పు లాశ్వికునకు. 126

వ. విను మొక్క విశేషంబు గలదు కార్ముకంబుల సారంబును బరచెడి మృగంబులవేగంబును శరంబుల తారతమ్యంబును భావించి లక్షీకరించిన యవయవంబునకుం గురంగట మనోభావంబునకుం దగిన దూరంబున లక్ష్యం బిడి శరంబు నినుపం దగు నిట్టియోజానా వైద

ధ్యంబు చిరాభ్యాసబలంబునం బ్రాపించు నింక దూరాపాతన శరా
భ్యాసంప్రశంసం బుపదేశించెద నాకర్ణింపుము 127

సీ. దూరపాతనమున కారూఢి నొందిన
మూఁటిలోపల శిలీముఖము లెస్స
ఆశుగంబులలోన నది సుకుమారంబు
సంధానమున నేర్పు చాలఁ గలుగు
దిరుగు నడ్డము ప్రాఁకు నరచెయ్యి నగలించు
వలకేలు చులకగా వదలకున్న
గాలివాటముఁ జూచి గగనంబు పంచుట
సంధిల్లు దీనికి సాధనంబు

గీ. వణఁకగానీక చెంగట వ్రాలనీక
విరిగి పడనీక నటు నిటు వ్రీలనీక
నలిశిలీముఖ మొప్పఁగా నడప నేర్చు
జనుఁడు కోదండదీక్షావిశారదుండు. 128

వ. విను మిట్టి దూరాపాతన ప్రయత్నంబునకు సమీరప్రేరణగ్రహణ
పూర్వకంబుగా నభోవిభజనంబు గావించ నేర్పు గలుగుట ప్రథ
మాంగంబగుటం దద్విభజనోపాయం బుపన్యసించెద నాకర్ణింపుము.

క. ఏదిక్కున కనుకూలం
బై దారకొను పవనవేగ మాదిక్కునకున్
మోదంబున నభిముఖుఁడై
ప్రోది సమస్థానకంబు పూని నిలుచుచున్. 130

గీ. తనశిరోమధ్యముననుండి ధరణి నంటి
నట్లు ముందరఁ గనుపడు నాకసంబు
మూఁడు భాగములుగాఁ బంచి ముష్టిక్రింద
భాగములు రెండు పై నొక్కభాగ మునిచి 131

క. ఆయొత్తునసె శిలీముఖ
[illegible]మేయం దగు నించుకంత హెచ్చును దగ్గన్
జేయక నైపుణ్యంబునఁ
బాయక దూరాభిపాత పరిచయమునకున్. 132

క. పగ లాకాశము పంచుట
సుగమము గాదేని రేయిఁ జుక్కలు గుఱిఁగా
గగనంబు మూఁడు పాళ్ళుగ
విగణింపఁగ వలయు భావవీథి నిపుణుఁడై 133

గీ. అట్లు భావించి భాగద్వయాయతముగ
వేణుదండంబు గుఱుతు గావించి నిలిపి
దానిపైఁ గార్ముకపుముష్టి నూని దూర
సమభిపాతనాభ్యాసంబు సలుపవలయు. 134

క. కోటల పేటల తోటల
మాటుల విభజింపఁ జనదు మన్నున్ మిన్నున్
గూటమివలెఁ గనుపడుటకుఁ
జాటున నాలోకనంబు సమకొన కునికిన్. 135

క. కావునఁ బంచుట బయులునఁ
గావింపగవలయు సుమ్ము గగనము బుద్ధిన్
భావించియుఁ దారావళి
భావించియుఁ బగలు రేయి పరిపాటి మెయిన్. 136

వ. వెండియు నొక్కవిశేషంబు గలదు 137

గీ. ఆకసంబు కొంద ఱైదు భాగములుగాఁ
బంచి రెండు పాళ్ళు పై ఘటించి
మూఁడు పాళ్ళు చాపముష్టిక్రింద ఘటించి
లీల నడుపుదురు శిలీముఖంబు. 138

వ. ఇట్లు సమీరప్రేరణపూర్వకంబుగా గగనంబు విభజింపం దగు నింక దూరాపాతనంబున కభ్యాసక్రమంబు గల దాకర్ణింపుము 139

సీ. మును ప్రమాణంబుగాఁ గొనిన దండము మీఁదఁ
జాపముష్టి ఘటించి శరము దొడిగి,
తెగవాపి శరము మేదినికి వ్రాలు కొలంది
భావించి యది మూఁడు పాళ్ళు చేసి,
భాగ మీవల రెండు భాగంబు లవలఁగా
నభమున నాఱు జేనల కొలంది,
పిటకంబు రజ్జులంబితముగాఁ గీలించి
యాపిట్య లక్ష్యమై యమరఁ జేసి

గీ. మునుపు దాను శిలీముఖ మొనరఁ దొడగు
వజ్జఁ గొలగట్టపై ముష్టి పాదుకొలిపి
పదపడి శిలీముఖంబులఁ బఱపవలయు
దినదినంబున నభ్యాసమునఁ జెలంగి. 140

వ. వెండియు నొక్క విశేషంబు గలదు. 141

సీ. ఆలక్ష్యపిటకంబునందు గోధుమపొట్టు
నిండార నేర్పున నినుపవలయు,
పెనుపొందఁ గార్పాసబీజముల్ నించిన
నంతకంటెను లెస్సయై తనర్చు,
నదియుఁ జతుష్కోణ మైనను యోగ్యంబు
వృత్తమైనను బరమోత్తమంబు,
మృదులతావలయనిర్మిత మైనమే లగు
వైణవం బైనను వాసికెక్కు,

గీ. కడిమి నాలక్ష్యపిటకంబు గాఁడిపాఱఁ
జాలు దూరాభిపాతనశరచయంబు

మొదలఁ గొలగట్టపైఁ జాపముష్టి నిలిపి
నిరత మభ్యాసమునకు నై నిలుపవలయు. 142

గీ. తొలుత నభము పంచి కొలగట్ట యార్జించి
యిట్టి పరిచయంబు లేచటనైనఁ
జేయవచ్చుఁగాని చెలఁగి యాకాశంబు
పంచరాదు బయలుఁ గాంచఁడేని. 143

వ. ఇవ్విధంబున నభోవిభజనప్రమాణంబగు వేణుదండంబుపై ముష్టి నిలిపి యభ్యాసంబు సేయుచుం జిరాభ్యాసంబున లక్ష్యశుద్ధిం గాంచి బయలున శరంబులు నడపుచు ముష్టిగతంబులైన తారతమ్యంబులు భావింపుచు నైపుణ్యంబు సంపాదింపం దగు నిందు పురాతనధనుర్ధరసంప్రదాయవేద్యంబై సుధీజనహృద్యంబైన చోద్యంబు గల దాకర్ణింపుము. 144

సీ. కొలగట్టపై ముష్టి నిలిపి మున్నేసిన
యభ్యాసపరిచయం బాత్మ నిలిపి,
బయలున గగనంబు పంచి భాగద్వయ
మడుగున విలసిల్లునట్లు గాఁగ,
కార్ముకముష్టి పొంకముచేసి విశిఖంబు
నిగుడించి చూడ్కులు నిగుడఁజేసి,
యూఢిమై శరము ధారుణి గాఁడి యుండిన
చోటున కరుదెంచి చూడవలయు,

గీ. ముష్టి గగనంబు పంచినదృష్టితోడ
నుచితవైఖరి నచలమై యుండెనేని
జానుపర్వంబునకుఁ బింజ సమముగాఁగ
లీల ధర గాఁడియుండు శిలీముఖంబు. 145

వ. వెండియు నట్లు ధరం గాఁడిన శిలీముఖపుంఖంబు జానుపర్వంబునకు దల కడచి, కార్ముకముష్టిభాగద్వయంబున కతిక్రమించిన దనియును

శిలీముఖపుంఖంబు జానుపర్వంబునకు దిగువం జోఁచిన భాగద్వయం
బునకు దిగువంబడిన దనియుష్షు భావంబునం దెలియుచు నుభయ
మధ్యగంబుగా బ్రమాణంబున ముష్టి నలవరించి విన్నాణం బార్జింపం
దగు మఱియును. 146

సీ. ప్రాక్సమీరంబు నిర్భరలీల విసరుచోఁ
బ్రత్యఙ్ముఖంబుగాఁ బఱపవలయు,
దక్షిణానిలడింభ మక్షీణమైనచో
నెఱి నుదఙ్ముఖముగా నినుపవలయు,
ప్రత్యక్సమీరంబు భాస్వరంబైనచో
నలిని బ్రాఙ్ముఖముగా నడపవలయు,
నాగి నుదఙ్మారుతం బూర్జితంబైనచోఁ
దఱి నవాఙ్ముఖముగాఁ దార్పవలయు,

గీ. ప్రోది జలములపై నేయరాదు మొయిలు
నభముఁ బ్రాకెడువేళల నడపరాదు
గాడ్పు నెదిరించునట్లుగాఁ గడవఁజనదు
సాయకము గాలిపుల కడ్డ మేయరాదు. 147

వ. ఇట్లు సమీరప్రేరణగుణదోషవినిభాగంబును, గగనవిభజనోపాయం
బును, దూరాపాతనంబుల నభ్యాసంబుల తెఱంగును, వెండియు
నయ్యెయెడలం గలుగు విశేషంబులు నేర్పరించితి ననవుడుఁ
పార్థుండు కృతార్థుండై యాచార్యునకు వందనం బాచరించి వెండియు
నిట్లనియె. 148

క. అనఘా దూరాపాతం
బునకుం దానకము దృష్టి ముష్టియు వేర్వే
ర నిరూపింపందగు నన
ననిమిషపతిసుతునితోడ నాచార్యుఁ డనుఁ. 149

సీ. చెలఁగు నాలుగుకోలందుల శరాసనముల
పదియేను పిడియలై పరగునిట్లు,
వెలయు దూరాపాతివిశిఖద్వయంబులో
లీల రాజిల్లు శిలీముఖంబు,
సంధిల్లు సూచితస్థానపంచకములో
మానితం బగు సమస్థానకంబు,
ముదము సంపాదించు ముష్టిత్రయంబులో
వర్ణనీయంబైన వర్తులంబు,

గీ. నైకమగుదృష్టులందు నుల్లోకితంబు
నలరు ఋతువులలోన గ్రీష్మాగమంబు
లలినిగార్ముకవిద్యావిలాసకలనఁ
దనరు దూరాభిపాతనంబునకు ధరణి. 150

సీ, అంగయష్టిక తిన్ననై యుండఁగావలె
నూరువుల్ చక్కనై యుండవలయు,
తనపూన్కి కుడియడుంగున నూనవలె విల్లు
హాయముపల్లము భాతి నమరవలయు.
శరము సాదితెఱంగుఁ బురణింపఁగావలెఁ
దివియుచోఁ డాకేలఁ దివురవలయు
సమకోల్ప నెడమకేల్ జాడింపఁగావలెఁ
నరివాప శరము బిట్టడరవలయు.

గీ. నాకసము పంచి దృఢముష్టి నధిగమించి
విశిఖపుటలుంగు మొనమీఁద విస్తరించి
నడచు బాణంబుతోఁగూడి నభముఁ బ్రాఁకి
దృష్టి లక్ష్యప్రదేశంబు దివురవలయు. 151

వ. వెండియు నభ్యాసంబున సర్వసాధారణంబుగా ధనుర్ధరులు శరంబులు
నడపందగిన కోలందులు వివరించెద నాకర్ణింపుము. 152

గీ. పరపు నిన్నూటయేఁబది బార లొకఁడు
పరపు మున్నూటముప్పదిబార లొకఁడు
పరపు మున్నూటయిఱువదిబార లొకఁడు
పరపు విశిఖంబు నన్నూఱుబార లొకఁడు. 153

వ. మఱియు నిరంతరాభ్యాసబలంబున నేనూఱుబారలకొలంది విశిఖంబు నడుపందగు నిదియును సకలజనసాధారణంబు గాకుండు నైనను నొక్కవిశేషంబు గల దమూల్యంబులగు శరాసనంబులును ననర్ఘ్యంబులగు శిలీముఖంబులును ననుకూలంబులగు సమీరప్రేరణంబులు కలిమిం జేసి కొన్ని దేశంబుల ధనుర్ధరులుకొలంది నతిక్రమించి యేయం జాలియుండుదు రదియును సాధనబలబునం గాని యభ్యాసబలంబునం గాదని నిర్దేశింపందగు నవియును వివరించెద నాకర్ణింపుము. 154

సీ. నడుపుదు రీహస్తినగరంబు వారలు
ప్రదర మేనూఱుబారల కొలంది
బాణంబు సౌవీరపతు లేతు రేనూట
నలువదినాల్గుబారల కొలంది
పరగింతు రంబు నేపాలభూపాలకుల్
రహి నాఱునూఱుబారల కొలంది
సాగింతు రంబు కోసలదేశవాసులు
లలి నేడునూఱుబారల కొలంది

గీ. సలిలములగాఁడ్ప లేవేళ నొలయు చుంట
శార్ఙ్గము శిలీముఖంబును జబ్బు వారి
తలగ దిన్నూఱుబారల కొఁలదిమీఱి
యిషువు బంగాళభూపతు లేయునపుడు. 155

వ. వెండియు నేడునూఱుబారల కొలంది శిలీముఖంబు లతిక్రమింప నేయం జాలిన కౌశలంబు మంత్రబలంబునంగాని సాధనాభ్యాసబలంబులం గాదని నిర్దేశింపం దగు మఱియును. 156

సీ. కొన్ని జాంగలములు కొన్ని యనూపములౌ
జాంగలానూప మిశ్రములు కొన్ని
గిరిశిలాగహనసంకీర్ణంబులైన దే
శంబులు గణుతింప జాంగలములు
[illegible]ప్రవాహసంబాధంబులైన దే
శంబు లనూపాహ్వయంబు లయ్యె
[illegible]ధరాంబుపూరసముచిత దేశంబులు
జాంగలానూప మిశ్రములు సుమ్ము

ప్రత్యరం బగు జాంగలస్థలములందు
నతివిలంబ మనూపంబులందు నుభయ
మిశ్ర మగు జాంగలానూప మిశ్ర దేశ
ములశిలీముఖగమనమ్ము తలంప నవని. 157

గీ. వృషభమిథునములను వినుము దూరాపాత
విలసనంబు సలుప విహిత మండ్రు
అట్టివేళనైన నంబువాహంబులు
నింగిఁ బ్రాఁకె నేని నినుపవలయు. 158

క. బలువిడి శార్ఙ్గమ్మునకును
జలి సోఁకిన నూలుకొలుపఁజాలదు జడమై
యలకనిబాణం బైనను
జలు వానిన దూర మరుగఁ జాలదు వలమై. 159

గీ. శార్ఙ్గ మొకవత్సరము గడచనిన రెండు
వత్సరంబులయది మూఁడువత్సరముల
యదియు దూరాభిపాతనార్హంబు లైన
శరము లరివోయుటకుఁ జూవె సముచితంబు. 160

క. ఒకవత్సరంపు శార్ఙ్గము
వికటంబగు పన్నిదమున విశిఖము దొడుగన్
సుకరంబగు విలుకాండ్రకుఁ
బ్రకటాభ్యాసంబునకును బనుగొన దనఘా. 161

చ. గణుతికి నెక్కుచుండు విలుకాండ్రు శరం బడరించువేళ స
ద్గుణములు మూఁడు పాటిలఁ దగున్ విశిఖంబునఁ దీవ్రవేగముక్త
ద్రోణకమి లక్ష్యభేదనము తోరపుటంపరవెల్లి నిట్టులీ
గుణములు గల్గునట్లుగ నిగుడ్చునివాఁ డొకధన్వియే మహిన్ 1౬2

సీ మది నిష్టదేవతామననంబు సలుపుట
విద్యాప్రదాయకు వేడికొనుట
ధనురాగమప్రబోధమున రాణించుట
శస్త్రాస్త్రమంత్రవిస్తరము గనుట
శరశరాసనవిశేషములు భావించుట
సంతతాభ్యాసంబు సలుపుచుంట
శరయోజనార్హమౌ సమయం బెఱుంగుట
కుశలుఁడై లక్ష్యంబు కొలఁది గనుట
సమబలం బైనట్టిచాప మార్జించుట
గుణము యోగ్యంబుగాఁ గూర్చికొనుట
మఱి ధనుశ్శరముల మంత్రముల్ వ్రాయుట
వైపులు భావించి వలను గనుట
యేపుమై దృఢముష్టిఁ జాపంబు దాల్చుట
సముచితస్థానసౌష్ఠవము గనుట,
తగులీల నంగుళిత్రాణం బమర్చుట
పదనైన బాణంపుహదను గనుట,
సమధికస్థితిఁ బింజ సమముగా నదుకుట
యాకర్షణమున సోయగము గనుట,

చక్కఁగాఁ జూడ్కి లక్ష్యమునందు నిల్పుట
చిత్తమాయత్తంబు చేసికొనుట,
సదమలస్థితి వీపు గదలనీకుండుట
ధనువుచాటున రొమ్ము దాచుకొనుట,
కొమలు వంగినముష్టి గుఱుతుగా నిలుపుట
మునుకొని కనుబొమల్ ముడువకుంట,
పలుమొన లధరంబుపై నూనకుండుట
సరవిపై గడ్డంబు సాచకుంట,
నరములకీళ్ళతిస్పందనంబు సూపుట
యంగంబు లచలంబు లై తనరుట,
నిట్టూర్పు సలుపక నిండారఁ దివియుట
తివియుచున్నెడ నోరు దెఱవకుంట,
యాకుంచితమున నర్ధాంగంబు కుంచుట
ప్రేరితంబున విస్తరిలి వెడలుట,
యుద్రేకమునఁ బుంఖ ముఖికింపఁ జూచుట
చాపముష్టి నలుంగు నసిఁబఱచుట,
సారిదిమ్మెఁ బుంఖంబు చులకఁగా వదలుట
సింహంబులీల గర్జిల్లుచుంట,
తీవి డాకేలు జాడింపఁగా నేర్చుట
ప్రోదిమై సమపదంబున నిలుచుట,
పౌరుషంబునకుఁ జాపము కౌఁగిలించుట,
తెగవాపి విశిఖమ్ము తెఱఁగు గనుట,

గీ. బాణములు సత్వరములుగాఁ బఱపుటకును
దాణఁకక నలోలవై ఖరిఁ దూఁగుటకును
కఠినలక్ష్యంబు భేదింపఁగలుగుటకును
ఘనత ఘటించు నలువది కౌశలములు,

వ. రెండియుని న్నలుబదికౌశలంబుల నప్రమత్తుండై శరంబును నడపిన ధనుర్ధరుండు లక్ష్యశుద్ధిం బడసి కృతార్థుండగు, మఱియు నిష్టదేవతానుస్మరణంబునుం గురుస్మరణంబునుం గాక తక్కంగలుగు నీ యష్టత్రింశత్కౌశలంబులం బండ్రెండుచోటులం గరణీయంబులైన నాల్గు విన్నాణంబులు ప్రవర్తిల్లుచుండు నని సంక్షేపరూపంబుగా ధనురాగమసంప్రదాయజ్ఞులగు కొందఱు విన్నాణం బుపన్యసించుదురు. అత్తెఱంగు వివరించెద నాకర్ణింపుము. 164

ఉ. పోఁడిమి నంబకంబు నరివోసి వడిం దెగవాపువేళలన్
మూఁడిట మార్దవంబు మఱి మూఁడిటిలోనఁ గఠోరభావముల్
మూఁడిట నార్జవం బవల మూఁడిటిలోన సమానభావమున్
జూడఁగ నాల్గు చైదములు సొన్పుఁ దగున్ బదిరెండుచోటులన్. 165

క. శరసంధానంబున భా
సురకార్ముకముష్టి నమరు జుట్టనప్రేలన్
గర మర్థి నెడమప్రక్కకు
నిరుపమగతి మార్దవంబు నిమపఁగవలయున్ 166

చ. హదనునఁ జాపముష్టి వలహస్తపుజుట్టనప్రేల సవ్యపున్
బదముఖమున్ దగున్ గఠినభావము గైకొనఁగా లలాటమున్
వదనము కూర్పరంబులును వాసి గనందగు నార్జవంబునన్
బదకరనేత్రయుగ్మములు పాటిల మేలు సమానవై ఖరిన్ 167

వ. రెండియుఁ బండ్రెండుచోటుల నిన్నాలుగు విన్నాణంబులు గావించు తెఱంగు ప్రకరణానుసారంబుగా నయ్యైవేళల విస్తరంబునం బ్రస్తావించితిం గావున సంగ్రహంబుగా నుద్దేశించితి నింకనొక్క విశేషంబు గల దిన్నాల్గు విన్నాణంబులం బరిఢవిల్లు నిన్నలువది కౌశలంబుల ననాదరంబున నెవ్వండేని శరంబులు నడపిన నతనియుపేక్షం జేసి శరగమనంబున ననేకదోషంబులు గలుగు నవియును వేఱువేఱ వివరించెద నాకర్ణింపుము 168

సీ. తమి దేవతా గురుధ్యానముల్ మఱచినఁ
బన్నిదంబుల విద్య భంగపరచు
ధనురాగమ ప్రబోధంబు సంధిలదేని
విద్యాపరీక్షల వెఱపుఁ దోఁచు
శస్త్రాస్త్రమంత్ర విస్తరము చేకుఱదేని
పరభయానక లీల పాదుకొనదు
చులకని బాణంబు బలు శరాసనమునఁ
దూఁగించ జబ్బుగా నేగుచుండుఁ
జలకనివింట నగ్గలమైన విశిఖమ్ము
సమకొల్పఁ గ్రక్కున సనక మాను
సతత మభ్యాసంబు సలుపఁజూడనిచోట
లాఘవంబునఁగాదు లక్ష్యశుద్ధి
సమయం బెఱుంగక చాపంబు బూనిన
నేపుమై పంత మీఁడేరకుండు
కుశలుఁడై లక్ష్యమ్ము గొలఁదిఁ గన్గొన కేయు
తఱి శరవ్యమునందుఁ దవుల దమ్ము
దుస్సహంబగు వింటఁ దొడిగిన శరము చెం
గట వ్రాలు గాత్రంబు కంప మందు
గుణము యోగ్యంబుగాఁ గూర్చనిచో విల్లు
నాద మీఁదు శరంబు నడుమ వ్రాలు
ధనురాశుగములు మంత్రము లోలి వ్రాయక
తొల్చునేని సురక్షితములు గావు
వైపు లిట్టటుగాఁగఁ జాపంబు దాల్చిన
శృంగముల్ సమముగా వంగకుండుఁ
గొమలవంపులు సమానములు గామిని గార్మ్ము
కంబులో మెలి యున్నఁ గదలు శరము
దృఢముష్టిఁ గొనఁడేని తిరుగు బాణాసనం
బరచెయ్యి నొచ్చు సాయకము నడలు

స్థానంబునందు సౌష్ఠవమున నిలువక
నరివాడ శరము లక్ష్యమునఁ దప్పఁ
దగులీల నంగుళిత్రము బూన కరివాప
విశిఖముల్ విసరు మౌర్వియును సడలు
నంగుళిత్రము వట్రనై రంధ్ర మున్నచో
జాఱు బాణము పింజ సడల విసరు
బిగువుగా వివరమ్ము తగు నంగుళిత్రాణ
మంగుష్ఠమునకు నొప్పడరఁ జేయు
మృదువైన పెళుసైనఁ బదపడి గుణఘాత
మున నంగుళిత్రాణ మనువు దప్పఁ
బదను మిక్కిలి లేని బాణంబు తెగవాప
చెలఁగి లక్ష్యము తెంపు చేయకుండు
కఱ్ఱ తిన్ననగాని కాండంబు నడపిన
దూరంబు చని చని తోణఁకుచుండు
గఱులు మెత్తనివైన కఱకు లైనను బాగు
గాఁ గూర్చకుండినఁ గదలు శరము
నిండారఁ గుసికఱ్ఱనుండు రంధ్రమ్ములో
నలుఁ గూఁచకున్న సాయకము విఱుగు
వక్ర మైనను కఱ్ఱ వలమైన విశిఖమ్ము
చాపమధ్యము సోఁకి యేపు దఱుగు
సమముగా నరి సమర్చక శర మ్మరివాప
వెడలి క్రిందును మీఁదు విసరుఁ బింజ
యాకర్షణమ్ము జబ్బై తనర్చిన మార్గ
ణము సబాటమ్ముగా నడవకుండుఁ
జక్కఁగాఁ జూడ్కి లక్ష్యమునందు నిలుపక
తెగవాప విశిఖంబు దవులదందు
భావంబు చూడ్కితోఁ బ్రాకకున్నెడ లక్ష్య
భేదనోపాయంబు పాదుకొనదు

యేపుమై తగవాపునెడ వీపు గదలిన
కాండంబు చని చని కదలుచుండు
ధనువుచాటున రొమ్ము దాఁచకుండిన పోర
నరిమార్గణం బోలమాన గొనదు
కొమలు వంగిన ముష్టి కుదురుగా నిడఁడేని
జాఱు శింజినియును జాప మెడలు
బొమముడి కరినచాపము దీయునెడఁ గల్గు
నది సులక్షణము గాదంద్రు బుధులు
పలుమొన లధరంబుపై నూని తివియుచో
ముఖ మార్జవంబున మొనయకుండు
గడ్డంబు వెలిగడగా సాచి తివియుచో
శింజిని ఘాతంబుఁ జెందుచుండు,
నరములు కీళ్ళు తిన్ననఁగాక తివియుచో
నొక్కవేళ భరంబు నొందు మేను.
సకలాంగకంబులు చలియింప నరివాప
బాణంబు చంచలభావ మందు,
నిండారఁ దివియుచో నిశ్శ్వాస మొలసిన
కరినలక్ష్యము దూయఁగాన దమ్మ,
తివియుచున్నెడ నోరు దెఱచునేని కదంబ
కంబు లక్ష్యమునందు గాడ కుండు,
నాకుంచితమున నర్ధాంగంబు కుంచక
తెగవాప విశిఖమ్ము తేలి నడచు,
ప్రేరితమ్మున విస్తరిలి క్రోలుపులిరీతి
పెరుగఁడేని పరుండు భీతి గొనఁడు,
నెఱిపుంఖము బిగించి నినుపఁడేని శరంబు
దూరలక్ష్యములందు దూయ కుండు,
చాపముష్టి నలుంగు సమకొల్పఁడేని తూ
పడరి క్రిందును మీఁదు బడుచు నుండు,

వడిఁ బింజ సులకగా వదలఁడేని శరంబు
నడువ బుంఖముఁ బ్రాకుఁ గుడియెడమల,
సింహబులీల గర్జిలఁడేని పదిలుఁడై
తన బాణగమనంబు గను పరుండు,
రీవి డాకేలు ఝాడింపడేని శరంబు
పరుషలక్ష్యము దుస్సి పాఱకుండు,
తెగవాపి సమపరస్థితిఁ బూనలేనిచో
ధర ధనుర్ధరసమ్మతంబు గాదు,
సమపదంబున నుండి చాప మక్కునఁ జేర్చి
కౌగిలింపఁగ రాదు కౌశలంబు
తెగవాపి విశిఖంబు తెఱగుఁ గన్గొనఁడేని
తద్గుణాగుణదీక్ష దగులకుండు,

గీ. ఘనతవాటించు నలుబది కౌశలముల
సంప్రదాయంబు దెలుపు నాచార్యునొద్ద
సతత మభ్యాసమునఁ జేసి చాపధరుఁడు
నలువు దీపింప విశిఖముల్ నడుపవలయు. 169

వ వెండియు నిష్టదేవతాధ్యాన ప్రముఖంబులగు నిన్నలువది లక్షణంబులకుం దగిన విన్నాణంబు లాచరింపమిం బరగెడు బాణంబుల దోషంబులు మనంబున నాకలింపుచు వేర్వేఱ నయ్యైలక్షణంబులకుఁ దగిన కౌశలంబుల నయ్యైదోషంబులు పరిహరింపుచు, నలోలంబులును సత్వరంబులును, లక్ష్యశుద్ధిమంతంబులునుం గా శరంబులు నడుపందగు మఱియు శరగమనంబున దోషంబు ప్రాపించినం గాంచి యీ లక్షణంబున నిక్కౌశలం బాచరించిన నిర్దోషంబులు బాయు నని పన్నిదంబునం దల్లక్షణంబునం దత్కౌశలం బాచరించి నిర్దోషంబుగా శరంబు నడుపం జాలిన ధనుర్ధరుండు ఖండనంబులం బ్రచండమదకలశుండాలం బుద్దండశుండాదండంబునం గమలషండంబుఁ దెమల్చిన కరణిం బరవాహినీపతుల నతుల గతులం గుతలంబున శరక్షతుల

నుపహతులం జేయుచు సామ్రాజ్యపూజ్యులైం వర్తిల్లు మఱియు నుం
గల విశేషంబు లాకర్ణింపుము. 170

సీ. తగని వేగంబునఁ దెగవాప ఱెక్కల
మొదలు గాలిపు సోఁకి మ్రోయుచుండు,
నవుడు పుంఖము సోఁక నంగుళిత్రాణంబు
మును మున్ను తిరుగుచు మొరయుచుండుఁ,
దఱిఁదఱి నంగుళిత్రంబట్లు విఱిగిన
బాణంబు తిరుగుడు బడుచునుండు,
నాలీల మెలివారు వాలమ్ముఁ గడిదిల
త్యవిభేదనము సేయఁ జాలకుండు,

గీ. గావున యథార్థ మగు వేగ మావహించి
రూఢిఁ దర్జని నఖరమ్ము రొమ్ము సూడ
సరవి నంగుష్ఠనఖ మాకసమునుఁ జూడ
నోలి శరమోక్షణము సేయు టుచిత మంద్రు. 171

క. అతివేగమ్మున మొరసెడు
గతి దెలియక శరము జబ్బుగా నడచినచో
వితతముగ మొరయు ననుచును
గొతుకక పలుకుదురు ధరణిఁ గొందఱు ధన్విల్. 172

గీ. సంప్రదాయంబు దెలియని చాపధరుని
గాంచి విలువిద్య నేర్చిన కారణమున
తెలియ కీలీల మిగుల వాఁడింతు రనుచు
నెలమి దళుకొత్తగా నిర్ణయింపవలయు. 173

గీ. పింజసెలవులందుఁ బెలుచనొక్కటి వలం
బొకటి సన్న మగుచు నుండెనేని
యడరఁజేయువేళ నెడమకుఁ గుడికిని
నడుచు శరము పింజ సడలుచుండు. 174

వ. తాదృశవ్యపాయంబు పాయ నుపాయంబు గలదు. 175

క. సన్నంపుసెలవియోరం
  గ్రన్నన లక్కయిడఁ జక్కగాఁ జను మఱియున్
  జెన్నగు మూరట సెలవిం
  జెన్నారెడుతెక్క సడలించిన మెలిదీరున్ 176

క. సూత్రంబు జుట్టి కొంద ఱ
  పాత్రంబగు శరపుమెలిని బాపుదు రదియున్
  జిత్రంబై విలసిల్లును
  ధాత్రీసుర శుభనిదాన ధైర్యనిధానా. 177

వ. మఱియుఁ దులాదండాభంబైన కాండంబునకు నియోగం బుపన్యసించెద
  నాకర్ణింపుము. 178

మ. ఇలపైఁ గ్రుమ్మరు కొద్ది సత్త్వములపై హేరాళపుంధాటి మి
  న్నులకుం బ్రాకు పులుంగుమొత్తముపయిన్ భూజాగ్రశాఖాంతరం
  బులఁ గూర్చుండెడు నండజంబులపయిన్ బ్రోదిన్ బ్రయోగింపఁ దా
  వలమై యుండు ధనుర్ధరాళికిఁ దులాదండాభకాండం బిలన్. 179

వ. అదియునుం దత్తల్లక్ష్యంబుల నరి నమర్చు తెఱంగు లెఱింగించెద.

సీ. అఖిలాంబకములలో నల తులాదండాభ
    మరికి బెత్తెడు మించ నదుకవలయు,
  దూరలక్ష్యంబునఁ దొడగ బెత్తెంటిలో
    నర్ధాంగుళము తగ్గ నదుకవలయు,
  నతిదూరలక్ష్యమం దడలించుచో వింటి
    నడిరేఖమీఁదుగాఁ దొడగవలయు,
  గుఱినిఁబుంఖముఁ దాకఁ గోరిన నంగుళ
    ద్వితయమాత్రము క్రింద నదుకవలయు,

గీ. నవని వ్రాలెడు ఖగము లక్ష్యముగ విక్ర
మించఁగోపులు సరిగాఁగ వాంచి వింట
నమరిచి తరాజుకై వడి నడరఁజేయ
నగుఁ దులాదండసన్నిభంబగు శరంబు. 181

క. తరులన్ వ్రాలెడు పక్షిన్
బరసున నాకసమునందు బఱచు ఖగంబున్
బొరయఁ దులాదండశరం
బిరవందగ నేయు ధన్వి యిల నధికుఁడగున్. 182

చ. హరిణవిషాణమధ్యనిభమౌ నెడముంగల వృక్షశాఖలం
దిరమగు పత్త్రిపై జతను దిన్ననగాఁ దగువృక్షశాఖలం
దిరవగు పత్త్రిపైఁ గణక నేయఁగఁ బూనిన పృష్ఠభాగ మం
బరము గుణంబు భూతలము పాదుకొనన్ ధను వూనగాఁ దగున్.

క. తిన్ననగాఁ జను తరుశా
ఖ న్నెలకొను ఖగము నేయఁగాఁ బూనినచోఁ
బన్నిన నెడ గలుగం జని
క్రన్ననఁ దెగవాప విఱుగక నరి న్నడచున్. 184

క. ఒకశాఖ మీఁదుగా వే
ఱొకశాఖ పొసంగ నడుమ నుండెడు పులుగున్
రకమున నేయందగు తల
గక విలు తిర్యక్క్రమంబుగా నిడి శరమున్. 185

గీ. అట్లు క్రింద మీఁద నమరెడు కొమ్మల
వంక లుండెనేని వలను జూచి
ధనువు వాంచి నినుపఁదగుఁ దులాదండాభ
మగు శరంబు నినుచు నపుడు ధన్వి. 186

వ. అవి యివ్విధంబునఁ జతుశ్చత్వారింశల్లక్షణంబులు క్రమంబున వివ
రించి బ్రహ్మశిరంబును, నైంద్రాస్త్రంబును, నైశికంబును, బ్రహ్మా
స్త్రంబును, వరుణాస్త్రంబును, నాగ్నేయాస్త్రంబును, శిఖరాస్త్రం
బును, వాయవ్యాస్త్రంబును, హయశిరంబును, క్రౌంచాస్త్రంబును,
వైద్యాధరంబును, ప్రస్థాపనంబును, ప్రశమనంబును, సౌరాస్త్రం
బును, దర్పణంబును, శోషణంబును, సంతాపంబును, విలాపంబును,
మదనాస్త్రంబును, గంధర్వాస్త్రంబును, మోహనంబును, పైశాచం
బును, సౌమనసంబును, సంవర్తంబును, మౌసలంబును, సత్యాస్త్రం
బును, మాయావంతంబును, దేజఃప్రభంబును, దేజఃకర్షణంబును,
సోమశిరంబును, త్వష్ట్రుసుధామయంబులును, భగ్నాస్త్రంబును,
నారాయణాస్త్రంబును, పైనాకాస్త్రంబును లోనుగా ననేకదివ్యా
స్త్రంబులునుం, దత్ప్రతిసంహారంబులు నుపదేశించి, కరుణార్ద్రంబు
లగు కటాక్షవీక్షణంబు లొలయం బాండవమధ్యముం గనుంగొని
యిట్లనియె. 187

శా॥ శ్రీదంబుల్ సతతాభయప్రదము లశ్రీ వారకంబుల్ జయ
ప్రాదుర్భూతికి హేతుభూతములు సౌభాగ్యప్రదంబుల్ ధను
ర్వేదోక్తంబులు దేశికానుకలనావేద్యంబు లాద్యంబు లి
ట్లీ దివ్యాస్త్రము లన్నియుం బడసి తీ వేకాగ్రభావంబునన్ 188

సీ. బాణబాణాసనప్రకరంబు లునిచిన
వేశ్మంబు చొరఁజూచు వేళలందు
సభలలోఁ జిత్రలక్ష్యముల పన్నిదమున
విశిఖ మేయఁగఁ జూచు వేళలందు,
ధృతి లక్ష్యవేదికాదిక శరాభ్యాసముల్
వెలయింప విలుగొను వేళలందు,
సంగ్రామరంగ ప్రసంగసంగతులందు,
వెస నస్త్రమడరించు వేళలందు,

గీ. చరణసంక్షాళనం బుపస్పర్శనంబు
గురుపరంపరాధ్యానంబు గురుతరాస్త్ర
దేవతావందనము మహాదేవకీర్త
నము నరుండు యథావిధి నడుప వలయు. 189

మ. బలభిన్నీలనిభనీలదేహా వినమత్ప్రాణావనోత్సాహా ని
శ్చలకారుణ్యరసప్రవాహా కపిరాజన్యాహవవ్యూహా ని
స్తులదానోద్యమవారివాహా విశిఖక్షుద్ధారిసందోహా ది
గ్వలయారూఢయశఃప్రరోహా విగతవ్యామోహా భావోన్నతిన్. 190

మా. సదమలచిరకీర్తీ! సంవిదానందమూర్తీ!
మృదువచనవిచిత్రా! మేఘసంకాశగాత్రా!
వదనవిజితచంద్రా! వర్ణితాటోపసాంద్రా!
విదితకుశలధామా! వీరకోదండరామా! 191

గద్య. ఇది శ్రీమత్కౌసల్యానందన కటాక్షవీక్షణపరంపరాసాదిత కవితా విచిత్ర, మైత్రేయసగోత్ర, నృసింహగురుపుత్ర కృష్ణమాచార్య ప్రణీతంబైన ''ధనుర్విద్యావిలాసం'' బను లక్షణప్రబంధంబునందు, లక్ష్యశోద్ధిలాభంబును, లక్ష్యవేదికారచనావివేచనంబును, నారాచమోచన ప్రకారంబును, చిత్రలక్ష్యభేదనోపాయప్రతిపాదనంబును, శాబ్దలక్ష్యశరాభ్యాసవిలాసంబును, దూరనికటస్థలలక్ష్యభేదన దృష్టిముష్టినియమన లక్షణాన్వీక్షణంబును, రథారోహణశరాభ్యాసవిశేషభాషణంబును, గజారోహణశరప్రయోగవిభాగంబును, హయారోహణశరమోక్షణలక్షణంబును, దూరపాతిశరాభ్యాసవిస్తరప్రకీర్తనంబును, శరప్రయోగసమయాసనయనిరూపణంబును, శరగమనగుణదోషవిభాగంబును, దివ్యాస్త్రమంత్రతంత్రప్రయోగోప సంహారవిస్తరప్రస్తావంబును, లోనుగా గల విశేషంబుల సర్వంబును గల తృతీయాశ్వాసము. 192

---

Printed at the Rathnam Press, 11, Badrian Street, Madras—1